# శ్రీ రామ భక్తి

## స్తోత్రనామ కవచ వివరణలు



రచయిత్రి

**ఆర్ష హృదయాబ్జ శ్రీమతి [illegible] వెంకట [illegible] వరద**

[illegible]

# శ్రీ రామ షష్టి

## స్తోత్ర నామ కవచ వివరణములు



శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోప శాన్తయే ॥


ఆధ్యాత్మిక రచయిత్రి

"ఆర్ష హృదయాభిజ్ఞ"

శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి

శ్రీ బాబా భవన్, భారత్‌పేట, 1వలైను, గుంటూరు - 522 002 (ఆం.ప్ర)



"THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THE SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS"

తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయముతో ఈ పుస్తకం ముద్రితం.




# H.H. Tridandi Srimannarayana Ramanuja Chinna Jeear Swamy

The Jeear Educational Trust has
the honour and Privilege of conferring the Degree of

## Doctor of Devotional Literature
### Honoris causa

on

### Smt. R.V.S.V. Rajeswari

in view of Chaturamaspya Celebrations
in recognition and appreciation of her distinguished
Services to the advancement of learning and the
promotion of human Values

in Ubhaya Vedanta Pandita Sabhalu
at Jeear Educational Trust, Seethanagaram
held on Monday the 6th October 1997

Seethanagaram
6-10-97

His Holiness Tridandi Chinna
Srimannarayana Ramanuja
Jeear Swamy



సూర్యునివలె ప్రకాశమును చంద్రునివలె చల్లదనమును
భక్తజనులపై ప్రసరింప జేయువారును
నగుమోముతో కరుణాకటాక్ష వీక్షణములతో
ఆర్తులను, ఆశ్రితులను సేదదీర్చి దరిజేర్చుకొను వారును
కర్తవ్యమును బోధించి దారి చూపి గమ్యమును జేర్చువారును
వేద విశ్వ విద్యాలయ స్థాపకులు, శ్రీమన్నారాయణ స్వరూపులు,
నన్నాదరించి శంఖ చక్ర ముద్రాంకితురాలను గావించిన
నా గురు దేవులు, వైష్ణవ పీఠాధిపతులు

**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరు స్వామివారికి**

హార్ధిక భక్తి ప్రపత్తులతో

తొలి ప్రణామములు

ఆర్.వి.యస్.వి. రాజేశ్వరి

రామానుజదాసి



# అంకితం



## LATE SHRI. N.V.S. RAMA RAO

B.A., L.L.B., L.S.G.D.,

Announcer, All India Radio, Hyderabad.

*President* : A.P. Akasavani Announcers Association
*Vice President* : National Federation of A.I.R. Announcers
*General Secretary* : Eelapata Raghu Ramaiah Cultural Association (Regd.) Hyderabad



శ్రీ కృష్ణపాత్రలో శ్రీ N.V.S. రామారావు



# అంకితం



తమ్ముడూ, సీతారామ్
మన బాబాయి ఈలపాట రఘురామయ్యా
నీ పేరు వెంకట సీతారామారావయ్యా
ఆయనా అనేక వేషాలు వేశాడు
నీవూ ఎన్నో వేషాలు వేశావు
అయినా ఆయన కృష్ణుని వేషాల్లో రాణించాడు
నీవూ కృష్ణుని వేషాల్లోనే పేరు గడించావు
అందరికీ నీవు ఎల్లయ్య మామవు
నాకు మాత్రం తమ్ముడు సీతారామువు
ఎందుకో ఎలాగో ఈలోకానికి వచ్చాము
ఏవో ఐనవో కానివో చేశాము
ఎలాగో ఏవేవో నేను వ్రాస్తూ వచ్చాను
ఎవరి వాటికీ పట్టని యోగం వాటికి పట్టించావు
గవర్నర్లు ముఖ్య మంత్రులు ఉపరాష్ట్రపతులు
రాష్ట్ర పతులూ వాటికి నీవల్ల ఆవిష్కర్తలు
నామీద నీకెంత ప్రేమ
నీమీద నాకున్నది నేననవలసింది కాదు
ఏమిటి దీనికి కారణం ?
ఏకోదరులం కావటమా ?
ఏకోదరులెందరు లేరు ?
ఇలా ఉంటున్నారా అందరూ ?

ఆకాశంలో ఒక మెరుపులా మెరిసి
ఆ మెరుపులో అందరినీ మెరిపించి
ఎన్నేళ్ళో ఉండవలసిన వాడవు
ఎన్నేళ్ళున్నా ఏమైనా చేయగల వాడవు
ఎందుకో ఎక్కడికో
తొందరపడి వెళ్ళిపోయావు
ముందు పంపవలసిన వాళ్ళకంటే
ముందే పంపించుకొని వెళ్ళి పోయావంటే
ఎవరిని ఏమని ఏమనుకొని ఏం లాభం ?
అందరూ నీమాట వినాలి
అయినా నీవెవరి మాట వినవు
ఆకాశవాణి తత్త్వం అంతే కద
ఆకాశానికే వెళ్ళి పోయావు
నిన్నెరిగిన ఎవరూ నిన్ను మరవరు
నేనెలా మరవగలను ?
సీతారామ్, తమ్ముడూ,
శ్రీరామ భక్తి కంటే నేనేమివ్వగలను ?
ఇది నీది
ఇలా అందించే వంతు మాత్రమే నాది

- రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన పుణ్య దంపతులు



**SMT. & SHRI KILARU P. PRASAD GARU**
Prasad Acumeter Pvt. Ltd.,
Hyderabad.

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన



**SHRI K.P. [illegible] GARU**
Ex. Member of Parliament
Hyderabad.

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన



**SHRI T.R. PRABHU GARU**
B.Sc., B.Tech.,
Managing Director
Chaitanya Packagings Pvt. Ltd., Guntur.

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన



**Rtn. PHF. VEMU BHAVANARAYANA GARU**
President, B.H.H. Degree College & Junior College for Women
Guntur

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన పుణ్య దంపతులు



**SMT. & SHRI Dr. B.V. RAMA RAO GARU**
M.S.(Gen. Surgery), M.C.H. (Cardiac Surgery)
Chairman & Managing Director
Batreddi Hospital Pvt. Ltd., Hyderabad.
Victor Chang Heart Institute & Research Center
(New City Hospital), Secunderabad.
Badam Saroja Devi Memorial Hospital, Hyderabad

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన పుణ్య దంపతులు

**Dr. GORANTLA LAKSHMI NARAYANA GARU**
M.S. (GEN.), F.I.C.S., F.A.I.M.S.
**DR. GORANTLA ARUNA GARU**
M.B.B.S., D.G.O.
Jeevan Nursing Home, Guntur

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన

SHRI T. RAM GOPAL GARU,

Executive Director

Andhra Pradesh Industrial [illegible] Ltd.,

Hyderabad.

ఈ గ్రంథ ముద్రణకు విశాల హృదయముతో సహాయ సహకారము
లందించిన సహృదయ మాన్య మహోదయులు, సంఘ సేవాతత్పరులు,
దైవానుగ్రహ సంభూతులైన



**SHRI. M.H. RAO GARU**

Chief Executive

Andhra Pradesh Cement Manufacturer's Association

Hyderabad.




VEDIC UNIVERSITY
JEEAR EDUCATIONAL TRUST.
SITHANAGARAM - 522 501.
GUNTUR DISTRICT.

Date : 14 - 9 - 1997

**His Holiness**

**VAISHNAVA PEETADHIPATI**

***TRIDANDI CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMIJI***

SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

శ్రీమతే నారయణాయ నమః

## అనేక మంగళా శాసనములు

మానవుడు జ్ఞానం కల ప్రాణి. దేనిని గుర్తించాలో, గుర్తించి ఏమి చేయాలో మాత్రం తెలియని ప్రాణి. జగత్తును సృజించిన వాడొకడున్నాడని తెలిపిన వేదశాస్త్రము, ఈ జగత్తును ఇలానిలిపి ఉంచేవాడు, రూపు మార్చేవాడు కూడా వాడేనని ఘోషిస్తోంది. ఇందులోని వన్ని వాడి వల్ల నడుస్తాయి కనుక ప్రతి వస్తువులో వాడ్ని భావించి పని చేయాలని, అలానే నూరు నూరు సం॥ లు బ్రతకాలని ఆదేశిస్తోంది.

అదెలాగో, చూపించడం గూడ తన బాధ్యతగనే భావించిన ఆ వెనుక వాడ్ని 'భగవంతుడు' అంటాం. వానిని పిలుచునవుడు ఏకవచనంలో పిలిచేటంత సాన్నిహిత్యం మనకి అనుగ్రహించాడు. అంతేకాక, అవసర పడ్డపుడు తనే నేరుగానో, లేదా, ఎవరో ఒకరిని



**Sri Hampi Virupaksha Vidyaranya Maha Samsthanam**
(Pampakshetram) Vijayanagara Empire (HAMPI), Kamalapura Board,
Hampi Temple, Hampi Post - 583 211
Hospet Taluk, Bellary District,
Karnataka State.
Camp : HAMPI
Date : 15-7-97

**His Holiness**

**SRI HAMPI VIRUPAKSHAVIDYARANYA MAHA PEETADHIPATI**

**SRI SRI SRI JAGADGURU SHANKARACHARYA SRI MADHABHINAVODDANDA NARASIMHA BHARATHI MAHA SWAMIJI**

# MESSAGE

**To**
**Smt. R.V.S.V. Rajeswari**

*Regarding Sri Rama Bhakthi written in Sanskrit the same you have taken Translation into Telugu which work is carrying by you is satisfaction to me because Sri Rama Bhakthi is spreading at in Guntur Dt. which through from you is highly Indication of Sri Ramanama prasaram. God Sri Rama served to the people in his time is True life which Rama's life covered Maryada and Truth and honest and followed sanathana Dharma. Even remarkable nowadays peoples life lift Indication. Such base of Sri Ramachandra Murthy's Sri Rama Bhakthi poems to help all of peoples Bhakthi knowledge in high man kind. In this regard we bless to you God Sri Rama Chandra help you in your writing is sure we expects.*
*Nothing more to Pen.*

*Always at your service and at your door*

*with kind blessings*
*Sri V. V. Swamigalu*



Pushpagiri Mahasamsthanam
PUSHPAGIRI - 516 166
Mochampet, Cuddapah
Station : HYDERABAD
Date : 22-07-97

**His Holiness**

**SRI PUSHPAGIRI PEETADHIPATI**

**JAGADGURU SANKARACHARYA**
**SRI VIDYA NRUSIMHA BHARATHI SWAMIJI**

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య వర్యేత్యాది సమస్త బిరుదావళీ విరాజమాన శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు శ్రీ మదభినవోద్దండ శ్రీ విద్యానృసింహ భారతీ స్వామివారు అస్మదత్యంత ప్రియ శిష్యులు శ్రీమతి ఆర్. వి. యస్. వి. రాజేశ్వరి వారికి ఆశీఃపరంపరాపూర్వకముగా వ్రాయించి పంపు నారాయణ స్మరణ పత్రిక అనన్తరమ్

## మంగళా శాసనము

మేము ఈ మధ్య సంచార కార్యక్రమములో నున్నందు వలన, మీ ''శ్రీరామ భక్తి'' గ్రంథమును చూచుటకు వీలు లేకపోయినది. అందుచేవెంటనే మా అభిప్రాయము అందించలేకపోయినాము.

మీ ''శ్రీ రామభక్తి'' గ్రంథమును చూచినంతనే, మీకుగల శ్రీరామభక్తి అభివ్యక్తమైనది. భారత దేశములో చాలభక్తి సంప్రదాయములు అనూచానంగా వ్యాప్తిచెందినవి, చెందుచున్నవి.

ఉపనిషత్ ప్రతి పాదితమైన మోక్షమునకు భక్తి ప్రధాన ద్వార భూతము. వారి వారి సంప్రదాయములను అనుసరించి కులక్రమానుగతమైన, కులదైవమును ఆరాధించి తరించుట పరిపాటి. విచిత్రమేమన్నగా ఇతర భక్తి విశేషముల కంటే శ్రీరామ భక్తి విశేష ప్రాముఖ్యము సంతరించుకొనినది.

కృష్ణుని వలె శ్రీరాముడు ఆరాధ్యదైవమే, అయితే, ఆదర్శ ప్రాయమైన జీవితము నడిపిన ధర్మ విగ్రహకుడు, త్యాగమూర్తి శ్రీ రాముడు. సదాశివుని యంతటి దేవుడే శ్రీ రాముని ఆరాధించినాడు. దీని వలన శ్రీరామ చంద్రుని మహత్త్వ సంపన్నమైన దైవ సంపద ఇంతింత అని వర్ణించుట శక్యము గాదని తెలియును. అట్టి శ్రీరామ భక్తి యొక్క విశిష్ఠతను గూర్చి మీరు మీ గ్రంథములో చక్కగా వివరించినారు.

సంస్కృత మూలగ్రంథమునకు మీ అనువాదము చక్కని పుష్టి చేకూర్చినది. మీరు రచించిన ఇతర గ్రంథముల వలెనే ఈ గ్రంథము కూడ ఆంధ్ర దేశములో ప్రచారము పొంది వర్ధిల్లుగాక. శ్రీ శారదాచంద్ర మౌళీశ్వరుల అనుగ్రహము మీకు సర్వదా లభించుగాక అని ఆశిస్తున్నాము. శుభం భవతు.

ఇతి నారాయణ స్మృతి ః

శ్రీ విద్యా నృసింహ భారతీ స్వామి



**Avadhoota Datta Peetham**
**Sri Ganapati Sachchidananda Ashram**
Datta Nagar, Mysore - 570 004, INDIA.
Date : 18-6-97

**His Holiness**
**AVADHOOTA DATTA PEETADHIPATI**

*JAGADGURU SRI GANAPATI SACHCHIDANANDA SWAMIJI*

# ఆశీస్సందేశం

## శ్రీమతి R.V.S.V. రాజేశ్వరి

ముక్తికి భక్తి కన్నా సులభమైన మార్గం లేదు. ధర్మానికి రాముని కన్నా ఆదర్శమైన మూర్తి లేడు. ధర్మమూ భక్తి ఒకదాని కొకటి తోడైతే ముక్తి సులభతర మౌతుంది. రామ భక్తికి సదాశివుడే మూల ప్రవర్తకుడు. ఈ గ్రంథాన్ని ''శివం మహాభాగవతం నమామి'' అంటూ ప్రారంభించారు. శ్రీమతి రాజేశ్వరిగారి అనువాదం సుందరంగా సాగిన ఈ ''శ్రీ రామ భక్తి ''గ్రంథం ఆంధ్ర పాఠకులలో రామ భక్తి తరంగాలను ప్రేరే పించుగాక

శ్రీరాముడు అరణ్యావాసం చేసేటప్పుడు అత్రి అనసూయులను సందర్శించి ఆశీస్సులందుకొన్నాడు. శ్రీరామ పట్టాభిషేకానంతరం శ్రీ దత్తాత్రేయులవారు వచ్చి ఆయనను అభినందించి ఆశీర్వదించారు. ఈ విధంగా శ్రీరాముడికి, దత్తకుటుంబానికి తొలి చుట్టరికం వుంది. త్రిమూర్తిఅయిన శ్రీదత్తమూర్తి రామభక్తి కృతికర్త్రిని దీవించుగాక.

జయగురుదత్త



**SRI VIDYA PRAKASHANANDA GIRI SWAMIJI**

Sri Suka Brahma Ashram
Sri Suka Brahma Ashram (p.o.)
SRI KALAHASTI - 517 640,
Chittoor Dist. (A.P.)
Date : 15-7-97

***His Holiness***
***SRI SUKA BRAHMA ASHRAMA PEETADHIPATI***

# సందేశము

"శ్రీ రామ భక్తి" అను తెలుగు పుస్తకమును శ్రీమతి రాజేశ్వరి గారు అనువదించుచున్నట్లు తెలుసుకొని సంతోషమైనది.

"భక్త్యా జ్ఞానం ప్రజాయతే"

అనునట్లు దైవభక్తి భగవత్ప్రేమ వలన జీవునకు ఆత్మజ్ఞానము సంప్రాప్తమై మోక్షము కరతలామలకమగు చున్నది. కనుక మానవులలో భగవద్ భక్తి అభివృద్ధియగుటకు భాగవత కథలు, భగవల్లీలలు, భగవంతుని స్తోత్రములు, భజనలు మిక్కిలి ఉపకరించును. అట్టి గ్రంథములలో ఒకటి 'శ్రీ రామ భక్తి' అను గ్రంథము.

భగవత్కృప వలన ఈ గ్రంథము త్వరలోనే ముద్రితమై అశేష జనావళికి భక్తి రసమును, శాంతిని, ఆనందమును కలుగ జేయ గలదని అకాంక్షించు చున్నాము. సర్వేశ్వరుడు అనుగ్రహించుగాక!

ఓమ్

శ్రీ విద్యా ప్రకాశానంద గిరిస్వామి



JAGADGURU SRI SIVA
CHIDANANDA BHARATHI SWAMIJI

COURTALLAM - 627 802.
(Via.) Tenkasi -- Tirunelvelli Dist.
South India.
Date : 20-7-1997
ఈశ్వర నామసంవత్సర ఆషాడ పూర్ణిమ

**His Holiness**
**SRI SIDDHESWARI PEETADHIPATI**

# With Narayanasmritis

*మగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే!*

*జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరే*

వాక్కు, అర్థమునకు ఏ విధమైన అవినాభావము కలదో అటువంటి అవినాభావము గల అభేద స్వరూపులైన జగత్తుకు పితరులైన పార్వతీపతి రమాకాంతులకు నమస్కరించిన హరిహర సాంప్రదాయము మనది.

''సత్యమ్ జ్ఞాన మనంతం బ్రహ్మ''

అని చెప్పబడే పరబ్రహ్మ ఈ చరాచర జగత్తు సృష్టిస్థితిలయములు తన విభూతి రూపములైన బ్రహ్మ – విష్ణు – మహేశ్వర రూపములలో నిర్వర్తించు చున్నాడు. ఈ బ్రహ్మ– విష్ణు – మహేశ్వర తత్త్వసమామ్నాయమే పరబ్రహ్మ తత్త్వము.

''యథా యదాహి ధర్మస్యగ్లా నిర్భవతి భారత''

అని గీతలో చెప్పిన విధముగా స్థితికారకుడు వివిధ రూపములలో వివిధ అంశలతో అవతారములు దాల్చి దుష్ట శిక్షణ – శిష్ట రక్షణ చేయును. ఆ విధముగా రాక్షస సంహారము నిమిత్తము స్థితి కారకుడైన శ్రీ మన్నారాయణుడు రామావతారం దాల్చి శిష్ట రక్షణ చేసినాడు – రామావతారం చాలా ఉత్కృష్టమైనది – ఆదర్శమైనది.

''రామో విగ్రహా వాన్ ధర్మహః''

అని సత్య ధర్మములకు ఆలవాలమైన పురుషోత్తముడు శ్రీరాముడు కవికోకిలం అని చెప్పబడిన వాల్మీకి మహాకవి విరచిత రామాయణం ఉత్కృష్టమైనది, నిత్యపారాయణ యోగ్యమైనది. గాయత్రి మహా మంత్రార్థము సూత్ర ప్రాయముగా నిర్వహించబడిన పవిత్ర గ్రంథము రామాయణము. వాల్మీకి రామాయణం తరువాత అనేక రామాయణములు ప్రచారం లోనికి వచ్చినవి.

''చరితం రఘునాదస్య శత కోటి విస్తరం''

అని ఎంతో మంది ఎన్నో విధములుగా రామతత్త్వాన్ని చెపుతూ వచ్చారు. శ్రీ మన్నారాయణ అష్టాక్షరి మహామంత్రమైన –

''ఓం నమో నారాయణాయ'' లోని ''రా'' బీజము, శివ పంచాక్షరి మహా మంత్రమైన –

''ఓం నమ శివాయ'' లోని ''మ'' కార బీజ సంపుటచే ఏర్పడిన శివ కేశవ సమన్వయ స్వరూపమే ''రామ'' మంత్రమైనది. ఆ హరిహర అభేద తత్త్వమే శ్రీరాముడు. అభేద తత్త్వ నిరూపణమే సీతారామ చంద్రులచే రామేశ్వరము లో ప్రతిష్ఠింప బడిన ''రామ లింగే శ్వరుడు''.

ఆటువంటి పురుషోత్తముడైన రామతత్త్వాన్ని బహు గ్రంథ రచయిత్రి, భాషా రత్న శ్రీమతి R.V.S. రాజేశ్వరి గారు, ఈ గ్రంథ రచన ద్వారా ప్రపంచానికి అందివ్వడం ఎంతో ప్రశంసనీయం.

శ్రీ సిద్ధేశ్వరీ పీఠ అధిష్ఠాన దేవత శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతా నుగ్రహముచే మీరు ఆవిష్కరించే శ్రీరామ భక్తిని పాఠకులు గ్రహించి తరింతురు గాక.

''శుభం భూయాత్''

నారాయణ స్మృతులతో
శ్రీకుర్తాళ సిద్ధేశ్వరీ శంకరాచార్య
శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతీ మహాస్వామి.



విశ్వమందిరము
గుంటూరు
తేది : 27–9–'97

**విశ్వమందిర పీఠాధిపతి**

**భగవాన్ శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్**

# దివ్యాశీస్సులు

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥"

అనవర్తము శ్రీరామ నామ స్మరణము చేస్తూ స్వానందామృత తృప్తితో ధ్యాన నిమగ్నుడై ఉండే వైష్ణవులలో కెల్లా పరమ వైష్ణవుడు పరమేశ్వరుడు. రామ నామ మహిమ అనంతము, అనిర్వచనీయము. రామ అన్నమాట బోయవాడైన వాల్మీకిని తపస్విగా, మహాశక్తి సంపన్నునిగా మార్చివేసినది. జరగబోయే రామాయణాన్ని ముందుగానే ఊహించి వాల్మీకి చేత వ్రాయించ గలిగింది. రామ నామము కోతిని పరబ్రహ్మ స్వరూపముగా చిరంజీవిగా మార్చినది. రామ నామము బరువైన రాళ్ళను నీళ్ళపై తేలునట్లుగా చేసి వారధి కట్టించ గలిగింది. రామ నామము ఎందరో వ్యక్తులను భక్తులుగా, మహా గాయకులుగా, బోధకులుగా, స్వచ్ఛమైన రాజకీయ నాయకులుగా మార్చినది. భక్త కబీర్ కూడా "రామ్‌నామ్‌కే జొదా భాయీ" అని కీర్తించినాడు. రామ నామ మహిమ అనంతమైన దివ్య ప్రేమామృత సాగరము వంటిది.

శ్రీరాముడు ఆదర్శ మానవుడు. పరిపూర్ణ మానవత్వమునకు ప్రతీక శ్రీరామ చంద్రుడు. తాము నోటితో చెప్పక మనిషి ఏవిధముగా సంచరించాలో ఆచరించి చూపిన ఆదర్శ పురుషుడు శ్రీరామ చంద్రుడు. ధర్మ స్వరూపమే శ్రీరామ చంద్రుడు. అందుకనే "రామో విగ్రహవాన్ ధర్మహః" అన్నారు.

అట్టి రామచంద్రుని, రామ నామ ప్రభావమును ఆంధ్ర పాఠక లోకానికి వివరించ దలిచింది శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి. దీనిలో నామాదులు, అష్టోత్తరములు, స్తోత్రములు అన్నియు సవివరముగా, తాత్పర్య సహితముగా వివరించ బడింది. "శ్రీరామ భక్తి" అనే పేరుతో అమృత హృదయిని రోహిణి తయారు చేసిన ఈ గ్రంథము ఆద్యంతము భక్తి భరితము, ఆనంద ప్రదమము. శ్రీరామ నామములోని ఔచిత్యమును, విశేషమును, శక్తిని తాను గ్రహించి, అనుభవించి సమాజమునకు అందించినది చిరంజీవి రోహిణి. ఈ గ్రంథ రచన ద్వార చిరంజీవి రోహిణి చిరంజీవి అయినది. ఆమె జన్మ సార్థకము అయినది. వినయ వినమ్ర శీలి అయిన రోహిణి ఇదివరకెన్నో ఆధ్యాత్మిక గ్రంథములను అందించి యున్నది. పలువురు పీఠాధిపతుల, రాష్ట్ర పతుల, మంత్రుల, యోగుల ప్రశంశలను, ఆశీస్సులను అందుకున్నది. విద్యా వినయ సంపన్నురాలు రోహిణి అనుట ఎంత మాత్రము అతిశయోక్తి కాదు. ఆంధ్ర భక్త కోటి యావత్తు ఈ గ్రంథాన్ని చదివి ఇందులోని అర్థాన్ని, అంతరార్థాన్ని, విశేషార్థాన్ని సమూలంగా తెలిసికొనగలరని, అడుగడుగునా కనిపించే రోహిణి హృదయాన్ని అనుభూతిలోనికి తెచ్చుకోగలరని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, ఆశీస్సులను అందజేస్తున్నాను. చిరంజీవి రోహిణిని మనసారా అభినందిస్తూ ఆమె కలము ద్వారా ఇంకా ఎన్నో, ఎన్నెన్నో ఆధ్యాత్మిక గ్రంథాలు వెలువడాలని ఆకాంక్షిస్తున్నాను.

**ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త**





*President's Secretariat*
*Rashtrapati Bhavan*
*New Delhi - 110 004*
Date : 19th June, 1997

*DR. SHANKER DAYAL SHARMA*
*President of India.*

**Dear Smt. Rajeswari,**

The President of India, Dr. Shanker Dayal Sharma is happy to know that a Devotional book entitled "Sri Rama Bhakthi" has been translated from Sanskrit version to Telugu by you.

The President wishes your endeavours every success.

Yours Sincerely,
*(Akshey Kumar)*
Deputy Press Secretary
to the President.





**PRIME MINISTER'S OFFICE**
**NEW DELHI-110 011**

Date : July 24, 1997

*I.K. GUJRAL*
*Prime Minister of India*

***Dear Smt. Rajeswari,***

*The Prime Minister is glad to know that you have completed a devotional book "Sri Rama Bhakthi" which was originally written in Sanskrit and Tirumala Tirupathi Devasthanam has come forward to help in publication of this book.*

*The Prime Minister sends his compliments and good wishes for your work.*

*With regards,*

*Yours sincerely,*
*(B.S. Chauhan)*
*Deputy Secretary*



జన్నాభట్ల వీరేశ్వరశాస్త్రి
బాషాప్రవీణ, ఎం. ఎ.
విశ్రాంతాంధ్రోపన్యాసకుడు
సంపత్‌నగర్ - గుంటూరు - 4
తేది.17-6-1997.

# భక్తి నివేదనము

రామ భక్తి రస భావితా మతిః
క్రీయ తాం యది కు తో ఉపి లభ్యతే
తస్య మూల్య మిహ లౌల్యమేకలం
కామ్య కోటిసుకృతై రవాప్యతే

రామ భక్తి రసముతో పరిపూర్ణమైన - పొంగిపొరలు మతి ఎక్కడనైన లభించినచో కొనుము. శ్రీ రాముని కొఱకు నిరంతరము తహ తహ లాడుటయే - లాలసత ఒక్కటి మాత్రమే మూల్యము. జన్మజన్మాంతరము లందు సంపాదించిన అనేక కోటుల పుణ్యముల ఫలమే ఈ లౌల్యమేర్పడుట.

రమంతే యోగినో ఉనంతే నిత్యా నందే చిదా త్మని
ఇతి రామ పదే నాసౌ పరం బ్ర హ్మా భి ధీయతే

(శ్రీ రామ పూర్వతా పిన్యుపనిషత్)

నిత్యా నందస్వరూపుడు, అనంతుడు, చిన్మాత్రుడు, నగు పరమాత్మ యందు యోగు లగువారు స్వీయ మనస్సులను లయము చేయుదురు. కావున ఆ పరబ్రహ్మయే రామ అను పదముతో చెప్ప బడుచున్నాడు.

"రము క్రీడా యాం" అను ధాతువునకు రమతే ఇతి రమ్ + ణ", అని గాని రమ్యతే అనేన రమ్ + ఘఞ అనువ్యుత్పత్తులతో రామ శబ్ద మేర్పడును.

రమించువాడు, రమింపజేయువాడు అని ఈ పదమున కర్థము. రాములు పురాణ ప్రసిద్ధులు ముగ్గు రున్నారు. పరశు రాముడు, దశరథ రాముడు, బల రాముడు. మొదటి వాడు భృగు వంశీయుడు. ఒకప్పుడు భృగువు అగ్ని దేవుడు అంతర్థానము నందగా తాను అగ్ని కర్తవ్యమును కొంతకాలము నెర వేర్చెను. కావున భార్గవ రాముడు అగ్ని వంశీయుడు, దశరథరాముడు సూర్య వంశీయుడు. బల రాముడు చంద్ర వంశీయుడు. వీరిలో నిరుపాధికుడుగా ప్రసిద్ధుడు శ్రీరామ చంద్రుడే. రామ అను పదములో ర్ + ఆ + మ – అను మూడక్షరము లున్నవి. రేఫ అగ్ని బీజాక్షరము. ఆ కారము సూర్య బీజాక్షరము, మ కారము చంద్ర బీజాక్షరము. ఈ ముప్పురును తేజో రూపులు. ఈమూడు తేజస్సుల సమూహ రూపమే రామ పదము. కావుననే వాల్మీకి రామాయణము అయోధ్యా కాండలో–

''సూర్య స్యాపి భవే త్సూ ర్యో హ్యగ్నే రగ్నిః ప్రభోః ప్రభుః'' శ్రీరాముడు సూర్యునికి సూర్యుడు, అగ్నికి అగ్ని, సర్వ కాంతివంతులను మించిన కాంతి గల ప్రభువు'' అని కలదు.

శ్రీరామ నామ ప్రభావమును వేదములు, ఇతి హాసములు, పురాణములు, తంత్రములు, సూత్ర గ్రంథములు, కావ్యములు మున్నగునవి పలు రీతులుగా ప్రశంసించియున్నవి. రామ రహస్యో పనిషత్తు, రామ పూర్వతా పిన్యు పనిషత్తు, రామోత్తరతా పిన్యు పనిషత్తు మున్నగు నుపనిషత్తులు నిరాకార నిర్గుణ తత్త్వమే సాకార సగుణ తత్త్వ శ్రీరామునిగా నవతరించె నని పల్కినవి. వాల్మీకి, వ్యాసుడు, వసిష్ఠుడు, అగస్త్యుడు, అత్రి మున్నగు మహర్షులు, రామానందుడు, కబీరు, తులసీదాసు, సూరదాసు, మీరాబాయి, గురునానక్ దేవ్, అనేక మహమ్మదీయ కవులు, జైనులు శ్రీరామ చంద్రుని గుణగ్రామ పుణ్యారణ్య విహారులై ధన్యులైరి.

సంస్కృతములో ఆనంద రామాయణము, అధ్యాత్మ రామాయణము, ఆశ్చర్య రామాయణము మున్నగు రామాయణములు అవిర్భవించినవి. కాళిదాసాదులు కావ్యములను, భవభూతి, మురారి, జయదేవుడు – వీరికందటి కన్న పూర్వుడు భాస మహాకవి నాటక రూపముగా రామ కథను రచించిరి. భారతీయ భాషలన్నింటిలోను పుణ్యశ్లోకుడగు శ్రీరాముని గుణ లీలా విశేషములు బహుధా ప్రపంచితము లైనవి.

విదేశము లందును శ్రీరామ చరితము వారి వారి సంస్కారాను గుణ ముగా నవతరించినది. శ్రీలంక, మలేషియా, ఇండోనేషియా, మంగోలియా, కంబోడియా, లావోస్ మొదలైన ఆగ్నేయాసియా దేశ వాసులకు శ్రీరామ వృత్తి పరమ ప్రీతి కరము. ప్రశస్త ప్రపంచ కావ్యములు 15 లో రామాయణ మొకటని విదేశీయుల అభిప్రాయము. రామాయణమునకు ప్రతి ధ్వనియే హోమర్ రచించిన ఇలియడ్ అని ఒక పాశ్చాత్య విద్వాంసుని నిర్ణయము. ''ఆర్థరు గాథలకు గల ప్రచారము, షేక్స్పియర్ రచనలలోని సాహిత్య శక్తి, బైబిలుకు గల ప్రామాణికత్వము. ఈ గుణత్రయము ముప్పిరి గొన్నదే రామాయణము'' అని మఱియొక పాశ్చాత్య పండితుని సిద్ధాంతము. ఈ విషయముల వలన ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యములకు శిరోభూషణము శ్రీమద్రామాయణ మని నిర్ణీత మైనది. కావుననే

యావత్ స్థాస్యంతి గిరయః సరిత శ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచలిష్యతి.

భూగోళము పై పర్వతములు నదులు ఉన్నంతకాలము లోకములలో రామాయణము సర్వవ్యాపియగును అని బ్రహ్మ దేవుడు వాల్మీకికి చెప్పినది త్రికాలా బాధిత సత్యముగదా! ఎక్కువ మంది రామాయణ రచయితలు శ్రీరామ భక్తులు. ఆయనయే పరదైవ మని త్రికరణ శుద్ధిగా నమ్మినవారు. కావున ఆయన మాయా మానుష విగ్రహుడు. ''స్నేహమును, దయను, సత్యమును, జానకీ దేవిని ప్రజాసేవలో అవసరమైనచో పరిత్యజింతును. అందులకు నేను చింతింపను'' అని పలుకుటయేగాక తదను సారము నడచుకొన్న ఆదర్శ పురుషోత్తముడు శ్రీరామ చంద్రుడు. జాతి మత వివక్ష లేని అనంత భక్తసముదాయ సము పేతుడు రామ భద్రుడు.

తపఃస్వాధ్యాయనిరతు డగు నారదనుహర్షిని తపస్వియగు వాల్మీకి ''కో న్వ స్మిన్ సాంప్రతంలోకే గుణ వాన్'' ''ఇప్పుడు లోకములో గుణవంతు డెవడు? వీర్యవంతు డెవడు?'' అని 16 ప్రశ్నలను వేసెను. త్రిలోకజ్ఞు డగు నారదుడు ప్రశ్నలకన్న మూడు రెట్లు శ్రీరాముని అనంత కల్యాణ గుణములను ''నియతాత్మా'' అని ప్రారంభించి ''సత్యే ధర్మ ఇవాపరః'' అని 68 సంఖ్యతో ప్రస్తుతించెను. శ్రీరాముని పరిపూర్ణస్వరూప విషయసూచి ఈ వర్ణనము. అట్టి లోకోత్తరగుణోత్తరుని స్వరూప స్వభావములను వాల్మీకి అయోధ్యా కాండలోను సుందర కాండలోను తనివి దీర వర్ణించెను. వాల్మీకి సగుణ స్వరూపమును సర్వోన్నతముగ వర్ణింపగా అధ్యాత్మ రామాయణము శ్రీరాముని సచ్చిదానంద

ఘనము, శుద్ధబుద్ధము, నిరాకారము, నిర్గుణము, సర్వకారణ కారణముగా పలికి స్వీయ నామమును అర్థవంతము చేసికొన్నది.

యథైవ వట బీజస్థః ప్రాకృత శ్చ మహాన్ ద్రుమః
తథైవ రామ బీజస్థం జగదేత చ్చరా చరమ్.

మఱ్ఱిగింజ ఆ వగింజ కన్న చిన్నది. కాని దానినుండి అంకురించి పెరిగి ఊడలు నేల లోనికి దిగి మహావృక్ష మైన మఱ్ఱిచెట్టు వృక్షము లన్నింటికన్న పెద్దది. ''విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?'' అంతటి మహావృక్షపు సూక్ష్మాణువులు వట బీజములో నున్నట్లే చరా చరము – స్థావరజంగమాత్మక మగు ఈ ప్రపంచ మంతయు 'రామ' అను బీజములో నున్నది. అనగా సూక్ష్మరూపము రామ నామము, స్థూల రూపము జగత్తు'' అని రామపూర్వతాపిన్యు పనిషత్తు పలుకుచున్నది.

భరణః పోషణాధారః శరణ్యః సర్వ వ్యాపకః
కరుణః షడ్గుణైః పూర్ణః రామస్తు భగవాన్ స్వయమ్.

''సమస్తచరాచర జగత్తును భరించువాడు, పోషించువాడు, ఆధార మైనవాడు, శరణు గోరు వారికి అభయ మిచ్చువాడు, అణువు నుండి అనంతము వఱకు సమస్తమును వ్యాపించి యుండువాడు, కరుణారస పరిపూర్ణుడు – ఈ చెప్ప బడిన షడ్గుణములు సంపూర్ణముగా గల శ్రీరామ చంద్రుడే స్వయముగా భగవంతుడు'' అని మహారామాయణము నుడువుచున్నది.

పూర్ణః పూర్ణా వతా రశ్చ శ్యామో రామో రఘూ ద్వహః
అంశా నృసింహ కృష్ణాద్యాః రాఘవో భగవాన్ స్వయమ్.

''పరిపూర్ణుడు, పూర్ణావతారుడు, నల్లని వాడు. రఘు వంశ శ్రేష్ఠ డగు శ్రీరామ భద్రుడే స్వయముగా భగవానుడు, నృసింహ స్వామి, శ్రీకృష్ణుడు మున్నగు నవతారములు అంశావతారములు'' అని బ్రహ్మ సంహిత అను చున్నది. ఈ ప్రమాణములచే శ్రీరాముడు పూర్ణావతార మని నిర్ణయ మగుచున్నది.

శ్రీరామ నామామృత మంత్ర బీజ
సంజీవనీ చే న్మసి ప్రవిష్టా
హాలాహలం వా ప్రళయానలం వా
మృత్యో ర్ముఖం వా విశతాం కుతోభీః?

శ్రీ రామ నామ మనెడు అమృత మంత్రములోని బీజాక్షర రూపమగు సంజీవని మనస్సులో ప్రేశించినచో అట్టి అమృత తుల్యులకు హాలాహాల మను లోక భయంకర విషమును గాని సర్వసృష్టిని భస్మముచేయు ప్రళయకాలాగ్నిని గాని మృత్యు ముఖమును గాని ప్రవేశించుటకు భయమేల?'' అని ఆనంద రామాయణము ప్రశ్నించుచున్నది. మృత్యు వను నది పాంచ భౌతికదేహమునకే గాని అందుండి రామ నామస్మరణముతో ముక్త జీవునకు గాదు.

శ్రీ మహా విష్ణువు శ్రీరాముడుగను, లక్ష్మీదేవి సీతగను, ఆదిశేషుడు లక్ష్మణుడుగను, శంఖ చక్రములు భరత శత్రుఘ్నులుగను జనించిరని పురాణ ములు చెప్పుచున్నవి. కాని శ్రీరామోత్తరతాపిన్యు పనిషత్తులో నింకొక రీతిగ నున్నది. ఓం కారములో అకారము, ఉకారము, మకారము, అర్ధమాత్ర అని నాలుగున్నవి. వానిలో లక్ష్మణుడు ప్రణవములో నున్న అకారము నుండి ప్రభవిం చిన వాడు. ఆయన జాగ్రదవస్థకు అభిమాని సత్త్వగుణి యగువిశ్వుడు. ఈయన చతుర్వ్యూహములలో సంకర్షణుడు. శత్రుఘ్నుడు ప్రణవములోని ఉకారము నుండి పుట్టినవాడు. రజోగుణియు ఈయన స్వప్నాభిమాని యగు తైజస్వ రూపుడు. ఈయన ప్రద్యుమ్నాంశ గలవాడు. భరతుడు మకారాక్షరము నుండి సంభవించిన వాడు. సుషుప్త్య వస్థకు అభిమాని తమోగుణియు ప్రాజ్ఞరూపు డగు ఈయన తమో గుణ విశిష్టుడు. ఈయన అనిరుద్ధాంశ శోభితుడు. బ్రహ్మానందమే ఆకారము దాల్చిన శ్రీ రామ చంద్రుడు అర్ధమాత్రా స్వరూపుడు. త్రిగుణాతీతుడు. తురీయావ స్థాజ్ఞేయుడు. చతుర్వ్యూహ ములలో నీయన వాసుదేవనామ ప్రసిద్ధుడు. సృష్టిస్థితి సంహారకారిణి యగు సీతాదేవి మూల ప్రకృతి. శ్రీరామ సాన్నిధ్యమాత్రముననే ఆమె సృష్ట్యాదుల నొనర్చును.

''సా పరానురక్తి రీశ్వరే'' భగవంతుని యందు మహత్తర మగు అనురక్తియే భక్తి. ''భజసేవాయాం'' అనుధాతువునకు ''క్తిన్'' ప్రత్యయము చేరగా భక్తి అను రూప మేర్పడును.

యా ప్రీతి రస్తి విషయే ష్వవివేక భాజాం
సై వాచ్యతే భవతి భక్తి పదాభి ధేయా.

అజ్ఞానులకు పుత్రమిత్రకళత్రాదులందు, స్రక్చందనాదులందు, ఇంద్రియ విషయము లం దుండు ప్రీతినే భగవంతునిపై నుంచిన భక్తి యనబడును. ఆ

భక్తి నవ విధములు. భక్తి రసామృత సింధువు, వీరమిత్రో దయము భక్తి ప్రకాశము మున్నగుగ్రంథములు ఆయా భక్తులలోని భేదములను నానావిధముల వివరించినవి

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం

అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్

భగవంతుని గుణములను లీలలను వినుట, సంకీర్తనముచేయుట, స్మరించుట, పాదసేవనము, అర్చించుట, నమస్కరించుట, దాస్యము చేయుట, సఖ్యము, ఆత్మనివేదనము అని భక్తి నవవిధ మని భాగవతములో ప్రహ్లాదుడు చెప్పెను. రామాయణములోని నవవిధభక్తిని ఒక శార్దూల విక్రీడిత వృత్త మిట్లు చెప్పుచున్నది.

ధన్యో రామకథాశ్రుతౌ చ హనుమాన్, వల్మీకభూః కీర్తనే,
సీతా సంస్మరణే, తథైవ భరతః శ్రీపాదుకాసేవనే,
పూజాయాం శబరీ, ప్రణామకరణే లంకాధిపో, లక్ష్మణో
దాస్యే, సఖ్యకృతే ఉర్కజో, వ్యపహ తత్ప్రాణో జటాయుః స్వయమ్.

శ్రీరామకథాశ్రవణభక్తిలో హనుమంతుడు, సంకీర్తన భక్తిలో వాల్మీకి మహర్షి, స్మరణభక్తిలో సీతాదేవి, పాదసేవ భక్తిలో భరతుడు, అర్చనభక్తిలో శబరి, వందనభక్తిలో విభీషణుడు, దాస్యభక్తిలో లక్ష్మణుడు, సఖ్యభక్తిలో సుగ్రీవుడు, ఆత్మనివేదనభక్తిలో జటాయువు ధన్యులైరి. వీని సమన్వయము విషయాంతర మగును.

ఈ గ్రంథము పేరు ''శ్రీరామభక్తి''. ప్రతిపేజీలోని విషయమును శ్రీరామ నామము చుట్టుముట్టి అలంకరించియున్నది. శ్రీరామచంద్రునియందు తల్లిదండ్రులకు గల వాత్సల్య భక్తి, అనేక మహర్షులకు గల అనన్య భక్తి, సోదరులకు గల మహత్తర భ్రాతృభక్తి, సీతాదేవికి గల భర్తృ భక్తి మున్నగు ననేక పుణ్యాత్ముల, పుణ్యశీలల భక్తి ఈ గ్రంథములో విస్తృతి నందినది. పఠితలకు వారివారి చిత్త సంస్కారానుసారము ఇందలి కొన్ని విషయములు హృద్గతము లగును. శ్రీరామ సహస్రనామము, అష్టోత్తర శత నామములు, కవచములు వివరణతో నుండుటచే పాఠకులకు తద్గత విషయము సులభము, సుగమము కాగలదు. భగవంతుని నామాదికమును అర్థము చేసికొని స్వామిని అర్చించుటలో అధికానందము కలుగునుగదా!

శ్రీ గీతా ప్రెస్ వారు ప్రకటించిన ''శ్రీరామభక్తి అంక్'' అను కల్యాణ్ పత్రికా విషయములు, సహస్రనామాదులకు అనేకా పూర్వవిషయ సంశోభిత మగు ఆనంద రామాయణము ఈ గ్రంథమున కాధారములు. సహస్ర నామాదులు శ్రీరామచంద్రుని అనంత కల్యాణ గుణములను వివరింపగా కవచములు పాఠకులకు రక్షాకవచము లగును. పూర్వము యుద్ధములలో వీరులు శత్రువుల ఆయుధాఘాతములు తగులకుండుటకు లోహనిర్మిత కవచములను ధరించెడివారు. మనము గూడ ఆధివ్యాధులు, సాంసారిక బాధలు అను శత్రువులతో నిరంతరము పోరాటము సలుపుచున్నాము. వానినుండి శ్రీరామ కవచాదులు మనలను రక్షించును. అక్షర రూపుడగు శ్రీరాముడు తత్పాఠకులను ప్రతిపదము ఆదుకొనును. విశ్వాసము ముఖ్యము.

మణిహారమును వలె ఈ గ్రంథ గత విషయములను శ్రద్ధాభక్తులతో సముచిత రీతితో ఏర్చి కూర్చి శ్రీరామ భక్త లోకమునకు సమర్పించిన సాధ్వీమతల్లి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి గారు. సాంసారిక సమస్యలలో మునిగితేలుచును వీరు తామరాకుపై నీటిబొట్టువలె మెలగుచు బహుకాలము నుండి పలుగ్రంథములను రచించిన, రచించుచున్న, రచియింప బోవు పావన రచయిత్రి. హిందీ అనువాదము అను భావము ఎక్కడను కన్పింప కుండునట్లు వీరు నైపుణ్యముతో దీనిని రచించిరి. అనేక సహస్రనామ వివరణము లనే కాక మహాగ్రంథ మగు గర్గసంహితను భాగద్వయముగా ప్రచురించుట వీరి అవిశ్రాంత మహత్తర కృషికి నిదర్శనము. ఇన్ని గ్రంథములు రచించినను అహంకారము ఆవంతయు లేక సామాన్యగృహిణిగా నుండి కర్తవ్యదక్ష యగుట వీరి చిత్త సంస్కారమున కుదాహరణము. ''తల్లికి తగిన తనయుడు'' అను క్రొత్త సామెతకు నుదాహృతిగా వీరి ద్వితీయ పుత్రుడు ఆయుష్మంతుడు మహేశ్ గ్రంథముద్రణలో అడుగడుగున తీసికొన్న శ్రద్ధ ప్రశంసనీయము. ఈ గ్రంథ పరిశీలనములో అవకాశము కల్పించి మా పితరుల, శ్రీరామశరణ్ గురుదేవుల, ఆత్మారాముడగు శ్రీరామచంద్రస్వామికి సేవచేయు భాగ్యము కల్పించిన రచయిత్రికి హార్దిక కృతజ్ఞతలు. ఇంకను బహుగ్రంథ రచనా ,బాగ్యమును, ఆరోగ్యభాగ్యమును వీరికి చేకూర్ప ఈ గ్రంథగత చరితులను ప్రార్థించుచున్నాను.

ధర్మమూర్తిః ధర్మ పాలః ధార్మికేషు సదారతః
ధర్మోద్ధరణ సంజాతః శ్రీరామో నో ఽవతాత్సదా.

శ్రీరామభక్త పరిచారకుడు
జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రి



# కృతజ్ఞతాంజలి



''శ్రీరామ భక్తి'' గ్రంథమును గురించి శ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రిగారు చాల గొప్పగా పరిచయం చేసినారు. అదుచేత నేను చెప్పవలసినదేమియు యుండదు. దీనియందు చాల వరకు రామాయణ మందలి ముఖ్య పాత్రలన్నియు వచ్చెను. వారందరికి రామునిపై ఉన్న ప్రేమను, భక్తిని ఈ గ్రంథములో ప్రకటించితిని. ఇంకను దీనియందు శ్రీరాముని సహస్ర నామ స్తోత్రము, శ్రీ సీతారామ అష్టోత్తరములు, షట్ కవచములు (శ్రీ సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమ) మరెన్నో స్తోత్రాదులు, వీటన్నింటికి వివరణలు ఇవ్వబడినవి. ఇవి గీతా ప్రెస్ వారి ''శ్రీరామ భక్తి అంక్, వాల్మీకి రామాయణము, తులసీ రామాయణము, ఆనంద రామాయణాది'' గ్రంథముల నుండి సేకరింప బడినవి.

మరి నా రచనోద్దేశ్యమును వివరింతును. బాల్య దశలోనే నా హృదయములో తిష్ఠ వేసిన శ్రీ కృష్ణభగవానుని గురించి తెలిసికొన వలెనను దీక్షతో మనమూల గ్రంథములను పఠించ వలెనను కోరిక గలిగినది. ఆ కోరిక తోడనే సుప్రసిద్ధ విద్వత్కవులయిన శ్రీ కర్ణ వీర నాగేశ్వరరావు గారి దగ్గర హిందీ, సంస్కృతాంధ్రముల నభ్యసించితిని. ఆ తరువాత గీతా ప్రెస్, గోరఖ్‌పూర్ వారి కళ్యాణ్ పత్రికలో సభ్యురాలిగా చేరి రామాయణ, భారత, భాగవతాదులగు అష్టాదశ పురాణములను సేకరించి పఠించితిని. నిరంతరము పఠించవలెనను కోరికయేగాని రచించవలెనను కోరిక గలుగ లేదు.

మొట్ట మొదట నా రచన శ్రీ విష్ణు సహస్ర నామావళి వివరణతో ప్రారంభమైనది. అదియును దైవ ప్రేరణతో 14-9-1979 శుక్రవారము స్వప్నమందు లక్ష్మీదేవి సాక్షాత్కరించి శ్రీ విష్ణు సహస్ర నామములకు తెలుగులో వివరణ వ్రాయుమనియు, అది పంచమి బుధవారము 26-9-1979 రోజున పూర్తి చేయవలెననియు ఆ తల్లి ఆదేశించి, తన హస్తమున నున్న కమలమును నాదోసిలి యందుంచెను. ఆ తల్లి ఒసగిన కమలము నా దోసిలి యందు వికసించినది. వెంటనే లేచి క్యాలెండర్

తీసి చూచితిని. 26-9-1979 పంచమి బుధవారమగుట విచిత్రము! అది యదార్థ స్వప్నముగా భావించి 15-9-1979న ప్రారంభించి 26-9-1979న పూర్తి చేసితిని. లక్ష్మీ అమ్మవారి స్వప్నాదేశముతో ప్రారంభమైన నా రచన కొనసాగుచు వచ్చినది. ఆ తరువాత గర్గసంహిత లోని శ్రీకృష్ణుని సహస్ర నామములకు వివరణ వ్రాసితిని. అది వ్రాయునప్పడే గర్గసంహితను సంపూర్ణముగా అనువదింప వలెనను కోరిక గలిగినది. ఆ కోరికతోడనే గర్గసంహితను అనువదించితిని. ఇంకొక విషయము మా గురువుగారు ఇట్లనెడివారు. నీవు గ్రంథ పఠనము ఒక్కటే చేయుచున్నావు. కాని నీవు చదివినది ఇంకొకరికి వివరముగా చెప్పగల రోజు రావలెను. అప్పడు నేను సంతోషించెదననెడివారు. ఆయన స్వర్గస్థులైన తరువాత ఆ రోజు ఇప్పడు వచ్చినది. దైవ బలముతోపాటు పెద్దల ఆశీర్వచన బలము కూడ నుండుట వలననే నేను వ్రాసెడివన్నియు ముద్రితములగుటయు, నేనూహించని వారితో ఆవిష్కరింప బడుటయు జరుగుచున్నది. అంతేగాని ఇది నా గొప్పతనమేమాత్రము కాదు.

దైవలీలలు మహాత్ముల మహత్తులు కొన్ని వ్రాయాలనిపించు చున్నది. శ్రీకృష్ణని సహస్ర నామావళి వివరణ ముద్రితమగు సందర్భములో ఆశీర్వచనము కొరకు సీతానగరములోని శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరు స్వామివారి దగ్గరకు వెళ్ళుటకు బయలుదేరి రోడ్డుమీదకి వచ్చితిని. రోడ్డుమీద నలగనిది, మాయనిది, క్రొత్తది అగు భగవద్గీత పుస్తకము నాకు ప్రత్యక్షమైనది. దానిని గ్రహించి సీతా నగరమునకు వెళ్ళితిని. వారిని చూచుట అదే ప్రథమము. వారు ఆప్యాయముగా ఆదరించి ఆశీస్సులొసగిరి.

పుష్పగిరి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ విద్యా నృసింహ భారతీ స్వామివారు విజయవాడ విచ్చేసినప్పడు శ్రీ శివ సహస్ర నామావళి వివరణ గ్రంథమునకు వారి ఆశీస్సులు పొందుట కొరకు వెళ్ళితిమి. వారిని దర్శించి ఆశీస్సులు పొంది తిరిగి వచ్చి మా కారులో కూర్చుంటిమి. నేను కూర్చొనిన సీటులో ''మధుర వంశీ'' అని వ్రాసి యున్న మురళి కనిపించుటతో ఎవరైనను కారులో పెట్టారేమోనని అక్కడ చాలాసేపు ఆగి అందరిని అడిగితిమి. ఎవరును మాది కాదనిరి. దానిని తెచ్చి నేనారాధించు శ్రీకృష్ణునకు అమర్చితిని.

మరొక ఆశ్చర్యకరమైన విషయము శ్రీ శివ సహస్ర నామావళి వివరణ గ్రంథమును గౌరవనీయులు ఉపరాష్ట్రపతి శ్రీ శంకర్ దయాళ్ శర్మ గారిచే ఢిల్లీలో ఆవిష్కరణ జరిపింపబోవుటకు ముందు కంచికి వెళ్ళి అక్కడ కంచి పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి వారికి మొదట గ్రంథమును చూపి వారి కరస్పర్శచే నొసగిన గ్రంథమునే ఢిల్లీలో ఆవిష్కరణ గావింప వలెనని నిశ్చయించుకొని కంచి వెళ్ళితిని: అక్కడ స్వామివారి పరిచారకులు గ్రంథమును స్వామివారి కందించుటకు అనుమతించలేదు. దూరముగా ఒక బల్లవేసి యుంచిరి. ఎవరేమి తెచ్చినను ఆ బల్లమీదనే పెట్టుమని చెప్పచుండిరి. వారి దృష్టి పడినచాలు. వారేమి తాకరు అని చెప్ప చుండిరి. ఎంతయో ఉత్సాహముగా వెళ్ళిన మాకు నిరుత్సాహము కలిగినది. వారు చెప్పినట్లే బల్లమీద గ్రంథమును పెట్టి నిలువ బడితిమి. సర్వజ్ఞులైన స్వామివారు వారి పరిచారకులనే బల్లపై పెట్టియున్న గ్రంథమును ఇవ్వమనిరి. గ్రంథమును గ్రహించుటే కాక ఒకచేతితో పేజీలు త్రిప్పచూ, మరొక చేతితో వారే బ్యాటరీ లైటు వేసికొని మొదట అట్టమీద బొమ్మ చూచి తరువాత వరుసగా పేజీలు త్రిప్పచూ, అంకిత మిచ్చిన చోటు చూచిరి. శ్లోకాలు కొన్ని పరిశీలించిరి. వివరణ ఎట్లు వ్రాసినది కొన్ని పేజీలు చూచిరి. ఆ తరువాత నామాలను కూడా పరిశీలించి ఆశీస్సులతో నాకొసగినారు. గ్రంథమును వారు తాకిననే చాలుననుకొన్న నాకు వారి చేతులలో గ్రంథము చాలాసేపు ఉండుట, వారు దానిని పరిశీలించుట చూసిన నాకేకాదు, క్యూలో నిలువబడిన వారి కందరికి ఆశ్చర్యము గలిగించినది. వారు గ్రంథము చూచుట పూర్తిఅగునంత వరుకు క్యూలోని జనులు ఆగిపోయిరి. ముందు అనుకున్నట్లుగా, తరువాత ఢిల్లీ వెళ్ళితిమి. భారత ఉపరాష్ట్రపతి గౌరవనీయులు శ్రీ శంకర్ దయాళ్‌శర్మగారు దానిని ఆవిష్కరించిన వెంటనే ఉరుములు, మెరుపులతో వర్షము పడుచుండగా, శ్రీ శంకర్ దయాళ్ శర్మగారు శ్రీ శంకరుడు ఆనంద తాండవము చేయుచున్నాడని గ్రంథమును గురించి ౩౦ నిమిషములు మాట్లాడినారు.

గర్గసంహిత అంకితమును స్వీకరించిన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరు స్వామి వారు అమూల్యము, అపురూపము, అనంతము, అనూహ్యమైన మంగళాశాసనములతో తమ

సందేశమొసగుటేగాక, దయాసముద్రులైన స్వామివారు నా కోరిక తీర్చి మొదటి భాగమును ఆవిష్కరణ జరిపి నా జన్మ తరింప జేసిరి.

మరొక విచిత్రమైన సంఘటన, యే జగన్మాత ఆదేశముతో పంచమి నాటి నుంచి నా రచన కొనసాగు చుండెనో ఆ జగన్మాత గుంటూరులో శ్రీరామనామ క్షేత్ర వ్యవస్థాపకులైన ''సమర్థ'' శ్రీ రాగం ఆంజనేయులు గారి ద్వారా క్షేత్ర ఉత్సవాలలో తమ పట్టాభిషేక సమయమున అమ్మ సమక్షములో మరియు అదే పంచమి నాడు వేద మంత్రముల మధ్య హోమము ఎదురుగా ''ఆధ్యాత్మిక తత్త్వ వారధి'' అను బిరుదును ప్రసాదింప జేసెను. ఇంకో విచిత్రమేమంటే బిరుదు నొసగిన వారు సామాన్యులు గారు. క్షేత్ర నిర్మాతయే గాక సాక్షాత్ ఆంజనేయ స్వరూపులేగాక, ఆంజనేయ నామధారులగుట విచిత్రము.

మరొక విచిత్రమేమిటంటే శ్రీ హంపీ విరూపాక్ష విద్యారణ్య మహాపీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య శ్రీ మదాభి నవోద్దండ నర సింహ భారతీ స్వామి వారికి నేనెవరో తెలియకుండానే ఆధ్యాత్మిక రంగంలో నేను చేస్తున్న సేవలను గుర్తించి వారు నన్ను తమ పీఠం సభ్యురాలిగా నియమించారు. ఆ పీఠానికి సంబంధించి భారత దేశంలోని, కేరళ, కర్నాటక, ఆంధ్ర, తమిళనాడు, మహారాష్ట్ర, గోవా, పాండిచ్చేరి రాష్ట్రాలలో ఉన్న అన్ని పీఠాలలో నన్ను సభ్యురాలిగా నియమించినందులకు వారికి నా అనేక కోటి పాదాభి వందనములు అర్పించు చున్నాను.

నేను వ్రాసిన ప్రతి గ్రంథమును పెద్దలచే ఆవిష్కరింప బడుటయూ, మహాత్ముల ఆశీస్సులను పొందుటయు, దైవానుగ్రహము, పెద్దల ఆశీర్వచన బలము. ఈ విధముగా చెప్పకొనుచూ పోయిన పాఠకులను విసిగించుట అగును.

గురుదేవులు శ్రీ చిన్న జీయరు స్వామివారు శ్రీ గర్గసంహిత రెండవ భాగమును రాజమండ్రిలో ధనుర్మాస వ్రత సందర్భమున ఆవిష్కరణ చేసిరి. ఆ సందర్భమున ''ఆర్ష హృదయాభిజ్ఞ'' అను బిరుదు ప్రదానము గావించి ఇట్లనిరి. మీరు రచనలు కొనసాగించక ఆపినచో ఈ బిరుదు ఇచ్చిన ఫలితము ఉండదని చెప్పిరి. అప్పడు నేను శ్రీరామ భక్తి వ్రాయుచున్నాని చెప్పగా, వారు దానిని కూడా నేను చూచెద నని వరమొసగిరి. ఆ ఫల

స్వరూపమే శ్రీరామ భక్తి ఆవిష్కరణ. అదియూ శ్రీ స్వామివారి ఆశ్రమమందు చాతుర్మాస్య దీక్షా సమయమున, ఉభయ వేదాంత పండిత సభలయందు నవరాత్రులలో ఐదవ రోజైన లలితా పంచమి నాడు శ్రీరామ భక్తిని నాగురుదేవులైన శ్రీ స్వామివారు ఆవిష్కరించుట వరముగాక మరేమగును! దీని వలన మా ఇరువంశముల వారు తరించినట్లే.

ఈ గ్రంథము ఈ రూపు దాల్చుటకు ముఖ్య కారకులు ఇద్దరు. వారిలో శ్రీ జన్నాభట్ల వాసుదేవ శాస్త్రి గారు ఒకరు. వారొక నాడు నేను ఈ గ్రంథమును గురించి చెప్పుచుండగా విని దీనిలో సీతా రామ లక్ష్మణ భరత శత్రుఘ్న ఆంజనేయ కవచములు ముద్రించిన చాలా గొప్పగా ఉండునని చెప్పిరి. అప్పుడు నేను అవి అన్ని ఏ గ్రంథంలో ఉన్నయని అనగా వారు ఆనంద రామాయణములో ఉండెననియూ, ఆ గ్రంథము గ్రంథి సుబ్బారావు గారి గ్రంథాలయమందున్నదనియూ అచటికి వచ్చిన దానిని చూపెదననియు చెప్పగ, నేను అచటికి వెళ్ళితిని. అప్పుడు వారు ఆగ్రంథమును చూపి దాని చిరునామా కూడ చెప్పగ నేను ఆ గ్రంథమును తెప్పించుకొని వారు చెప్పినవన్నియూ వ్రాసితిని. నన్నింత ప్రేరేపించి వ్రాయించిన వారికి నా కృతజ్ఞతలు.

ఆ తరువాత ఈ గ్రంథమును పరిశీలించుచున్న వారి తమ్ముడు శ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రిగారు మరొకరు. ఇన్ని చేశారు ఇంకా శ్రీరామ సహస్ర నామము కూడా చేసి దానికినీ వివరణ ఇచ్చిన బాగుండునని చెప్పగ, వారి ప్రోద్బలముతో అదియును చేసితిని. అంతేకాక అనేక సూచనలిచ్చి ఈ గ్రంథమునకు విలువ పెంచినారు. అసూయా ద్వేషములు లేక, ఫలాపేక్ష లేక ఎవరు అడిగిననూ కాదనక నిస్వార్థ సేవ చేయుచున్న శ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రిగారికి అనేక కోటి పాదాభి వందనములు సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథమునకు ఆశీర్వాదములు పంపిన వైష్ణవ పీఠాధి పతులు జగద్గురుదేవులు, శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామి; కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి; శ్రీ హంపీ విరూపాక్ష పీఠాధిపతులు జగద్గురువు శంకరాచార్య శ్రీ మదాభినవోద్దండ నరసింహ భారతీ స్వామి; పుష్పగిరి పీఠాధిపతులు శ్రీ విద్యా నృసింహ భారతీ స్వామి; అవధూత దత్త పీఠాధిపతులు శ్రీ గణపతి

సచ్చిదానంద స్వామి; శ్రీ శుక బ్రహ్మాశ్రమ పీఠాధిపతులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి;శ్రీ సిద్దేశ్వరీ పీఠాధిపతులు శ్రీ శివ చిదానంద భారతీస్వామి; విశ్వమందిర పీఠాధిపతులు శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ స్వామి వారలకు అనేక కోటి పాదాభి వందనములు అర్పించు చున్నాను.

ఈ గ్రంథములకు సందేశముల నొసగిన గౌరవనీయులు భారత రాష్ట్రపతి శ్రీ శంకర్ దయాళ్ శర్మగారికి, గౌరవనీయులు భారత ప్రధాన మంత్రి శ్రీ ఐ.కె. గుజ్రాల్ గారికి నా కృతజ్ఞతా పూర్వక అనేక ప్రణామములు.

భగవత్సేవగా భావించి, నిశ్వార్ధముగ పరోపకార గుణముతో ఈ గ్రంథమును పరిశీలించి, గ్రంథ ముద్రణలో తోడ్పడి ఈ గ్రంథమునకు భక్తి నివేదనము సమర్పించిన శ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రిగారికి నా కృతజ్ఞతా పూర్వక అనేక నమస్సులు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్ధిక సహాయమిచ్చిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, తిరుమల తిరుపతి దేవస్థానము ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ యం.కె.ఆర్. వినాయక్ గారికి, సప్తగిరి ఎడిటర్ శ్రీ ఎన్.ఎస్. రామ మూర్తి గారికి నా కృతజ్ఞతా పూర్వక అనేక ప్రణామములు.

ఈ గ్రంథమునకు పేపరు మొత్తము సమర్పించిన శ్రీయుతులు కిలారు పి. ప్రసాద్ దంపతులకు, కవర్ పేజీ సమర్పించిన శ్రీ టి. ఆర్. ప్రభు, ఆర్ధిక సహాయము చేసినశ్రీ కె.పి. రెడ్డియ్య, డాక్టర్ బి.వి. రామారావు దంపతులకు, శ్రీ వేము బావనారాయణ, అశ్వనీ సుబ్బారావు గార్లకు జ్ఞాపికలు సమర్పించిన శ్రీ గ్రంథి సుబ్బారావు గారికి నా కృతజ్ఞతాభిపాదాభి వందనములు.

నా ఉన్నతి చూసి ఆనందించు నా తల్లిదండ్రులు శ్రీ నల్లంరెడ్డి వెంకట హనుమంతరావు, అనసూయమ్మ గార్లకు, నా భర్త శ్రీ రోహిణి వెంకయ్య C.T.O. (రిటైర్డ్) గారికి, చిన్నమ్మలు కళ్యాణం సావిత్రమ్మ, పి. శేషగిరమ్మ గార్లకు, చిన్నాన్నలు శ్రీ నల్లంరెడ్డి రాంకుమార్, శ్రీ నల్లంరెడ్డి విఠల్ ప్రసాద్ గార్లకు, మరుదులు శ్రీ రోహిణి వెంకట్రావు, B.A.B.L.,శ్రీ కోలా సత్య నారాయణ గార్లకు, అల్లుడు శ్రీ సిగినం సుబ్బారావు, స్టేట్ బ్యాంక్ మేనేజరు

గారికి మరియు పుట్టినింటి వంశీయులకు, మెట్టినింటి వంశీయులందరికీ అనేక ప్రణామములు.

ఈ గ్రంథ ముద్రణకు నావెంట ఉండి నన్ను ముందుకు నడిపించిన నా తమ్ముళ్ళు చిరంజీవి N.V.S. రామారావు, B.A., L.L.B., L.S.G.D., అనౌన్సర్, ఆల్ ఇండియా రేడియో, హైదరాబాద్, చిరంజీవి N.V. సత్యనారాయణ, కంట్రాక్టరు; చిరంజీవి N.V. కృష్ణారావు; చిరంజీవి కోలా హనుమంత రావు, A.C.T.O. లకు నా కృతజ్ఞతా పూర్వక అనేక శుభాశీస్సులు.

ఈ గ్రంథ ముద్రణలో శ్రమ దానము చేసిన చిరంజీవులు మా పెద్దబ్బాయి R.L. సత్యనారాయణ, పెద్దకోడలు R. రమణ కుమారి, అమ్మాయి S. రామ సీత మరియు తన ఉద్యోగ బాధ్యతలను నిర్వహించు కొనుచు ఈ గ్రంథమును ఫేర్ కాపీ తీసి ప్రెస్ పని అంతయూ నిర్వహించి ఈ గ్రంథమునకు రూపు నేర్పరచిన మా చిన్నబ్బాయి రోహిణి మహేష్, M.A., B.L., చిన్న కోడలు R. భానుమతి, M.Sc., M.Ed., లకు నా కృతజ్ఞతా పూర్వక అనేక శుభాశీస్సులు. నా రచనా వ్యాసంగములకు అంతరాయములు గలిగించక సహాయము చేసిన మనుమలు సిగినం శ్రీనివాస్, (M.Sc.), సిగినం లక్ష్మీప్రసన్న B.Sc., (M.A.), సిగినం అనూరాధ (B.Tech.), R. కిషోర్, R. జగదీష్, R. హరీష్, R. రాజేష్ లకు అనేక శుభాశీస్సులు.

ఈ గ్రంథాన్ని లేజర్ టైప్‌సెట్టింగ్ చేసిన షిర్డిసాయి గ్రాఫిక్స్ వారు ముద్రించిన బాపూజీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ శ్రీ వెనిగళ్ళ వెంకటేశ్వరరావు గారికి, వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణ నిమిత్తమై సహకరించిన ఎందరో మహానుభావులందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

**రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి.**

ఆధ్యాత్మిక రచయిత్రి

# శ్రీరామ భక్తి

## స్తోత్ర నామ కవచ వివరణములు

## విషయ సూచిక

### ప్రథమ ఖండము

## ద్వితీయ ఖండము





శివుడు ఈ శ్లోకములను దేవతలకు, దైత్యులకు, ఋషులకు సమానముగా పంచి పెట్టగా ఒక్కొక్కరి భాగమునకు ముప్పది మూడు కోట్ల, ముప్పది మూడు లక్షల, ముప్పది మూడు వేల, మూడువందల, ముప్పది మూడు శ్లోకములు వచ్చెను. తొంబది తొమ్మిది కోట్ల, తొంబది తొమ్మిది లక్షల, తొంబది తొమ్మిది వేల, తొమ్మిది వందల, తొంబది తొమ్మిది పంచబడినవి. ఒక్క శ్లోకము మిగిలినది. దేవతలు, దైత్యులు, ఋషులు ఈ ఒక్క శ్లోకమునకు పోట్లాడు కొనసాగిరి. ఈ శ్లోకము అనుష్టుప్ ఛన్దములో నున్నది. అనుష్టుప్ ఛన్ద మందు ముప్పది రెండు అక్షరములుండును. శ్రీ శివుడు ముగ్గురకు పది పది అక్షరములను పంచగా చివరకు రెండు అక్షరములు మిగిలెను. అప్పుడు శివుడు '' ఈ రెండు అక్షరములను నేను ఎవ్వరికిని ఇవ్వను. ఈ అక్షరములను నా కంఠమందే ఉంచెదను'' అని చెప్పెను. ఇవియే ''రా'' ''మ'' అను రెండక్షరములు. ఇవియే వేదముల సారము.

రామ నామము అతి సరళమైనది, అతి మధురమైనది, అమృతము కంటె తియ్యనయినది. ఇది అమర మంత్రము. శివుని కంఠమందు జిహ్వాగ్ర భాగమందు విరాజమానమై యున్నది. సాగర మన్థన సమయమందు ఉదయించిన హాలాహలమును శివుడు పానము చేయుచుండ భక్తులు హాహాకారములు చేయసాగిరి. అప్పుడు శంకరుడు వారిని ఓదార్చుచు ఇట్లనెను.

శ్రీ రామ నామామృత మంత్ర బీజ<br>
సంజీవనీ చే న్మసి ప్రవిష్టా ।<br>
హాలాహలం వాప్రల యానలం వా<br>
మృత్యోర్ముఖం వా విశతాం కుతోభీః ॥

(ఆనంద రామాయణము)

''శ్రీరామ నామము సర్వ మంత్ర బీజము. ఆ సంజీవని నా సర్వాంగముల యందు సంపూర్ణముగ నిండి యున్నది. అందు చేత హాలాహల విషము వలన గాని, ప్రళయానల జ్వాల వలన గాని, మృత్యువు వలన గాని నాకెట్టి భయము లేదు'' అని వారితో చెప్పుచు శివుడు విషము త్రాగెను. ఆ విషము అమృతముగ మారెను. ఆనాటి నుండి శివుడు నీలకంఠ నామము ధరించెను. సమస్త దేవతలలో శివుడు మహా దేవుడయ్యెను.

శివభగవానుడు పార్వతితో రామ నామ మహిమను గురించి ఈ విధముగ చెప్పెను.

ఆపదా మపహర్తారం దాతారం సర్వ సంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

భర్జనం భవబీజా నామర్జనం సుఖసంపదామ్ ।
తర్జనం యమ దూతానాం రామ రామేతి గర్జనమ్ ॥

రామో రాజమణిః సదా విజయతే రామం రమేశం భజే
రామే ణాభి హతా నిశాచరచమూ రామాయ తస్మై నమః ।
రామా న్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోఽస్మ్యహం
రామే చిత్తలయః సదా భవతు మే; భో రామ ! మాముద్ధర ॥

రామ రామేతి రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామ నామ వరాననే ॥

(రామ రక్షా స్తోత్రము)

''ఆపదలను హరించువాడు, సమస్త సంపదల నొసగు వాడు, లోకాభి రాముడునగు శ్రీరామునకు పదే పదే నమస్కారములు చేయుచున్నాను. రామ-రామ అను గర్జనము సమస్త సంసార బీజములను వేగించునది. సమస్త సుఖ సంపత్తులను గలుగ జేయునది. యమదూతలను భయపెట్టునది. రాజులలో శ్రేష్ఠుడైన

శ్రీరాముడు సదా విజయమును చేకూర్చును. నేను లక్ష్మీపతి అయిన శ్రీరామ భగవానుని భజించుచున్నాను. సమస్త రాక్షసులను సంహరించిన రామచంద్రునకు ప్రణామము చేయుచున్నాను. రాముని కంటె గొప్ప ఆశ్రయము లేదు. నేను రామచంద్రుని దాసుడను. నా మనస్సు సదా రాముని యందే లగ్నమై యుండును. ఓ రామా ! నన్నుద్ధరింపుడు.

(శ్రీ మహేశ్వరుడు పార్వతితో) హే సుముఖీ ! రామ నామము విష్ణు సహస్ర నామముతో సమానమైనది. నేను సర్వదా రామ రామ రామ అనుచు మనస్సును రంజింపజేయు రామ నామమందే రమించుచుందును''.

రామావతారములో సీతా హరణానంతరము శ్రీరాముడు రోదించుచు ప్రతి వనమందు వృక్షములను, లతలను పట్టుకొని సీత జాడ అడుగుచు తన ప్రాణ ప్రియ సీతా వియోగముతో అటునిటు వెదకుచు తిరుగుచుండెను.

అట్టి స్థితిలో శివుడు రాముని దర్శించి ఆనందానుభూతి జెందెను. ''పరమాత్మ మానవుని వలె ఎట్లు లీలా నాటక మాడుచున్నాడు ! నేను ఎదుట పడి వందనము సమర్పించిన నా భగవానుడు సంకోచించు నేమో ! '' అనుకొనుచు వటవృక్షము చాటుగా పరమాత్మను దర్శించెను. ఆయన రోమములు నిక్కపొడిచెను. నేత్రముల నుండి అశ్రుధారలు స్రవించెను.

**జయ సచ్చిదానంద జయ పావన ।**
**అస కహి చలే మనోజ నసావన ॥**
**చలే జాత సివ సతీ సమేతా ।**
**పుని పుని పులకత కృపాని కేతా ॥**

(రామ చరిత మానసము)

శ్రీ శివుడు మనస్సు నందే ''జయ సచ్చిదానంద జయ పావన'' అనుచు దూరము నుండియే ప్రణామము గావించెను. ''జయ జయ'' అనుచున్న శివుని గాంచి సతీదేవి ఆశ్చర్యముతో ''దేవా ! మీరు ఎవరికి ప్రణామము చేయుచున్నారు ?'' అని అడుగగా శివుడు ''అతడు నా ఇష్ట దైవము. ఆ దైవమునే దర్శించుచున్నాను. నా రామునికే వందనము చేయు చున్నా''ననెను.

భగవానుడు ఎప్పుడు ఏ అవతారము ధరించినను తన ఆరాధ్య దేవుని బాలరూపము గాంచుటకు శివుడు విచిత్ర విభిన్న వేషములతో ఆయా క్షేత్రములకు వెళ్ళి దర్శించును.

రామావతర మందు శ్రీ శంకరుడు కాకభుశుండిని బాలుని గావించి తాను స్వయముగా వృద్ధ జ్యోతిష్కుని వేషము ధరించి అయోధ్యా నగర రాణి వాసమందు ప్రవేశించెను. కౌసల్యాది మాతలు బాలరాముని జ్యోతిష్కుని యొడి యందు కూర్చుండ బెట్టిరి. పులకించిన శంకరుడు బాలుని హస్తము, చరణము గాంచెను. ఒడిలో నుంచుకొని ఆడించెను.

శ్రీరాముడు ద్వాపరమున శ్రీకృష్ణావతారమెత్తి నప్పుడు శివుడు పులి చర్మము ధరించి 'బాబా భోలేనాథ్' అని శృంగనాదము చేయుచు వ్రజ గోకులమున నంద బాబా ద్వారము చెంత కేగెను.

యశోద బాబా భయంకర రూపము, చుట్టుకొనిన సర్పములు, శరీరమంతట భస్మము, పొడవైన జడలు, ఎఱ్ఱని నేత్రములు గాంచి భయముతో బాలుని కనుపించనీయ లేదు. బాబా ద్వారము చెంతనే తిరుగుచు శృంగ నాదము చేయుచుండెను. బాలుడు భయముతో రోదించసాగెను. యశోద తన బిడ్డకు దృష్టి దోషమేమో యనుకొనుచు సఖిని పంపి బాబాను పిలిపించెను. బాబా కన్నయ్యను ఒడిలోనికి తీసికొనెను. కన్నయ్య చరణములను

తన జడలకు తాకించి ముద్దాడెను. బాలుడు నవ్వసాగెను. దృష్టి దోషము పోయెను. నేటికిని నంద గ్రామములో బాబా నందేశ్వర నామముతో శివుడు విరాజిల్లుచున్నాడు.

తన ఇష్ట దైవమగు శ్రీరామునకు అనన్య సేవలు చేయవలెనను కోరికతోనే శివ భగవానుడు హనుమానుని రూపము ధరించెను. శ్రీరామునకు నిఃస్వార్థ భావముతో సేవలు చేసెను. విభీషణుడు వజ్రాల హారము నివ్వగా దానిని దంతములతో కొరికి వేసెను. విభీషణుడు తనను అవమానించెనేమోయని పరీక్ష పెట్టగా హనుమానుడు తన వక్షః స్థలము చీల్చి రాముని చూపెను.

శంకర భగవానునకు ఇష్ట దైవము శ్రీరాముడైన, శ్రీరామునకు ఇష్ట దైవము శంకరుడు. ఇద్దరు పరస్పరోపాసకులు.

శ్రీ శివుడే శ్రీరాముడు, శ్రీరాముడే శ్రీ శివుడు. భక్తులను ఆనందింప జేయుటకు స్వయముగ ఆనందించుటకును ఈ విధముగ ఉపాస్య- ఉపాసక- భావముతోను, పూజ్య-పూజక భావముతోను అనేక లీలలు భగవానుడు చేయుచున్నాడు. భక్తుల పరమారాధ్యుడైన ఆ హరి - హరాత్మక స్వరూపమునకు నమస్కారము.



# సనకాది మునుల శ్రీరామ భక్తి

శ్రీ సనకాదులు (సనక, సనందన, సనత్కుమార, సనాతనులు) బ్రహ్మ మానస పుత్రులు. బ్రహ్మ తన శక్తితో నిర్మలాంతః కరణముతో వీరిని సృష్టించెను. వీరు చూచుటకు ఎల్లప్పుడు ఐదు సంవత్సరముల బాలకులవలె నుందురు. కాని శంకరుని కంటె (జన్మలో) పెద్దవారు. వీరు నిరంతరము ''శ్రీహరిః శరణమ్'' అను మంత్రమును జపించుచుందురు. వీరు అద్భుత తేజోమయులు, దీప్తి సంపన్నులు, సుందర గుణ శీల యుక్తులు, నిత్యము బ్రహ్మానందములో లీనమై యుండువారు. భగవానుని గుణములను గానము చేయుట, ఆధ్యాత్మిక చింతన, భగవత్ప్రేమ వీరి ముఖ్య ధ్యేయములు. వాస్తవముగ ఈ నలుగురు బాలుర రూపములో నున్న నాలుగు వేదములే. ఈ మునులు సర్వత్ర భేదబుద్ధి లేక యుండు వారు.

బ్రహ్మ సృష్ట్యాదిలో వీరిని మత్సంకల్పముతో ఉత్పన్నులను చేసి సృష్టిని పెంచుడని చెప్పగా వీరు ఒప్పుకొన లేదు. వీరి మనస్సు సర్వదా భగవానుని ఆత్మారామగుణాకర్షితమై ముని మనో మధుప నివాస హరి పద పంకజము లందుండును. అందువలన తపస్సు నందే వీరి మనస్సుండును. భగవద్భక్తియే వీరి ప్రాణము. భక్తితో తన పుత్రులు జ్ఞాన వైరాగ్యయుతులగుటచే బ్రహ్మ దుఃఖించు చుండ ఆ దుఃఖము పోగొట్టుడని శ్రీ నారదుడు చెప్పగా సనకాదులు భాగవత కథను వినిపించి ఆయన దుఃఖమును తొలగించిరి.

నారదుడు భక్తి మార్గములో ఆచార్యులకు ఆచార్యుడు. అయినను నారద పురాణము పూర్తిగా పూర్వ భాగము వీరే నారదునకుపదేశించిరి. ఇందులో భక్తిని గురించి చాల గొప్పగా చెప్పబడినది. వారు ''నారదా! ఉత్తమమైన భక్తి మానవులకు కామధేనువు వంటిది. అది ఉండగా అజ్ఞానులైన మానవులు సంసార రూప విషమును గ్రోలుచున్నారు. ఇది ఎంతటి ఆశ్చర్య కరము. భగవద్భక్తుల సంగమము, శ్రీరామ భగవానునిపై భక్తి, సహన స్వభావములే సారములేని సంసారులకు సారము'' అనిరి.

నారద పురాణ తృతీయ పాదమందు శ్రీ సనకాదులు నారదునకు సపరికర రామోపాసనను విశదముగ ఉపదేశించిరి. రాముని ధ్యాన స్వరూపము, మంత్రముల నుపదేశించుచు ''నారదా! సర్వమంత్రముల యందు వైష్ణవ మంత్రము శ్రేష్ఠమైనది. సర్వ మంత్రములలోను వైష్ణవ మంత్రము శీఘ్రముగ అభీష్ట సిద్ధి నొసగును. వైష్ణవ మంత్రములలో కూడ శ్రీరామ మంత్రము అధిక ఫలమొసగును. ''రాం రామాయ నమః'' యను షడక్షర మంత్రము రామ మంత్రము లన్నింటిలోను అతి శ్రేష్ఠమైనది. ఇది ఉచ్చరించినంత మాత్రముననే తెలిసి తెలియక చేసిన మహాపాత కోప పాతకములు వెంటనే నశించును. పంచాక్షరమగు రామాయ నమః అను మంత్ర మందు స్వబీజము - రాం; కామ బీజము - క్లీం; సత్య బీజము - హ్లీం; వాగ్బీజము - ఐం; లక్ష్మీ బీజము - శ్రీం; తార - ఓం అను వాని నొక్కొక్క దానిని వేరు వేరుగ చేర్చిన షడక్షర మంత్రమగును. ఎట్లనిన రాం రామాయ నమః; క్లీం రామాయ నమః; హ్లీం రామాయ నమః; ఐం రామాయ నమః; శ్రీం రామాయ నమః; ఓం రామాయ నమః అను ఈ

మంత్రములు ధర్మార్థకామ మోక్షముల నొసగును. సాధకులకు రఘునాథుని చరణములపై అనంత భక్తి కల్గించును''.

సనకాదులు శ్రీరాముని ఇతర మంత్రములను కూడ ఇట్లు చెప్పిరి. ''ఓం రామచంద్రాయ నమః; ఓం రామ భద్రాయ నమః అను ఈ రెండును అష్టాక్షర మంత్రములు. ఓం నమో భగవతే రామ చంద్రాయ; ఓం నమో భగవతే రామ భద్రాయ అను ఈ రెండును ద్వాదశాక్షర మంత్రములు. శ్రీరామ జయ రామ జయ జయ రామ. ఇది త్రయోదశాక్షర మంత్రము''. ఈ విధముగ శ్రీరాముని ఇతర మంత్రములు, సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమదాది మంత్రములు వాని అనుష్ఠాన పద్ధతులను సనకాదులు నారదునకు ఉపదేశించిరి. సనత్కుమారుని చేచెప్పబడిన ధ్యానము అతిసుం దరము. రామభక్తితో ఓతప్రోతము. రాముని ఎడల ప్రేమను వృద్ధి చేయునది.

సీతారాముల ధ్యాన స్వరూప మొకటి ఈ విధముగ నిర్దిష్టమై యున్నది.

కాలామ్భోధర కాన్తం చ వీరాసన మాస్థితమ్ ।
జ్ఞాన ముద్రాం దక్షహస్తే దధతం జానునీతరమ్ ॥
సరో రుహ కరాం సీతాం విద్యుదాభాం చ పార్శ్వ గామ్ ।
పశ్యన్తీం రామ వక్త్రాబ్జం వివిధాకల్ప భూషితామ్ ॥
(నారద పురాణము పూర్వార్థము)

శ్రీరాముని అంగ కాంతి నల్లని మేఘము వలె శ్యామ వర్ణముగ నుండును. ఇతడు వీరాసనముతో కూర్చొనియుండును. దక్షిణ హస్త మందు జ్ఞాన ముద్ర ధరించి, వామ హస్తమును ఎడమ మోకాలిపై నుంచును. వామ పార్శ్వ మందు విద్యుత్ సమాన కాన్తిమతి వివిధ వస్త్ర భూషణ విభూషిత అయిన సీతాదేవి

విరాజమానయై యుండును. ఆమె హస్త మందు కమల ముండును. తన ప్రాణ వల్లభుని ముఖారవిందమును ధ్యానముతో చూచు చుండును.

సనత్కుమారుల భక్తి పురాణముల యందును, వివిధ రామాయణ ములందును గలదు.

సనకాదులు శ్రీరాముడు రాజ్యాభిషిక్తుడయిన తరువాత ప్రతి దినము రాముని దర్శించుటకు వచ్చెడి వారు. సనకాదుల ప్రేమను గాంచిన శ్రీరఘునాథుడు వారి వలెనే ప్రేమ విహ్వాలుడై వారి వలెనే నేత్రముల నుండి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండ, పులకితుడై తన భక్తులను పట్టుకొని కూర్చుండబెట్టి ''మునీశ్వరులారా ! నేడు నేను ధన్యుడను. మీ దర్శనముతో సమస్త పాపములు నశించెను. సత్సంగ ప్రాప్తి ఎంతయు భాగ్యము'' అని అ[illegible]ు.

భగవానుడు భక్తునకు ప్రేమికుడు, ప్రేమాస్పదుడునగు చున్నాడు. భగవానుని ఈ లీల ధన్యము. తమ ఆరాధ్యుడగు శ్రీరాముని వచనములు వినిన నలుగురు కుమారులు హర్షితులై ఈ విధముగ ప్రార్థించిరి.

''ప్రభూ ! మీరు అన్తరహిత, వికార రహిత స్వరూపము లతో వ్యక్త మగు అద్వితీయ కరుణామయులు. మీరు జ్ఞాన భండారులు, మాన రహితులు. మీరు సర్వరూపులు, సర్వ వ్యాప్తులు. అందరి హృదయ రూప గృహమందు సదా నివసించు వారు. అందువలన మీరు మమ్ము పరిపాలించుడు. రాగద్వేషము లను, అనుకూల ప్రతి కూలములను, జన్మ మృత్యు విపత్త్యాదు లను హతమార్చుడు. శ్రీరామా ! మీరు మా హృదయ మందే యుండి కామ, క్రోధ, మదముల నశింప జేయుడు. మీరు

పరమానంద స్వరూప కృపాధాములు. కామనలను పూరించువారు. మాకు మీపై అవిచల ప్రేమ భక్తి నొసగుడు. హే రఘునాథా! మీరు మమ్ములను పవిత్రులను జేసి, త్రితాపములను, జన్మ మరణములను నశింప జేయు భక్తిని ప్రసాదించుడు. శరణాగత కామధేనూ ! కల్పవృక్ష రూప ప్రభూ ! ప్రసన్నులై మాకు ఈ వరమిండు''.

భగవానుని వరము పొంది భగవానుని గుణములను గానము చేయుచు సనకాదులు బ్రహ్మ లోకమునకు వెళ్ళిరి.

# నారదుని శ్రీరామ భక్తి

అహో దేవర్షి ధన్యో ఽ యం యత్కీర్తిం శార్ జ్గధన్వనః।
గాయన్మాద్యన్నిదం తన్త్ర్యారమ యత్యాతురం జగత్ ॥
(శ్రీమద్ భాగవతము)

అహో ! దేవర్షి నారదుడు ధన్యుడు. వీణా నాదముతో హరి గుణములను గానము చేయుచు ఆనంద నిమగ్నుడై అందరికి ఆనందము గలిగించు చుండును. భగవానుని వోలె ప్రకటమగుచు, భగవద్భక్తిని మాహాత్మ్య మును విస్తరింప జేయుచు, లోక కల్యాణ నిమిత్తము జగత్తు నందు సంచరించు చుండును. భగవంతుని సహచరుడుగా త్రిలోకము లందు ప్రసిద్ధుడు. వీణా వాదనతో భగవానుని గానము చేయుచు సదా పర్యటించు చుండును. ఇతడు సంకీర్తన పరమాచార్యుడు. భాగవత ధర్మప్రధాన ద్వాదశాచార్యు లలో నొకడు. భక్తి సూత్ర నిర్మాత. ఇతడు రచించిన భక్తి సూత్రము లందు భక్తితత్త్వము సుందరమైన వ్యాఖ్యతో నడచెను. ఇతడు సమస్త పృథ్వి యందును భక్తిని స్థాపించుటకు ప్రతిజ్ఞ చేసెను. నారదుడు స్వ విషయ మిట్లు చెప్పెను.

**ప్రగాయతః స్వవీర్యాణి తీర్థ పాదః ప్రియ శ్రవాః !**
**ఆహూాత ఇవ మే శీఘ్రం దర్శనం యాతి చేతసి !!**
(శ్రీ మద్భాగవతము)

''నేను పరమ పావన చరణుని గుణగాన సంకీర్తన చేసిన ప్పుడు పిలచి నట్లుగా వెను వెంటనే భగవానుడు ప్రత్యక్షమగును. నారదుడు బ్రహ్మమానస పుత్రుడు. భగవానుని ఆత్మరూపుడు. దయామ యుడైన భక్త వత్సలుడు చేయదలచిన దానిని నారదునిచే చేయించును''.

వాల్మీకి, వ్యాస, శుకదేవ, ప్రహ్లాద, ధ్రువ, అంబరీషాదులకు నారదుడే భక్తి నుపదేశించెనని పురాణముల యందు స్పష్టము గ నున్నది. శ్రీమద్భాగవతము, శ్రీవాల్మీకి రామాయణము రెండును అపూర్వ మైనవి. ఇవి ఈయన దయతోనే లోకమునకు ప్రాప్తించినవి.

వ్యాస భగవానుడు సమస్త వేద విభజన, ఇతిహాస పురాణ, మహాభార తాది రచనలు చేసి కృతార్థుడు కానట్లు ఖిన్నుడైయున్న సమయమున నారదుడు అచటికి వెళ్ళి ''బ్రహ్మన్! మీరు సాక్షాత్ నారాయణుని అవతారులు. వేద విభజనము, పురాణ భారతాది గ్రంథ రచన చేసిన మీరు ఎందు చేత ఖిన్నులై కనపడు చున్నారు?'' అని అడుగగా వ్యాసుడు ''దేవర్షి! నిజముగ నేను అట్లే యుంటిని. ఎందు చేతనో బోధపడుట లేదు. మీరు త్రికాలజ్ఞులు. వాయు దేవునివలె సర్వవ్యాప్తులు. దయచేసి నా దుఃఖము పోవు ఉపాయము చెప్పు''డనగా నారదుడు ''మహర్షి! మీరు భక్తి సాహిత్యమును రచింపలేదు. భగవానుని నిర్మల యశస్సును గానము చేయలేదు. మీరు వర్ణ ధర్మము, ఆశ్రమ ధర్మము, స్త్రీ ధర్మము, రాజ ధర్మము, అపద్ధర్మము, మోక్ష ధర్మము మొదలగు వివిధ

ధర్మములను వర్ణించితిరి. కాని పరమ హంస పరమ భాగవత ధర్మమును వర్ణించ లేదు. అందువలన మీకు మనశ్శాంతి లేదు. భగవద్భక్తి రసముతో నిండియున్న భాగవత గ్రంథమును నిర్మించుడు. భగవానునకు భక్తియే పరమ ప్రియమైనది. దీనితో మీరు పూర్ణ కృతార్థు లగుదురు. పరమా నంద భరితులై శాంతి నొందెదరు'' అనెను.

నారదుని ఉపదేశాను సారము వేదవ్యాసుడు కల్యాణ కారకమగు భాగవత గ్రంథమును రచించి దానిని శుకదేవునిచే చదివించెను. ఈ విధముగ భాగవత భక్తి గ్రంథము నారదుని కృపాప్రసాదము. వాల్మీకి రామాయణము కూడ నారదుని కృపా ప్రసాదమే. దీని యందు ప్రథమ శ్లోకము -

తపః స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం పరమ్ ।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్ ॥

విశ్వ ప్రసిద్ధ శ్రీ సత్యనారాయణ కథ కూడ నారాయణుని భక్తితో పరిపూర్ణమై ఇంటింటను ప్రచలితమై యున్నది. ధృవునకు నారదుడే మంత్రమిచ్చెను. ప్రహ్లాదుని తల్లి కయాధునకు బోధించగా గర్భస్థ బాలక సహితముగ తల్లీ బిడ్డ లిరువురు భగవానుని పరమ భక్తులయిరి. తరువాత వచ్చిన విరోచన బల్యాది మహాభాగవతులు ఈ వంశము వారే.

నారదుని నామముతో నారద మహాపురాణము, నారద పురాణము కూడ నున్నవి. రెండింటి యందును భక్తి రసామృత కథలే నిండియున్నవి. నారదుని కృపాపాత్రులకు లెక్క లేదు. ఇతడు

కృపామూర్తి. ఎవరికెట్టి భక్తి మార్గమును ఉపదేశించవలెనో వారికా విధముగనే ఉపదేశించి వారు భగవానుని చరణముల చెంత కేగునట్లు చేయును. ఎల్లాగైనను జీవులకు వేగముగ భగవత్ ప్రాప్తి గలిగించ వలెనని ఇతని ఉద్దేశ్యము. ఇతడు ప్రపంచోపకారి. నారదుడు శ్రీరామ, శ్రీకృష్ణులకు లీలా సహచరుడు.

సమస్త రామాయణ, రామచరిత్ర, రామోపాసన గ్రంథముల యందును, సమస్త స్తోత్రాదుల యందును దేవర్షి నారదుడు వక్త, శ్రోత, ఉపాసకుడు. శ్రీరాముని వెంట అతని భక్తుల వెంట కనిపించును. శ్రీరామ చరిత మానస మందు ఇతడు శ్రీరాముని ప్రతి లీలల యందును ప్రత్యక్షా ప్రత్యక్ష రూపముతో వాని వెంట నుండును. భగవానుని ఆవిర్భావము, వనవాస, పంపా సరోవర, సీతా వియోగ సమయము లందు శ్రీరామునితో సంభాషించెను. రామ రావణ యుద్ధ సమయ మందు కూడ శ్రీరాముని చెంత నుండి ఉత్సాహితుని చేసెను. అయోధ్య యందు శ్రీరాముని రాజ్యభిషేకా నంతరము ఇతడు ప్రతి దినము వచ్చి తన ఆరాధ్య నగరి అయోధ్య శోభను గాంచుచు, శ్రీరాముని దిన చర్యలను చూచుచు, గానము చేయుచుచు, స్తుతించుచు తిరిగి బ్రహ్మ లోకము నకు వెళ్ళి సనకాది ఋషులకు సమస్త కథలను వినుపించు చుండును. (రామ చరిత మానసము)

శ్రీరాముడు భగవతి సీతతో కలసి రత్న సింహాసనాసీనుడై యుండగా, నారదుడు వారిని దర్శించుటకు ఆకాశ మార్గము నుండి దిగెను. నారదుని చూచి శ్రీరాముడు లేచి నిలువబడి,

సీతాసహితుడై భక్తి పూర్వకముగ పృథ్విపై శిరస్సు నుంచి ప్రణామము చేసి "ముని శ్రేష్ఠా! మీ దర్శనము అతి దుర్లభమైనది. పూర్వజన్మ పుణ్యము వలన మిమ్ము దర్శించితిని. పుణ్యోదయమగు నప్పుడు సత్సంగ ప్రాప్తి గలుగును. మీ దర్శనముతో కృతార్థుడనైతిని" అనెను.

శ్రీరామునితో నారదుడు "ప్రభూ! సాధారణ మానవుని వలె మాటాడుచు నన్నెందుకు మోహమందు పడవేయుచుంటిరి? మీరు సాధారణ మానవులు కారు. ఆదిశక్తి స్వరూపిణి భగవతి సీత మహా మాయా స్వరూపిణి. ప్రభూ! మీరు మాయతో బ్రహ్మాది సమస్త ప్రజలను ఉత్పన్నులను చేయుదురు. ఆ త్రిగుణాత్మక మాయ సదా మిమ్ము ఆశ్రయించియే యుండును. మీరు విష్ణు భగవానులు, జానకి లక్ష్మీదేవి. మీరు శివులు, జానకి పార్వతి. మీరు బ్రహ్మ, జానకి సరస్వతి. మీరు సూర్య దేవులు, జానకి ప్రభ. నిస్సందేహముగ స్త్రీ వాచకములన్నియు శ్రీ జానకీ దేవియే. మరి పురుష వాచకములన్ని మీరే అయియున్నారు. దేవా! త్రిలోకములలో మీ ఇద్దరు తప్ప ఇంకెవరును లేరు. ఈ సమస్త జగత్తు మీ వలననే ఉత్పన్నమైనది. మీలోనే స్థితమై యున్నది. మీలోనే లీనమగుచున్నది. ఇందు వలన మీరే సర్వకారణులు. మీ చరణములపై భక్తియున్న వారికి క్రమముగ జ్ఞాన ప్రాప్తి గలుగును. మీపై భక్తిగలవారలే వాస్తవముగ ముక్తికి పాత్రులు" అనెను.

**త్వం విష్ణుర్జానకీ లక్ష్మీః శివస్త్వం జానకీ శివా ।**
**బ్రహ్మాత్వం జానకీ వాణీ సూర్యస్త్వం జానకీ ప్రభా ॥**

లోకే స్త్రీ వాచకం యావత్ తత్సర్వ జానకీ శుభా ।
పున్నామ వాచకం యావత్ తత్సర్వంత్వం హి రాఘవ ॥
తస్మాల్లోకత్రయే దేవ యువాభ్యాం నాస్తి కించన ।
త్వత్త ఏవ జగజ్జాతం త్వయి సర్వంప్రతిష్ఠితమ్ ।
త్వయ్యేవ లీయతే కృత్స్నం తస్మాత్ త్వం సర్వ కారణమ్।
త్వత్పాద భక్తి యుక్తానాం విజ్ఞానం భవతి క్రమాత్ ।
తస్మాత్ త్వద్భక్తి యుక్తాయే ముక్తి భాజస్త ఏవహి ।

(అధ్యాత్మ రామాయణము)

భగవానుడు భక్తుల, దాసుల దీనతను స్వీకరించువాడు గనుకనే నారదుడు శ్రీరాముని ఎదుట తన దీనతను ప్రకటించి భక్తులకు ఆదర్శమయ్యెను. నారదుని భక్తి విలక్షణమైనది. ఆ రహస్యము రామునకు తెలియును. నారదుడు రాముని ఇట్లను గ్రహించుమని ప్రార్థించెను.

''ప్రభూ ! నేను మీ భక్తుల భక్తుడను. వారికి కూడ దాసుడను. అందువలన నన్ను మోహితుని చేయక నాపై దయ చూపుడు. ప్రభూ ! మీ నాభి కమలము నుండి ఉత్పన్నుడయిన బ్రహ్మ నా తండ్రి. అందువలన నేను మీకు పౌత్రుడను. రాఘవా! ఈ భక్తుని రక్షింపుము''.

అహం త్వద్భక్త భక్తానాం తద్భక్తానాంచ కింకరః ।
అతో మామను గృహ్ణీష్వ మోహాయ స్వనమః ప్రభో ॥
త్వన్నాభి కమలో త్పన్నో బ్రహ్మామే జనకః ప్రభో ।
అతస్తవాహం పౌత్రో ఽ స్మి భక్తం మాంపాహి రాఘవ ॥

(అధ్యాత్మ రామాయణము)

భక్తితో దేవర్షి నారదుని భక్త వత్సల శ్రీరామ భగవానుని సంవాదమును నిత్యము భక్తితో చదువువారు, వినువారు, స్మరించు కొనువారు దేవతలకు కూడ లభించని మోక్షపదమును పొందెదరు.

సంవాదం పఠతి శృణోతి సంస్మరేద్వా
యోనిత్యంముని వర రామయోః స భక్త్యా ।
సంప్రాప్నో త్యమరసుదుర్లభం విమోక్షం
కైవల్యం విరతి పురః సరం క్రమేణ ॥

(అధ్యాత్మ రామాయణము)

ఇట్టి అనన్య భక్తునకు భక్త వత్సల భగవానుడు శ్రీరామునకు పదే పదే ప్రణామములు.



# వాల్మీకి మహర్షి శ్రీరామ భక్తి

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకి కోకిలమ్ ॥
రామేతి పరికూజన్త మారూఢం కవితాలతామ్ ।
శృణ్వతో మోదయన్తం తం వాల్మీకిం కో న వన్దతే ॥

భగవన్నామ యశస్సును కీర్తించుటలో వాల్మీకి మహర్షి అద్వితీయుడు. శ్రీరాముని విశేషములను విశ్వ మందు ప్రకటించిన కీర్తి వాల్మీకి మహర్షిదే. వాల్మీకి రామాయణమే ఆది కావ్యము లేక ఆది రామాయణము. రాముని చరిత్ర కారులైన కవులందరికి శ్రీమద్వాల్మీకి రామాయణమే ఉపజీవ్యము. అందుచేతనే అందరు తమ రచన ప్రారంభమున వాల్మీకి మహర్షికి ప్రణామము లర్పించిరి. వేదములలో వర్ణించబడిన పరమతత్త్వమే శ్రీమన్నారాయణ తత్త్వమే శ్రీమద్రామాయణ మందు శ్రీరాముని రూపమున నిరూపింపబడినది. వేద వేద్య పరమ పురుషోత్తముడు దశరథనందనుడగు శ్రీరాముని రూపమున నవతరించుటచే సాక్షాత్తుగా వేదములు ప్రచేత సపుత్రుడగు శ్రీ వాల్మీకి మహర్షిచే చెప్పబడిన శ్రీ రామాయణ రూపముతో ప్రకటమైనవి.

వాల్మీకి మహర్షి మొదట రత్నాకరుడు ( అగ్నిశర్మ) అను దోపిడి దొంగ శ్రీరామ నామ జపముతో బ్రహ్మతో సమానముగ పూజ్యుడయ్యెను. వాల్మీకి రామాయణ మందు మహర్షి వాల్మీకి దశరథ మహారాజు మంత్రులలో ఒకరిని చెప్పబడినది.

శ్రీరాముడు వనమునకు వెళ్ళుచు చిత్రకూటములోని వాల్మీకి ఆశ్రమ మందు ఒక దినము గడిపెను. వాల్మీకి ఆశ్రమ ములు కొన్ని చిత్రకూట సమీపముననుఁ, కొన్ని ప్రయాగ సమీపముననుఁ, కొన్ని దూర క్షేత్రములందును గలవు. వాల్మీకి చాతుర్మాస్య వ్రత

దీక్షలందు గడిపిన వివిధ స్థానము లందును వాల్మీకి ఆశ్రమములు ఏర్పడినట్లు భావించ వచ్చును. గోస్వామి శ్రీతులసీదాసునకు చిత్రకూటము చాల ప్రియమైన దగుటచే ఎక్కువగా నిచటనే నివసించువాడు.

శ్రీరాముడు ''వనవాస సమయము గడుపుటకు ఉచితమైన స్థానమును చెప్పు''మని వాల్మీకి మహర్షిని ప్రార్థించెను.

వాల్మీకి మహర్షి రామునితో ''మహారాజా ! మీరు లేని స్థానమేదియు నాకు కనిపించుట లేదు. ప్రభూ ! మీరు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను కూడ నాట్యము చేయించువారు. ధర్మము నశించునప్పుడు వేద మార్గమును రక్షించుటకు మీరు అవతరించెదరు. ఈ భగవతి సీతాదేవి మీ మహాశక్తి అయిన యోగమాయ. ఈ లక్ష్మణుడు సాక్షాత్తుగా శేషుని అవతారము. మీరు రావణాది రాక్షసుల వినాశ లీల ప్రారంభించితిరి. రామా! మీ స్వరూపము వాణికి అగోచరము, బుద్ధికి అతీతము, అవ్యక్తము, అకథనీయము, అపారము. బ్రహ్మ, విష్ణు, శివులు కూడ మీ క్రియా కలాపముల రహస్యములను ఎరుగరు. మరి ఈ ప్రపంచమున ఎవరు మిమ్ములను తెలిసికొనగలరు ? ఒక వేళ మిమ్ములను తెలిసికొన గల భక్తులు ఉన్నచో అది మీకు వారిపై ఉన్న కృపా విశేషమే అగును'' అని చెప్పుచు వాల్మీకి రామునకు నివాస యోగ్య స్థానములను ఈ విధముగా చెప్పెను.

''రామా ! తృప్తి చెందక సదా ఉత్సాహముతో మీ చరిత్రను గ్రహించువారు మీ కథామృతమును తృప్తి చెందక సదా వినునట్టి భక్తుల హృదయము మీ నివాస స్థానము. తమ నేత్రములతో (చాతకముల వలె) మిమ్ము దర్శించుటకు తపించువారు మీ మంగళమయ విగ్రహమును స్వాతి చినుకువలె భావించి సదా దర్శించగోరు వారి హృదయము మీకు సర్వోత్తమమైన నివాస స్థానము.

ప్రభూ ! మీ రామావతార చరిత్ర మానస సరోవర మందు ముత్యముతో సమానమైనది. ఎవని జిహ్వా నిరంతరము మీ చరిత్రను గ్రహించి ప్రవచించునో అట్టి వారి హృదయ మందు దయతో అవశ్యము నివసించుడు.

ప్రభూ ! మీ మందిరములు, మీరు తిరిగిన స్థలములు, ముఖ్యావతార ప్రాదుర్భావ స్థానములు, మీ లీలా స్థల పరిభ్రమణ ములో అలసట చెందక సదా సర్వత్ర మీ విశేషములను గాంచిన వారి హృదయ మందు నిశ్చయముగ నివసింపుడు.

రామా ! భగవానుని మీద ప్రేమ, వాని చరణముల యందు భక్తి సమానముగ పెరుగుచుండవలెను. ప్రేమ ప్రవాహము శిధిలము గాదు. భక్తి రూప సంపత్తి మాహాత్మ్యము తెలియును గనుక అది నిత్యము పెరుగుటకు ప్రయత్నింపవలెను. భక్తి యే ఈ విశ్వమునకు సర్వాధిక మూల్యనిధి. అందుచేత మీరు దయతో సీతా లక్ష్మణులతో కలసి అట్టి భక్తుల హృదయ మందు నివసింపుడు.

భగవత్కృపతో భగవద్భక్తుల సర్వదోషములు నశించును. సూర్యుని యెదుట అంధకారము ఉండనట్లు వారి హృదయ మందు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములకు స్థానము లేదు. భక్తుడు నిత్యము భగవంతుని స్మృతినే తన సర్వస్వముగా భావించును. అతడు నిదురించినను మెలకువగ నుండినను భక్తి రూప సంపత్తిని రక్షించుకొనును. నిరంతరము భగవానుని జప ద్యానము నందే యుండును. భక్తుని హృదయమందు భగవానుడు భగవద్భజన తప్ప ఇంకేదియు ఉండదు. అందుచేత రఘువీరా ! మీరు ఇట్టి భక్త జనుల హృదయములందు అవశ్యము నివసింపుడు.

హే భగవాన్! భక్తులకు వారి ప్రాణముల కంటె మీరే ప్రియ మైన వారు. మీకు కూడ భక్తియే ప్రాణము కంటె అధిక ప్రియ మైనది. ఇది గ్రహించిన వారే జ్ఞానులు. కృపా సింధూ ! ఇట్టి భక్తుల నిర్మల హృదయమే మీకు శుభ మంగళమయ నివాస స్థానము.

మిమ్మే తమ తల్లి, తండ్రి, స్వామి, సఖుడు, సంపత్తి, సర్వస్వముగా తలంచు వారి మనో మందిరములందు మీరు సీతా లక్ష్మణులతో కలసి అవశ్యము నివసింపుడు.

ప్రభూ ! ఎవరి దృష్టి యందు నరకము, స్వర్గము, అప వర్గము, సంసారములకు స్థానముండదో వారికి సదా సర్వత్ర ధనుర్బా ణములు ధరించిన మీరే దృష్టిగోచర మగుచుందురు. వారు ఎక్కడ తిరిగినను, ఎక్కడికేగినను, మీ సుందర సౌమ్యాకృతినే దర్శిం చెదరు. వారి మనస్సు, వాక్కు, కర్మలు సదా మిమ్మే స్మరించును. మీపై ఇట్టి స్వాభావిక ప్రేమ గలిగిన భక్తుల హృదయములందు మీరు అవశ్యము నివసింపుడు. అదియే మీ గృహము''.

వాల్మీకి ఈ విధముగ ప్రార్థించిన తరువాత తన ఆశ్రమ మునకు కొద్ది దూరములో నున్న కామదగిరి సమీపమున మందాకినీ తీరమున నివసింపుమని చెప్పెను. అది అత్రి మహర్ష్యాది తపస్సులకు నివాసము.

రాముడు వాల్మీకి మహర్షి, అత్రి మహర్షి ఆశ్రమముల మధ్య తన వనవాసమునకు నివాస స్థానము నిర్మించుకొనెను.

ఈ విధముగ వాల్మీకి మహర్షి జీవితమే రామమయ మైనది. రామ భక్తితో అందరికి సందేశమొసగి తన జీవితమును సఫలము గావించు కొనెను. సర్వత్ర అనంతగుణగణ నిలయుడగు శ్రీరామ భగవానుని గుణ గాథను, దయను భక్త వత్సలతను వర్ణించి తన వాక్కులను పవిత్రము గావించు కొనెను. శ్రీమద్వాల్మీకి రామాయణ మందు ఆయన గూఢ భక్తి ప్రస్ఫుటితమగును. ఆతడు ఒక చోట -

'' ప్రభూ ! అగ్ని మీ క్రోధము. చంద్రుడు మీ ప్రసన్నతా స్వరూపము. మొదట వామనావతార మందు మీరు పరాక్రమ ముతో మూడు లోకములను లంఘించితిరి. బలిని బంధించి ఇంద్రుని రాజు గావించితిరి. భగవతి సీత లక్ష్మి, మీరు ప్రజాపతి

విష్ణువు. రావణవధ కొరకు మీరు మనుష్య శరీర మందు ప్రవేశించితిరి. ఈ కార్యము మీరే నెరవేర్చవలెను.

దేవా ! మీ బల వీర్య పరాక్రమములు సర్వథా అమోఘములు. శ్రీ రామా ! మీ దర్శనము స్తుతి అమోఘములు. పృథ్విపై మీ భక్తులు కూడ అమోఘమైన వారే. పురాణ పురుషోత్తమా ! శ్రీరామా ! మీ యందు భక్తితో, మిమ్ము ఉపాసించు వారికి ఈ లోకము నందు, పరలోకము నందు దుర్లభమైనది లేదు'' అని వ్రాసెను.



# వసిష్ఠ మహర్షి శ్రీరామ భక్తి

బ్రహ్మ మానస పుత్రుడైన వసిష్ఠ మహర్షి తపః స్వరూపుడు క్షమామూర్తి. ఇతని ఆవిర్భావ కథ వివిధ పురాణ ములలో పలురకములుగ నున్నది. కొన్నిటిలో బ్రహ్మ మానస పుత్రుడనియు, ఆగ్నేయ పుత్రుడనియు, మిత్రావరుణ పుత్రు డనియు చెప్పబడినది. కల్ప భేదముతో చూచిన ఇవి అన్నియు సత్యమైనవే. వసిష్ఠ మహర్షి సప్త ఋషులలో ప్రధానుడు. అద్వైత సంప్రదాయ పరంపరలో మూడవ వాడు.

''నారాయణం పద్మభువం వసిష్ఠమ్''. అద్వైత వేదాంత సమస్త గ్రంథములకు మూలమైన యోగ వాసిష్ఠ గ్రంథము వసిష్ఠునిదే. సతీశిరోమణి భగవతి అరుంధతి ఇతని పత్ని. ఈమె సప్తర్షి మండల సమీపమున పతి సేవ యందు నిమగ్నయై యుండును. ఆ మహర్షి వసిష్ఠ సంహిత యందు కర్మమహత్త్వ మును, ఆచరణ యొక్క ఆదర్శమును స్థాపించెను. ఇతిహాస పురాణములయందు ఇతని మహనీయోజ్జ్వల చరిత్ర బహు విస్తారముగ నున్నది.

సాక్షాత్తుగా బ్రహ్మ స్వరూపుడగు శ్రీరామ భగవానుని చరణములపై వసిష్ఠ మహర్షి భక్తి జన్మ జన్మాంతరములది అయినను ఈ అవతారము నందు రామ దర్శ నాభిలాష ఆయనకు అతి తీవ్రమయ్యెను. అది గ్రహించి తండ్రి అయిన బ్రహ్మ ''కుమారా!

నీవు ఇక్ష్వాకుకుల పౌరోహిత్యము స్వీకరింపు'' మనెను. కాని వసిష్ఠునకా పని ఇష్టము లేకుండెను. పురోహిత పదవి శ్రేష్ఠమైనది కాదని తలచెను. దీనిలో విషయ భోగలాలసతధన లోభముండు నని స్వీకరించుటకు ఇష్టపడలేదు.

సర్వజ్ఞాని సర్వజ్ఞుడైన బ్రహ్మ ఇది గ్రహించి ''కుమారా! నీవు ఆ విధముగ ఎందు కను కొందువు ? నీ పరమ ధ్యేయుడు పరబ్రహ్మ పరమాత్ముడు రాముని రూపమున ఈ వంశ మందే ప్రాదుర్భావ మగును. వానిని దర్శించుటే కద నీ అభిలాష. అందుచేత ఈ కార్యమందు నీకు లాభమే గాని హాని లేదు. నీ ఆరాధ్య దైవమైన శ్రీరామునకు గురువుగా గౌరవమైన పదవిని పొంది కృతార్థుడవగుదువు. నీ కోరిక సిద్ధించును'' అని చెప్పెను.

తండ్రి మాటలు వినిన వసిష్ఠుడు అత్యంత ప్రసన్నుడై ''తండ్రీ ! సమస్త యోగ సాధన, యజ్ఞ దాన స్వాధ్యాయ జపతప ములు తీర్థ సేన, శుభకర్మల ఫలములు ఇవన్నియు భగవత్ప్రాప్తి కొరకే అయినప్పుడు, సూర్య వంశాచార్యత్వము వంటి సుఖమయ కార్యము చేయుట ప్రాప్తమైన, అంత కంటె అధిక లాభమైనది నాకు ఇంకే ముండును ?'' అనుచు తండ్రి మాటను సంతోషముగ స్వీకరించెను.

వసిష్ఠుని జీవనమే రామమయము. సదావాని భక్తి, ఉపాసన లందే మునిగి యుండును. వసిష్ఠుడు రామునితో ''ప్రభూ ! కర్మ కాండాది సాధనములతో సాధకునికి జ్ఞానోదయముగాదు. మీ

చరణారవిందములపై యుండు అనురాగ భక్తియే ఆత్మ జ్ఞానమును గలిగించును. జలమును చిలికి ఎవ్వరైన నెయ్యిని పొందగలరా ? అట్లే రఘునాథా ! భక్తి యను నిర్మల జలముతోనే అన్తః కరణము శుద్ధియగును'' అనెను. (రామ చరిత మానసము)

శ్రీరాముని చరణ కమలముల సేవలో నిరంతరముండు తపస్యులకు అనేక జన్మల సంచిత మనోమలినము వెను వెంటనే నశించును. రాముని చరణముల నుండి ఉద్భవించిన శ్రీగంగ స్వ చరణాశ్రయుల మనోమలినమును తొలగించి జ్ఞానుల గావించి సంసార చక్రమున పడకుండ కాపాడును. అందువలన మనో వాక్కాయ కర్మలచే రాముని భజించవలెను. (శ్రీమద్భాగవతము)

వసిష్ఠ మహర్షి భగవానుని భక్తి మహిమను వర్ణించుచు ''ప్రభూ ! నిరంతరము మీ చరణ కమలములపై వర్ధమాన ప్రేమను గలిగి యుండు వారే నా దృష్టి యందు త్రికాలజ్ఞులు, సర్వజ్ఞులు, తత్త్వజ్ఞులు, మర్మజ్ఞులు, పండితులు, విద్వాంసులు. వారే సమస్త గుణాగారములు అఖండ జ్ఞాన విజ్ఞాన భండారులు. వారే సమస్త లక్షణ యుక్తులు. భగవంతుని చరణములపై ప్రీతిలేక సర్వజ్ఞత్వాది గుణములు గలిగియున్నను అవి వ్యర్థములు. అందువలన శ్రీహరి చరణములపై ప్రేమ గలిగి యుండుట సర్వశ్రేష్ఠము'' అనెను.

ఈ రహస్యము తెలిసిన వాడు గనుకనే వసిష్ఠ మహర్షి ప్రభుని ఇతర కాంక్షలు కోరలేదు. ముక్తి కూడ కోర లేదు. కేవలము శ్రీ రామునిపై అఖండ భక్తిని మాత్రమే కోరుకొనెను.

''రామా ! మీ చరణ కమలములపై ప్రేమ నా జన్మ జన్మాంతరముల యందును ఉండవలెను'' అని కోరగా శ్రీరాముడు తన గురువునకు ప్రసన్నుడై అఖండ భక్తి వరమొసగి కృపా పూర్ణుడయ్యెను.

వసిష్ఠ మహర్షి అరుంధతితో కలసి సప్తర్షి మండలమందు నేటికిని స్థితుడై, శ్రీరామ భక్తిలో నిమగ్నుడై జగత్కల్యాణము గావించుచున్నాడు. (రామ చరిత మానసము)



# అగస్త్య మహర్షి శ్రీరామ భక్తి

పెరుగుచున్న వింధ్యగిరిని అదుపు చేసిన పరమ తేజస్వి అగస్త్య మహర్షి ఆశ్రమము అతి మనోహరము. అచట యే ఋతువు నందైనను సుందర పుష్పములు, సుస్వాదు ఫలములు లభించును. మృగాది పశువులు అచట శాంతిగ సుఖముగ సంచరించుచుండును. పలురకములైన పక్షులు మధుర స్వరముతో గానము చేయుచుండును. రాక్షస గణములు ఈ ఆశ్రమ సమీపమునకు కూడ రాలేవు. భయముతో దూరముగ పారిపోవును. ఏ దృష్టితో చూచినను ఆపదలేని ఆశ్రమము. అందువలన తపోధనులు, ఋషులు, మునులు, దేవతలు, యక్ష, నాగ, పశు పక్ష్యాదులు కూడ ఇచట జీవనము గడుపుచుందురు. అగస్త్య మహర్షిని ప్రశంసించుచు శ్రీరాముడు లక్ష్మణునితో-

**నాత్ర జీవేన్మృషావాదీ క్రూరో వాయది వా శఠః।**
**నృశంసః పాపవృత్తోవా మునిరేష తథా విధః॥**

(వాల్మీకి రామాయణము)

ఈ ముని ఎంతటి ప్రభావశాలియనిన వీని ఆశ్రమ మందు అసత్యము పలుకువారును క్రూరశఠ, నృశంస, పాపాచారులు జీవితము గడుప లేరు.

ఒక సమయమున క్షీరాబ్ధి సమీపమున బ్రహ్మ, శ్రీరాముని ''రావణుని వధించి పృథ్వీ భారము తొలగించు'' మని ప్రార్థించెను. అప్పటి నుండి అగస్త్య మహర్షి తన ఆశ్రమము నందే యుండి శ్రీరాముని దర్శనార్థము నిరీక్షించు చుండెను. తన శిష్యుడు

సుతీక్ష్ణుని గురుదక్షిణగా తనకు శ్రీరామ భగవానుని దర్శనము చేయింపుమని కోరుకొనెను. సుతీక్ష్ణుడు శ్రీ అగస్త్యుని చరణములకు ప్రణామములు చేసి శ్రీరామ భగవానుని కొరకు అచటి నుండి వెళ్ళెను. అతడు నిరంతర సాధనలో మునిగి యుండెను. శ్రీరాముని చరణములపై ఇతని భక్తి అనుపమైనది. అందుచేత శ్యామసుందరుడు శ్రీ సీతా లక్ష్మణ సహితుడై దర్శనమిచ్చెను. ఇతని కోరిక తీరెను. ప్రభుని వెంట బెట్టుకొని తన గురువు శ్రీ అగస్త్య మహర్షి ఆశ్రమమునకు వెళ్ళెను. ఆ సమయమందు అగస్త్యుడు రామ భక్తులతో కలసి శ్రీరాముని గుణములను గానము చేయుచుండెను.

దండవత్ ప్రణిపత్యాహ వినయావనతః సుధీః ।
రామో దాశరథి ర్బ్రహ్మన్ సీత యా లక్ష్మణేన చ ।
ఆగతో దర్శనార్థం తే బహిస్తిష్ఠతి సాంజలిః ॥

సుతీక్ష్ణుడు వినయ పూర్వకముగ ప్రణామములు చేసి "బ్రహ్మర్షీ! దశరథ కుమారుడు శ్రీరాముడు సీతా లక్ష్మణులతో కలసి మిమ్ము దర్శించుటకు వచ్చియున్నాడు. అంజలి ఘటించి ఆశ్రమము వెలుపల నిలువ బడియున్నాడు" అనెను. ఈ మాటలు వినిన వెంటనే అగస్త్య మహర్షి తన పరమారాధ్యుని దర్శించుటకు పరుగిడెను.

రామో ఽ పి ముని మాయాన్తం దృష్ట్వా హర్ష సమాకులః।
సీత యా లక్ష్మణేనాపి దండవత్ పతితో భువి ॥
ద్రుతము త్థాప్య ముని రాడ్ రామ మాలింగ్య భక్తితః ।
తద్గాత్ర స్పర్శ జాహ్లాద స్రవన్నేత్ర జలాకులః ॥

మునీశ్వరుడు వచ్చుట గాంచిన శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై పృథ్విపై దండప్రణామములు చేసెను. ముని వెను వెంటనే రాముని లేపి ప్రేమ పూర్వకముగ హృదయమునకు చేర్చుకొనెను. శ్రీరాముని శరీర స్పర్శ పొందిన ముని నేత్రములు ఆనంద జలపూరితము లయ్యెను.

తరువాత అగస్త్య మహర్షి వాత్సల్యముతో కుశల ప్రశ్న లడిగెను. శ్రీరాముని అమృత వాక్కులతో మహర్షి రోమ రోమములు పులకించెను. తన ప్రాణాధారులగు శ్రీసీతా రాములను లక్ష్మణుని సుందర ఆసనముపై కూర్చుండబెట్టి ప్రేమతో పూజించెను. వనములోని సుందర సుస్వాదు ఫలములతో వారిని సంతుష్ట పరచి "నేడు నా వంటి భాగ్యశాలి ఎందున లేడు. యోగుల మనస్సులను రంజింప జేయువాడు, భక్తులకు ఆనంద మొసగువాడు అయినట్టి శ్రీరాముని, విదేహ తనయ సీతను, లక్ష్మణుని నా ఆశ్రమ మందు ప్రత్యక్షముగ చూచుచున్నాను. దయామయా ! మీ దయ అనంతము" అనుచు ఈ విధముగ స్తుతించెను.

దీర్ఘ కాలం మ యా తప్త మనన్య మతినా తపః ।
తస్యేహ తపసో రామ ఫలం తవ య దర్శనమ్ ॥
సదా మే సీతయా సార్ధం హృదయే వస రాఘవ ।
గచ్ఛతస్తిష్ఠతో వాపి స్మృతిః స్యాన్మే సదాత్వయి॥
(అధ్యాత్మ రామాయణము)

"ప్రభూ ! నేను దీర్ఘ కాలము నుండి అనన్య భావముతో తపస్సు చేయుచుంటిని. రామా ! నేడు మిమ్ములను ప్రత్యక్షముగ పూజించితిని. ఇదే ఆ తపస్సు ఫలము. రాఘవా ! సీతా సహితులై

మీరు సర్వదా నా హృదయ మందే నివసింపుడు. సర్వకాల సర్వావస్థల యందు మిమ్ము స్మరించునట్లు చేయుడు''.

ఈ విధముగ స్తుతించి అగస్త్య మహర్షి (రాక్షస సంహారము కొరకు) పూర్వ కాలమున శ్రీరాముని కొరకు ఇంద్రుడిచ్చిన ధనస్సు, బాణములను ఎప్పుడును ఖాళీ కాక నిండి యుండు రెండు అమ్ముల పొదులను, రత్నఖచిత ఖడ్గమును ఇచ్చి ముని జనవందితుడగు శ్రీరామునితో-

**అనేన ధనుషా రామ హత్వా సంఖ్యే మహాసురాన్ ।**
**అజహార శ్రియం దీప్తాం పురా విష్ణుర్దివౌకసామ్ ॥**
**తద్ధనుస్తౌ చ తూణీచ శరం ఖడ్గం చ మానద ।**
**జయాయ ప్రతి గృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా ॥**

(వాల్మీకి రామాయణము)

''శ్రీరామా ! పూర్వ కాలమందు విష్ణు భగవానుడు ఈ ధనస్సుతోనే యుద్ధ మందు గొప్ప గొప్ప రాక్షసులను సంహరించి దేవతలకు అధికార లక్ష్మిని తిరిగి చేకూర్చెను. మీరు ఈ ధనస్సును, ఈ రెండు తూణీరములను, ఈ బాణములను రాక్షసులపై విజయము పొందుటకు వజ్రధారి ఇంద్రుడు వజ్రమును గ్రహించినట్లు గ్రహింపుము'' అనెను.

సర్వ సమర్థుడు సర్వేశ్వరుడగు శ్రీరాముడు ఆ శ్రేష్ఠాయుధములను గ్రహించి వినయముగ ''మహామునీ ; మీరు నా యందు దయ ఉంచి జలము పుష్ప ఫలాదులు చక్కగ నుండునట్టి స్థానమును చెప్పితిరి. అచట కుటీరము నిర్మించుకొని సుఖముగ కాలము గడుపుదును '' అని ప్రార్థించెను.

తన పరమారాధ్యుడు అఖిల సృష్టికి స్వామి, జగదాధారుడగు శ్రీరాముని ముఖారవిందము నుండి వెలువడిన వచనములను

వినిన అగస్త్యుని నేత్రములు కన్నీటితో నిండి ప్రవహించినవి. ఆయన రాముని సౌందర్య శీల వినయాది గుణములకు అతి ముగ్ధుడయ్యెను

పద్మ పత్రాక్ష శ్రీరాముడు అగస్త్య మహర్షి చరణములకు ప్రణామము లర్పించి అచటి నుండి దండక వనమునకు ప్రయాణమై వెళ్ళెను.

అగస్త్య మహర్షి ధన్యుడు. వాని రామ పద ప్రీతి ధన్యము.



# భరద్వాజుని శ్రీరామ భక్తి

*మహామోహా మహిషేసు బిసాలా ।*
*రామ కథా కాలికా కరాలా ॥*

జనులు భగవానుని మంగళ ప్రదమైన చరిత్ర వినినంతనే తాపములు నశించి శాంతి నొందెదరు. మాయతో గలిగిన కామ క్రోధ లోభ మోహాది వికారములు తొలగిపోవును. ఇందువలన సత్ పురుషులు సదా భగవత్కథను వినుచు చెప్పుచు నుండెదరు. శ్రీహరి నిత్య దివ్య గుణములు హృదయమం దున్న వారు విషయాసక్తులు గాక సమస్త లౌకిక భోగముల యందు విరక్తులై యుందురు. ఆనంద కందమగు ప్రభుని చరిత్ర కూడ ఆనంద రూపమే. వాని సుధా మధురిమలను ఒక్క మారు ఆస్వాదించిన మనస్సు ఇంకేదియు కోరదు.

దేవ గురువు బృహస్పతి సోదరుడు ఉతథ్యుని కుమారుడు భరద్వాజుడు శ్రీరామ కథా శ్రవణమున అనన్యరసికుడు. ఇతడు బ్రహ్మ నిష్ఠుడు, శ్రోత్రియుడు, తపస్వి, పరమ భక్తుడు. తీర్థ రాజమగు ప్రయాగ యందు గంగా యమునల సంగమమునకు కొద్ది దూరమున భరద్వాజుని ఆశ్రమము గలదు. వేల కొలది బ్రహ్మచారులు వీని దగ్గర విద్యాధ్యయనమునకు వచ్చి, గొప్ప విరక్తులై వీని చెంతనే యుండి, తమ అధికారాను సారము యోగము, ఉపాసన, తత్త్వాను సంధానది పారమార్థిక సాధన చేయుచు, ఆత్మ కల్యాణ ప్రాప్తికి నిరీక్షించుచుండెదరు. భరద్వాజునకు ఇద్దరు

పుత్రికలుండిరి. వీరిలో ఒకరు యాజ్ఞవల్క్య మహర్షిని వివాహము చేసికొనిరి. మరొకరు విశ్రవోముని పత్ని. వీని పుత్రుడే లోకపాలుడు కుబేరుడు.

శ్రీరామునకు భరద్వాజునిపై అనన్యానురాగ ముండెను. వనవాస మేగునప్పుడు ప్రయాగ యందున్న ఈ ముని ఆశ్రమ మందు ఒక రాత్రి నివాసము చేసెను.

శ్రీభరతుడు శ్రీరాముని తిరిగి తెచ్చునుద్దేశ్యముతో చిత్రకూటమునకు వెళ్ళునప్పుడు ఈ ముని ఆశ్రమ మందు ఒక రాత్రి యుండెను. భరాద్వాజుడు తన తపోబలముతో సిద్ధుల ప్రభావమున భరతుని వెంట వచ్చిన అయోధ్యా వాసులందరికి అద్భుతాతిధ్య మిచ్చి వారిని ఆశ్చర్య చకితులను గావించెను. ఇతడు ని[illegible]మైన శ్రీరామ భక్తుడు. అందువలన ఇతనికి భగవానుని భక్తులు, భగవానుని కంటె అధిక ప్రియులు. ఎవరైన భగవద్భక్తుని కలయిక ఆయనకు భగవంతుడు ప్రత్యక్షమగుట కన్న అధిక సుఖదాయక మగును. భరతునితో కలయిక భరద్వాజుని ఎంతయు ఆనందపరచినది.

శ్రీరఘునాథుడు లంకా విజయానంతరము తిరిగి వచ్చునప్పుడు కూడ, పుష్పక విమానము నుండి దిగి భరద్వాజుని దగ్గరకు వెళ్ళెను. శ్రీరాముడు సాకేత ధామ ప్రవేశానంతరము భరద్వాజుడు భువన సుందరుని రూపము ధ్యానించుచు వాని గుణములనే మనస్సున తలచు కొనుచుండెను. మాఘ మాసమందు ప్రతి సంవత్సరము ప్రయాగలో ఋషిగణములు మకర స్నానము చేయుదురు. ఒకసారి మాఘ మాస స్నానములు పూర్తి అయిన

తరువాత ముని గణములు వెళ్ళుచుండ భరద్వాజుడు యాజ్ఞవల్క్య మహర్షిని శ్రీరామ కథ వినిపింపుమని ప్రార్థించి ఆపెను.

యాజ్ఞ వల్క్య మహర్షి ప్రసన్నుడై శ్రీరాముని చరిత్రను వర్ణించెను. ఈ విధముగ భరద్వాజుని కృపతో లోకమున శ్రీరాముని చరిత్రమను మంగళ ప్రవాహము ప్రవహించెను.

(రామ చరిత మానసము)



# ఆరణ్యాక ముని శ్రీరామ భక్తి

*రామనామ బిను గిరాన సోహా ।*
*దేఖు బిచార త్యాగి మద మోహా ॥*

శ్రీరాముడు త్రేతాయుగ మందు అవతరించెను. అంత కంటె ముందు ఆరణ్యాక ముని పరమాత్మ తత్త్వమును గ్రహించి, పరమ శాంతి పొందుటకు ఘోరముగ తపస్సు చేయుచుండెను. దీర్ఘకాలమైనను తపఃఫలము లభించ లేదు. అప్పుడు ముని మరి యొక జ్ఞాని యగు పురుషుని వెదుక నారంభించెను. అతడు అనేక తీర్థములు తిరిగెను. ఎంత మందినో కలిసెను. కాని సంతోషము గలుగలేదు. అతడు ఒక దినము తపోలోకము నుండి తీర్థ యాత్ర కొరకు క్రిందికి దిగిన లోమశ ఋషిని దర్శించెను.

ఆ ఋషిని సమీపించి చరణములకు ప్రణామములు గావించి నమ్రతతో ఇట్లు ప్రార్థించెను. ''మహాత్మా ! దుర్లభమైన మానవ శరీరము పొందిన జీవులు, ఏ ఉపాయమున ఈ సంసార సాగరమును దాటవలెను ? మీరు దయతో నాకేదైన అట్టి వ్రత, దాన, జప, యజ్ఞములు గాని, దేవారాధన గాని ఉన్న చెప్పి ఈ భవసాగరము నుండి దాటించుడు''.

''దాన తీర్థ వ్రత యమ నియమ యజ్ఞ యోగ తపః ప్రభృతు లన్నియు ఉత్తమమైన కర్మలు. కాని వీని ఫలితము స్వర్గము. ఎప్పటి వరకు పుణ్యముండునో ప్రాణులు అప్పటి వరకు స్వర్గ మందు సుఖము లనుభవించెదరు. పుణ్యము సమాప్తమైన తరువాత క్రింద పడదురు. అయినను వీరు శుభ కర్మలు చేయని మూఢుల కంటె ఉత్తములు. చూడుము నేను నీకు ఒక ఉత్తమమైన రహస్యమును చెప్పుచున్నాను వినుము. శ్రీరామ భగవానుని కంటె గొప్ప దేవతలు లేరు. రామ వ్రతము కంటె ఉత్తమమైనది లేదు. రాముని కంటె

శ్రేష్టమైన యోగము లేదు. గొప్ప యజ్ఞములు కూడ లేవు. శ్రీరామ నామ జపము, శ్రీరాముని పూజించుట చేయు మనుష్యులు ఈ లోకము నందును, పరలోకము నందును సుఖపడెదరు. శ్రీరాముని శరణు వేడిన ప్రాణులు అనాయాసముగ సంసార సాగరమును దాటుదురు. శ్రీరాముని స్మరించి ధ్యానించు మానవుల అన్ని కోరికలు సిద్ధించును. ఇట్టి వారికి పరమపద ప్రాప్తిని కలిగించు భక్తి శ్రీరాముడే ఇచ్చును. ఉత్తమ కులమందు జన్మించిన వారి మాటకేమి గాని, చాండాలురైనను ప్రేమతో శ్రీరాముని స్మరించిన పరమగతిని పొందుదురు. శ్రీరాముడొక్కడే పరమ దైవము. శ్రీరాముని పూజించుటే ప్రధాన వ్రతము. రామ నామమే సర్వోత్తమమైన మంత్రము. శ్రీరాముని స్తుతియే ఉత్తమ శాస్త్రము. అందువలన నీవు హృదయ పూర్వకముగ శ్రీరాముని భజింపుము, పూజింపుము, ధ్యానింపు'' మని లోమశ మహర్షి ఉపదేశించెను.

ఉపదేశము వినిన ఆరణ్యక ముని అమితానందుడయ్యెను. ''ధ్యానించుటకు శ్రీరాముని స్వరూపమును తెలుపు'' డని కోరెను.

''రమణీయాయోధ్యా నగర మందు కల్పతరువు క్రింద విచిత్ర మండప మందు శ్రీరామ చంద్ర భగవానుడు విరాజమానుడై యుండును. మహామరకతమణి, నీలకాంతమణి స్వర్ణములతో నిర్మించిన అతిమనోహరమైన సింహాసనము వానిది. ఆ సింహాసనము కాంతి నాలుగు వైపులకు వెదజల్లబడుచుండును. నవదూర్వాదల శ్యామ సౌందర్య సాగరుడు, దేవేంద్ర పూజితుడు భగవానుడగు శ్రీరఘునాథుడు సింహాసనముపై కూర్చుండి అద్భుత ప్రకాశముతో మునుల మనస్సులను హరించుచుండెను. వాని ముగ్ధ ముఖ మండలము కోట్ల చంద్రుల కాంతిని మించియున్నది. వాని కర్ణములకు మకరాకృతి కుండలములు, మస్తకముపై కిరీటము

శోభించుచుండెను. కిరీట మందున్న మణుల రంగుల కాంతితో శరీరము రంజిత మగుచున్నది. మస్తకముపై నల్లని ఉంగరములు తిరిగిన కేశము లున్నవి. ముఖమందు చంద్ర కిరణముల వంటి దంత పంక్తి శోభించు చున్నది. వాని అధరము విద్రుమ మణి వలె మనోహరముగ నున్నది. వీని యందు శాస్త్ర సహిత ఋక్సామాది నాలుగు వేదముల స్ఫూర్తి యున్నది. వాని ముఖ కమల మందు నాసిక జపాం కుసుమము వలె నున్నది. వాని కంఠము కమనీయ శంఖము వలె నున్నది. వీని రెండు భుజములు సింహ స్కంధముల వలె ఎత్తుగ బలముగ నున్నవి. బాహువులు మోకాలి వరకు ఉన్నవి. చేతుల యందు పచ్చల ఉంగరములు మెరయు చున్నవి. కేయూర కంకణములు అపూర్వముగ శోభిల్లు చున్నవి. వీని మనోహర విశాల వక్షఃస్థలవము శ్రీలక్ష్మి శ్రీవత్సాది విచిత్ర చిహ్నాములతో విభూషితమై యున్నది. ఉదర మందు మూడు రేఖలున్నవి. నాభి గంభీరముగ నున్నది. మనోహరముగ నున్న నడుమున మణులతో పొదిగిన మొలత్రాడు శోభతో నున్నది. సుందరమైనవి భుజములు, మనోహరమైనవి మోకాళ్ళు. యోగులకు ఆరాధ్యము పరమ మంగళమయమునగు చరణయు గల మందు వజ్రము, అంకుశము, ధ్వజాది చిహ్నాములు అంకితములై యున్నవి. హస్త మందు ధనుర్బాణములు, భుజ స్కంధములపై అంబులపొది శోభించు చున్నవి. ముఖముపై సుందరమైన తిలకము గలదు. ఈ దివ్య శోభా పూర్ణాకృతితో శ్రీరాముడు అందరి చిత్తములును బలవంతముగ తన వైపు లాగుచున్నాడు''.

ఈ విధవముగ ప్రకాశించుచున్న శ్రీరాముని దివ్య స్వరూపమును లోమశుల వారు వర్ణించి చెప్పి ''మునీ ! ఈ విధముగ నీవు శ్రీరామ భగవానుని ధ్యానించి స్మరించిన అనాయాసముగ సంసార సాగరమును దాట గలవు'' అని చెప్పెను.

లోమశుల వారి మాటలు వినిన ఆరణ్యక ముని వినయముగ "భగవానుడా! నా యందు దయతో శ్రీరాముని ధ్యానముగ చెప్పి గొప్ప మేలు చేసితిరి. మీ ఉపకార భారముతో ముడుచుకొని పోయితిని. స్వామీ! ఈ శ్రీరాముడెవరు ? వీని మూల స్వరూపమేది ? ఈ అవతారము ఎందుకు ధరించెను ? చెప్పు" డని కోరెను.

లోమశ మహర్షి "వత్సా ! పూర్ణ సనాతన పరాత్పర పరమాత్మయే శ్రీరాముడు. సమస్త విశ్వ బ్రహ్మాండములను ఇతడే ఉత్పత్తి గావించెను. ఇతడే సర్వాధారుడు. అందరిలో వ్యాపించియున్న అందరి స్వామి. అందరిని సృష్టించువాడు, పాలించువాడు, సంహరించువాడు ఇతడే. సమస్త విశ్వము ఇతని లీలా వికాసము. సమస్త యోగీశ్వరులకు పరమేశ్వరుడు దయాసాగరుడు. జీవుల దుర్గతిని చూచి వారిని ఘోర నరకముల నుండి రక్షించుటకు జగత్తు నందు తన లీలలను, గుణములను విస్తరింప జేసెను. వీనిని గానము చేసి పాపులు తరించుచున్నారు. ఈ శ్రీరాముడు అవతరించుటకు ఇదియే కారణము" అని చెప్పెను.

తరువాత లోమశ ముని శ్రీరాముని చరిత్ర మొత్తము సంక్షేపముగ చెప్పి "త్రేతాయుగాంత మందు శ్రీరాముడు అవతరింప బోవుచున్నాడు. అప్పుడు శ్రీరాముడు అశ్వమేధ యజ్ఞము చేయును. అశ్వము వెంట రాముని తమ్ముడు శత్రుఘ్నుడు వచ్చును. అతడు మీ ఆశ్రమమునకు వచ్చును. అప్పుడు మీరు శ్రీరాముని దర్శించి వానిలో లీనులు కండు" అని చెప్పెను.

మహర్షి ఉపదేశానుసారము ఆరణ్యక ముని రేవా నది తీరమున ఒక కుటీరము నిర్మించుకొని ఉండసాగెను. నిరంతరము రామ నామ జపముతో పూజా ధ్యానములందుండెను. చాలకాలము గడిచిన తరువాత అయోధ్యలో మర్యాదా పురుషోత్తముడు శ్రీరాఘవేంద్రుడు అవతరించెను. లంకా విజయాది లీలలు

గావించి అయోధ్యలో అశ్వమేధ యజ్ఞము చేయుచుండెను. అప్పుడు యజ్ఞాశ్వమును వదలిరి. అశ్వము వెనుక గొప్ప సేనతో శత్రుఘ్నుడు వెళ్ళుచుండెను. అశ్వము రేవా తీరమున నున్న ముని ఆశ్రమమును సమీపించెను. శత్రుఘ్నుడు తన వెంట నున్న సుమతితో ''ఇది ఎవరి ఆశ్రమము ?'' అని అడిగెను. అతడు పరిచయము చేయగా ముని ఆశ్రమమున కేగెను. ముని వానికి స్వాగతము పలికి, శత్రుఘ్ని పరిచయము పొంది ఆనందమగ్నుడయ్యెను. ''నా చిరకాల వాంఛ నెరవేరినది. నేనింక ఇప్పుడు శ్రీరామ భగవానుని దర్శించెదను. నా జీవితము సఫల మగును'' అని తలపోయుచు పరమ రమణీయ మగు అయోధ్యా నగరమునకు వెళ్ళెను.

నవదూర్వాదల శ్యాముడగు శ్రీరాముడు నియమానుసారముగ ఆభూషణ రహితుడై మృగచర్మ ఉత్తరీయము ధరించి హస్తమున దర్భతో సరయూ తీరమున యజ్ఞశాల యందు యజ్ఞదీక్షలో నుండెను. అచట దరిద్రులకు కోరిన వస్తువు లిచ్చుచుండిరి. విప్రులకు సత్కారములు చేయు చుండిరి. ఋషి గణములు మంత్రములు పఠించుచుండిరి. కాని ఆరణ్యక ముని శ్రీరాముని రూప మాధుర్యమును దర్శించుచు ఉన్న చోటనే నిలువబడి యుండెను. శరీరము పులకించెను. తెలివి తప్పి భువన మంగళ రూపమును దర్శించుచునే యుండెను.

మర్యాదా పురుషోత్తముడు మునిని చూచెను, వెను వెంటనే నిలువబడెను. ఇంద్రాది దేవతలు లోకపాలురు ఎవరి చరణములపై శిరస్సులుంచెదరో ఆ సర్వేశ్వరుడు శ్రీరాముడు ''మునివరా ! నేడు మీ రాకతో నేను పవిత్రుడనైతిని'' అనుచు ముని చరణములపై పడెను. ఆరణ్యక ముని వెంటనే శ్రీరాముని లేపి తన హృదయమునకు హత్తుకొనెను. తరువాత మునిని ఉచ్చాసనముపై కూర్చుండ బెట్టి రాఘవేంద్రుడు స్వయముగ తన హస్తములతో

వాని చరణములు కడిగి ఆ చరణోదకమును తన శిరస్సుపై చల్లుకొనెను. రాముడు బ్రహ్మణ్య దేవుడు. బ్రాహ్మణుని స్తుతించుచు "ముని శ్రేష్ఠా! మీ చరణోదకముతో నేను నా బాంధువులతో గూడ పవిత్రుడనైతి. మీ రాకతో నా అశ్వమేధ యజ్ఞము సఫలమయ్యెను. ఇప్పుడు నిశ్చయముగ మీ చరణ ధూళితో పవిత్రుడనై ఈ యజ్ఞము వలన రావణ కుంభ కర్ణాది బ్రాహ్మణ సంతానమును వధించిన దోషము నుండి విముక్తుడనగు చుంటిని" అని పలికెను.

భగవానుని మధుర వాక్కులను వినిన ముని నవ్వుచు నిట్లనియె. "ప్రభూ! మీరు మర్యాదను రక్షించు వారు. వేదములు, బ్రాహ్మణులు మీ రూపములే. అందువలన మీరు ఇట్లు మాట్లాడుట ఉచితము గాదు. ఇతర రాజులకు ఆదర్శమగుటకు మీరిట్లు ఆచరించుచున్నారు. బ్రహ్మహత్యా పాతకములు పోవుట కొరకే మీరు అశ్వమేధ యజ్ఞము చేయుచుంటిరి. మర్యాదా పురుషోత్తమా! మీ మర్యాదా పాలన ధన్యము. మహాపాపులు కూడ మీ నామము స్మరించిన పాప సముద్రమును దాటి పరమ పదమును పొందుదురు. రామ నామము ఉచ్చరించని వారిని పాపతాపములు భయపెట్టు చుండును. శ్రీరామా! నేడు నేను ధన్యుడనైతిని. రామ నామ రూప సింహగర్జన వినినంతనే మహా పాప రూప గజములు నామ రూపములు లేకుండ పోవును. ఇది పొందిన నేను సంసార తాపము నుండి ముక్తుడనైతిని".

ముని వచనములు వినిన శ్రీరాముడు వానిని పూజించెను. సమస్త ఋషులు, మునులు, భగవానుని ఈ లీలను గాంచి "ధన్యులము ధన్యులము" అని నినాదములు చేసిరి. ఆరణ్యాక ముని భావావేశమున అందరితో నిట్లనియె. "ముని గణములారా! మీరందరు నా భాగ్యమును చూచితిరి. సర్వలోక మహేశ్వరుడగు శ్రీరాముడు నాకు ప్రణామము చేయుచున్నాడు. అందరికి

పరమారాధ్యుడు నాకు స్వాగతము పలుకుచున్నాడు. శ్రుతులు వెదకు చుండెడి చరణ కమలముల వాడు నా చరణోదకము గ్రహించి పవిత్రుడనైతి ననుచున్నాడు. నేడు నేను ధన్యుడను'' అని చెప్పుచు నుండగ అందరి ఎదుట ముని బ్రహ్మరంధ్రము పగిలిపోయెను. పెద్ద శబ్దము అయ్యెను. స్వర్గ మందు దుందుభులు మ్రోగించి దేవతలు పుష్ప వర్షము కురిపించిరి. అందరు చూచు చుండగా ఆరణ్యక ముని శిరస్సు నుండి ఒక విచిత్రమైన తేజస్సు వచ్చి శ్రీరామునిలో లీనమయ్యెను.



# వేద వ్యాసుని శ్రీరామ భక్తి

నమో ஃ స్తుతే వ్యాస విశాల బుద్ధే
ఫుల్లార విన్దాయత పత్ర నేత్ర ।
యేన త్వయా భారత తైల పూర్ణః
పజ్వాలితో జ్ఞాన మయః ప్రదీపః ॥
వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమ కల్మషమ్ ।
పరాశ రాత్మజం వన్దే శుక తాతం తపో నిధిమ్ ॥

అజ్ఞానాంధకార సముద్ర మందు నిమగ్నులై యుండు ప్రాణులకు ఉపదేశించుటకు గాను సాక్షాత్తుగా నారాయణుడే జగద్గురువగు వ్యాసుని రూపమున అవతరించి ప్రసిద్ధుడై యున్నాడు. వ్యాస మహర్షి ఎల్ల కాలము అమరుడు.

ఆది గురువు శంకరాచార్యునకు బదరీ క్షేత్ర మందు దర్శన మిచ్చి అతనితో కలసి ఇరువది ఏడు దినములు శాస్త్రార్థములు చేసి అంతమున ప్రసన్నుడై తానెవరో తెలిపి వాని ఆయువును ద్విగుణీ కృతము చేసెను. ఈ విధముగ నిజమైన భక్తులకు ఇప్పుడును దర్శన మగుచున్నది. వీని వెంట ఎల్లప్పుడు భక్త, సంత, ఋషి, మునుల సమూహము స్థిరముగ నుండెడిది. ఇతడు వసిష్ఠ భగవానుని ప్రపౌత్రుడు. శక్తి ఋషికి పౌత్రుడు. పరాశరునకు పుత్రుడు, శుకదేవునకు తండ్రి. గురువు శంకరాచార్య, గోవిందాచార్య, గౌడ పాదాచార్యులకు పరమ గురువు. జనకాది రాజర్షులకును ఇతడు గురువు. యమునా ద్వీపమున ఆవిర్భవించిన వెంటనే యువకు డయ్యెనని పురాణ ప్రసిద్ధము. సమస్త వేదములను పఠించెను. ఇతడు సామాన్య వ్యక్తిగాదు.

కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।
కోహ్యన్యో భువి మైత్రేయ మహా భారత కృద్భవేత్ ॥
(విష్ణు పురాణము)

అష్టాదశ పురాణ కర్త, మహాభారత రచయిత, బ్రహ్మ సూత్ర నిర్మాత, వేదములను శాఖోపశాఖలుగ విభజించిన వేదవ్యాసుడు నారాయణునితో సమానుడు.

''యన్న భారతే తన్న భారతే'' అను సూక్తి ననుసరించి నేటి విశ్వ జ్ఞానము, విజ్ఞానము వ్యాస భగవానునిదే. అందువలన ''వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వమ్'' అనునది సుప్రసిద్ధ సత్యము.

వ్యాస భగవానుని సత్సంగములు నిరంతరము నడచు చుండెడివి. సత్సంగ మందు బ్రహ్మ తత్త్వ నిరూపణము, పరమాత్మ యొక్క నిర్గుణ-సగుణ స్వరూప విచారణ, ధర్మ కర్మల వ్యాపకత, వాని ఫలా ఫల మీమాంస, యోగ సాంఖ్యా ధ్యాత్మ జ్ఞానములు, భక్త్యంగములు అనువానిపై చర్చ జరిగెడిది. ఇతడు స్వయముగా వీనిని ఆచరించుట యందు, పాలించుట యందు నిరంతరము నిమగ్నుడై యుండెడి వాడు.

వ్యాసుల వారు శివ, విష్ణు, సూర్య, గణేశ, దేవీ, ఆది నామములతో విభిన్న పురాణములను నిర్మించి, వాని యందు దేవతల భక్తి ప్రవాహమును పారించిన విధము నేటికిని భక్తులకు పరమ సాధనమై యున్నది. విష్ణు భగవానుని మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామనాది నామములపై కూడ ఈయన పురాణములను రచించెను.

రామ భక్తిపై వ్యాస భగవానుడు రెండు గ్రంథములను వ్రాసెను. అవి పద్మ పురాణము, అధ్యాత్మ రామాయణము.

పద్మ పురాణము నందు శ్రీరామ భగవానుని చరిత్ర విస్తారముగ నిరూపింపబడినది. పద్మ పురాణ రామాశ్వమేధ ఖండమున అధికముగ నున్నది. ఇందులో తప్ప శ్రీరాముని ఉత్తర చరిత్ర పూర్తిగ లభించుట లేదు. అధ్యాత్మ రామాయణ మందు యోగజ్ఞాన వైరాగ్యములు, భక్తి యొక్క మధురత ప్రవహించు చుండును. రామ భక్తి గ్రంథములన్నింటి యందును ఉన్న రామ స్తోత్రములు దీని యందు సంగ్రహించబడి యున్నవి. విభిన్న రామ

గీతలు అధ్యాత్మ రామాయణము నుండియే సంగ్రహించబడినవి. వీనిలో హనుమ, లక్ష్మణ, శబరులు చేసిన మూడు కేవలము భక్తి పరమైనని. గోస్వామి తులసీదాసు కూడ వీనినే సంగ్రహించి వ్రాసెను అధ్యాత్మ రామాయణ మందు ఈ విధముగ నున్నది.

తస్మాద్భామిని సంక్షేపాద్వక్ష్యే ఉ హం భక్తి సాధనమ్ ।
సతాంసంగతి రేవాత్ర సాధనం ప్రథమం స్మృతమ్ ॥
ద్వితీయం మత్కథాలాప స్తృతీయం మద్ గుణేరణమ్।
వ్యాఖ్యాతృత్వం మద్వచసా చతుర్థం సాధనం భవేత్॥
ఆచార్యో పాసనం భద్రే మద్బుద్ధ్యా మాయయా సదా ।
పంచమం పుణ్య శీలత్వం యమాది నియ మాది చ .
నిష్కామ త్పూజనం నిత్యం షష్ఠం సాధన మీరితమ్ ।
మమ మంత్రో పాస కత్వం సాంగం సప్తమ ముచ్యతే ॥
మద్భక్తేష్వధికా పూజా సర్వ భూతేషు మన్మతిః ।
బాహ్యార్థేషు విరాగిత్వం శమాది సహితం తథా ॥
అష్టమా నవమం తత్త్వ విచారో మమ భామిని ।
ఏవం నవవిధా భక్తిః సాధనం యస్య కస్యవా ॥
స్త్రీయో వా పురుష స్యాపి తిర్య గ్యోనిగ తస్యవా ।
భక్తిః సంజాయతే ప్రేమ లక్షణా శుభలక్షణే ॥
(అధ్యాత్మ రామాయణము)

''భామినీ ! నేను సంక్షేపముగ భక్తి సాధనములను చెప్పుదును. వీనిలో మొదటి సాధనము సత్సంగము. రెండవ సాధనము నా జన్మ కర్మల కథలను కీర్తించుట. మూడవ సాధనము నా గుణ ము లను చర్చించుట. నాలుగవ సాధనము (గీతా, ఉపనిషాదులతో) నా వాక్యములకు వ్యాఖ్యానము చేయుట. ఐదవ సాధనము నిష్కపటులై తమ గురు దేవుని భగవంతునిగా భావించి సేవించుట. ఆరవ సాధనము పవిత్ర స్వభావము, యమ నియమాదులు పాలించుట, ప్రేమతో సదా నన్ను పూజించుట. ఏడవ సాధనము నా మంత్ర సాంగోపాం గోపాసన చేయుట. ఎనిమిదవ సాధనము నా భక్తులను

నా కంటె అధికముగ పూజించుట. సమస్త జీవుల యందు నన్ను దర్శించుట. బాహ్య పదార్థముల యందు వైరాగ్యము, శమ, దమాది సంపన్నులగుట. తొమ్మిదవ సాధనము తత్త్వ విచారణ. భామినీ ! ఈ విధముగ ఇది నవ విధ భక్తి. ఈ సాధనములు స్త్రీకిగాని, పురుషునికిగాని, పశు పక్ష్యాదులకు గాని ప్రేమ లక్షణముగల భక్తిని గలుగ జేయును''.

వ్యాసుల వారు అగ్ని పురాణ మందు రామునితో లక్ష్మణునకు సమస్త రాజనీతులను బోధింప జేసెను. స్కంద పురాణ మందు బ్రహ్మ ఖండమున సేతు మాహాత్మ్యము, రామ స్తోత్రములతోను, చరిత్రతోను పరిపూర్ణమై యున్నది. దీనిని చూచిన అన్నిటి కంటె పెద్దది రామ భక్తి మహిమ బోధించు గ్రంథమిదేనేమో అనిపించును. దీని యందు మారుతి రాముని స్తుతించుట అమోఘముగ నుండును. ఈ మాహాత్మ్యము 60 శ్లోకములలో నిరూపింప బడి నది. ఇది వ్యాసుల వారికి రామునిపై గల ప్రేమకు భక్తికి నిదర్శనము.

శ్రీమద్భాగవతము కృష్ణ భక్తి గ్రంథము. అయినను దీని యందు కూడ సీతాపతి శ్రీరాముడు ''సీతాపతిర్జయతి లోకమ లంఘ్య కీర్తిః'' అందరి కంటె గొప్ప వాడనియు, వాని కీర్తిని ఎవరు ఉల్లంఘించలేరనియు వ్యాసుల వారు శ్రీరాముని మహిమను అద్భుతముగ నిరూపించిరి. అన్ని దేవాలయముల యందును ''వన్దే మహాపురుషతే చరణార విన్దమ్'' అను శ్లోకములతో పూజా హారతులు గావింపబడుచున్నవి.

ధ్యేయం సదా పరిభవఘ్నమ భీష్ట దోహం
తీర్థా స్పదం శివ విరించినుతం శరణ్యామ్ ।
భృత్యార్తి హం ప్రణతపాల భవాబ్ధి పోతం
వన్దే మహాపురుషతే చరణార విన్దమ్ ॥
త్యక్త్వా సుదు స్త్యజ సురే ప్సిత రాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠ ఆర్యవచసా యదగాదరణ్యామ్ ।
మాయా మృగం దయిత యేప్సిత మన్వధావద్
వన్దే మహాపురుషతే చరణార విన్దమ్ ॥

''ప్రభూ ! మీరు శరణాగత రక్షకులు. మీ చరణారవింద ములు సదా ధ్యానము చేయుటకు యోగ్యమైనవి. మాయా మోహ సాంసారిక పరాజయములను అంతము చేయువాడవు. భక్తుల కోరికలు అన్నియు దీర్చు కామధేను స్వరూపుడవు. తీర్థములకు కూడ తీర్థమైన పరమ తీర్థ స్వరూపుడవు. బ్రహ్మాది మహేశ్వర దేవతలచే నమస్కృతుడవు. శరణు అని కోరి వచ్చువారిని స్వీకరించు వాడవు. సేవకుల సమస్త ఆపదలను నశింప జేయువాడవు. సంసార సాగరమును దాటుటకు ఓడ వంటి వాడవు. మహాపురుషా ! మీ చరణారవిందములకు వందనము చేయుచున్నాను. భగవాన్ ! మీ చరణకమలముల మహిమను ఎవరు చెప్పగలరు ? రామావతార మందు మీ తండ్రి దశరథుని ఆజ్ఞతో దేవతల కొరకు రాజ్యలక్ష్మిని వదలి మీ చరణకమలములు వనము లందు తిరిగినవి. నిజముగా మీరు ధర్మ నిష్ఠాపరులు. మహాపురుషా! మీ ప్రేయసి సీత కోరిక తీర్చుటకు మీ చరణ కమలములు మాయా మృగము వెనుక పరుగిడినవి. నిజముగ మీరు ప్రేమ బద్ధులే. ప్రభూ ! ఇట్టి మీ చరణార విందములకు వందనము చేయుచున్నాను''. దీని వలన వ్యాసుల వారికి శ్రీరాముని పైగల శ్రద్ధా నిష్ఠలు, భక్తి ప్రేమలు వెల్లడియగుచున్నవి.

రామ చరిత్ర ఉప సంహార మందు ఈ విధముగ చెప్పెను.

సయైఃస్పృష్టో ఽభిదృష్టో వా సంవిష్టో ఽ నుగతో ఽ పివా ।
కోసలాస్తే యయుః స్థానం యత్ర గచ్ఛంతి యోగినః ॥
పురుషో రామ చరితం శ్రవణై రుపధారయన్ ।
ఆనృశంస్యపరో రాజన్ కర్మబ న్నైర్విముచ్యతే ॥

(శ్రీమద్భాగవతము)

రాముని స్పర్శ పొందిన వారు, రాముని దర్శించిన వారు, రాముని దృష్టిపడిన వారు, రాముని అనుసరించుచు మాట్లాడు వారు, ఉత్తర కోసల నివాసులందరు సాంతానిక లోకములకు

భగవానుని వెంట వెళ్ళిరి. శ్రీరాముని భక్తులు సమస్త కర్మ బంధనముల నుండి ముక్తులగుదురు.

వ్యాసులవారు సమస్తావతారములను విభిన్న రుచులు గల భక్తుల కొరకు వ్రాసిరి. కాని నామ రూప లీలాది లక్ష్యముతో చూచిన సిద్ధి పురుష ముఖ్య లక్ష్యము. వ్యవసాయాత్మికా బుద్ధిరేకే హకురునందన (గీత) అను వచనానుసారము ఒకే వ్యక్తిగాని రూపముగాని అగును. భగవానుని అవతారుడైన శ్రీ వ్యాసుల వారికి అతని ఆరాధ్య దైవమైన శ్రీరామ భగవానునకు శతకోటి నమస్సులు.

# శరభంగుని శ్రీరామ భక్తి

దండకారణ్య తపో భూమి యందు అనేక బ్రహ్మర్షులు ఘోర తపస్సు చేయుచుండిరి. కఠినమైన యోగాభ్యాసము ప్రాణాయామములతో సమస్త పదార్థముల యందాసక్తి మమకారములను, కోరికలను సమూలముగ నశింప జేసి తమ తపస్సుతో సమస్తేంద్రియములపై సంపూర్ణ విజయమును పొందిన ఋషులలో శరభంగ మహర్షి ఒకరు.

ఇతడు తన తపస్సుతో బ్రహ్మలోకముపై విజయము పొందెను. సాదరముగ బ్రహ్మలోకమునకు తీసికొని వెళ్ళుటకు దేవేంద్రుడు వచ్చెను. ఆకాశమునకు భూమికి మధ్యలో ఆగిన ఇంద్ర రథమును మహర్షి చూచెను. తనను తీసికొని వెళ్ళుటకే వచ్చెనని తెలిసెను. కాని రాజీవలోచనుడు కోసల కిశోర శ్రీరాఘవేంద్రుడు భగవతి శ్రీ సీతతోను, తమ్ముడు లక్ష్మణునితోను కలసి తన ఆశ్రమము వైపు వచ్చుచున్నాడను వార్త వినెను. ''అహో! లౌకిక వైదిక సమస్త ధర్మపాలనము ఏ వాని చరణ కమలములను పొందుట కొరకో అట్టి భగవానుడు స్వయముగ నా ఆశ్రమము వైపు వచ్చుచున్నాడు. ఇప్పుడు ఇది వదలుకొని నేను బ్రహ్మలోకమునకు వెళ్ళుట సర్వదా మూర్ఖత్వమగును. బ్రహ్మలోకమునకు ప్రధానుడైన దేవుడు నా దగ్గరకు ఇచటికి వచ్చుచున్నాడు గనుక నేనచటికి వెళ్ళుట నిష్ప్రయోజనము. తపః ప్రభావముతో అక్షయ లోకములపై పొందిన అధికారమంతయు నేను భగవానుని చరణములకు సమర్పించెదను'' అని ఒక నిశ్చయమునకు వచ్చి ఇంద్రునకు రానని చెప్పి పంపి వేసెను.

శ్రీరాముని దర్శించి వాని ఎదుటనే ప్రాణ త్యాగము చేయుటకు నిర్ణయించు కొనెను. క్షణమొక యుగముగ తల పోయుచు రాముని కొరకు ఎదురు చూచు చుండెను.

శ్రీరాముడు సీతా లక్ష్మణ సహితుడై మహర్షి ఆశ్రమమునకు వచ్చెను. శ్రీరాముని దర్శించిన మహర్షి ఆనందమగ్నుడై భగవానుని రూప సుధా మకరందమును నేత్రములతో గ్రోలుచుండెను. భాగవానుని తన అంతఃకరణములో కూర్చుండబెట్టుకొని శరభంగ ముని యోగాగ్నితో శరీరమును భస్మముగావించుకొనెను.

తన నశ్వర శరీరమును నశింపజేసి అగ్ని సమానమైన తేజోమయ శరీరముతో ఉత్పన్నుడయ్యెను. పరమ తేజోమయ కుమార రూపముతో దేవలోకములను దాటి దివ్య ధామమునకు వెళ్ళిపోయెను.



## అనసూయాత్రి మహర్షుల శ్రీరామ భక్తి

పరమ తపస్వి అయిన అత్రి మహర్షి బ్రహ్మ మానస పుత్రుడు, ప్రజాపతి. ఇతడు దక్షిణ దిశా నివాసుడు. పరమ పతివ్రత అనసూయ వీనిపత్ని. అనసూయ స్వాయంభువమను పుత్రిక అయిన దేవహూతి కుతూరు. కపిల భగవానుని చెల్లెలు. కర్దమ మహర్షి ఈమె తండ్రి. రాగ ద్వేషములు లేని పరమ భగవద్భక్తుడు అత్రి మహర్షి. పరమభక్తురాలు, అసూయ లేనిది అనసూయ.

బ్రహ్మ వీరిని సృష్టి గావించమని ఆజ్ఞాపించెను. కాని వీరు ముందుగా తపస్సు చేయుటకు నిర్ణయించుకొనిరి. కఠోరమైన తపస్సు చేయసాగిరి. వీరి తపస్సు యొక్క ఉద్దేశ్యము అఖిల సృష్టికర్త పరమ ప్రభుని దర్శించ వలెననియే. దీర్ఘకాల కఠోర తపస్సు చేయు నప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమై వరమడుగుడనిరి

దంపతులు చేతులు జోడించి వినయముగ ''మా మనస్సు లందు లౌకిక వాంఛలు లేవు. కాని విధాత సృష్టి గావింపుమని ఆజ్ఞాపించెను. అందువలన మీరు ముగ్గురు పుత్ర రూపములలో ఇచట అవతరింపుడు'' అని కోరుకొనిరి.

త్రిమూర్తులు ''తథాస్తు'' అని పలికి అంతర్ధానమైరి. కొంత సేపటికి వారు శ్రీ విష్ణు అంశతో దత్తాత్రేయుడుగను, బ్రహ్మ అంశతో చంద్రుడుగను, శంకరుని అంశతో దుర్వాసుడుగను అవతరించిరి.

త్రిమూర్తులు పరమ భక్తులైన ఆ దంపతుల ఒడి యందు ఆటలాడు చుండిరి. అనసూయ నిరంతరము బాలల సంరక్షణ లోనే గడుపు చుండెను.

శ్రీరామ భగవానుడు అత్రి అనసూయల శ్రద్ధా భక్తుల నెఱిగి సీతా లక్ష్మణ సహితుడై వీరి ఆశ్రమమునకు వచ్చెను.

సీతా రామ లక్ష్మణులు తమ ఆశ్రమమునకు వచ్చిరను సమాచారము వినిన మహర్షి పులకితుడై మునిజన వందితుడగు శ్రీరాముని చూచుటకు పరుగులు తీసెను. (మానస)

గత్వా ముని ముపాసీనం భాసయన్తం తపో వనమ్ ।
దండవత్ ప్రణి పత్యాహ రామో ఽ హమభివాదయే ॥
పితు రాజ్ఞాం పురస్కృత్య దండ కావన మాగతః ।
వన వాస మిషేణాపి ధన్యో ఽ హం దర్శ నాత్తవ ॥

సమస్త తపోవనమును ప్రకాశింపజేయు మునీశ్వరుని చెంతకు రాముడు వెళ్ళి ప్రణామము గావించి ''నేను రాముడను. మీకు అభివాదనము చేయుచున్నాను. నేను తండ్రి ఆజ్ఞానుసారము దండకారణ్యమునకు వచ్చితిని. వనవాస సమయములో మిమ్ములను దర్శించి కృతార్థుడనైతిని'' అనెను.

వందనము చేయుచున్న శ్రీరాముని వెను వెంటనే మహర్షి లేవనెత్తి హృదయమునకు హత్తుకొనెను. మహర్షి నేత్రముల నుండి ప్రేమాశ్రువులు స్రవించుచుండెను. శ్రీరాముని అలౌకిక సౌందర్యమును గాంచిన ముని నేత్రములు శీతలములయ్యెను. అత్రి ఆదరముగ శ్రీరాముని తన ఆశ్రమములోనికి తీసికొని వెళ్ళెను.
(అధ్యాత్మ రామాయణము)

అనంతరము సీతా రామ లక్ష్మణులను పవిత్రాసనములపై కూర్చుండ బెట్టి విధి పూర్వకముగ పూజించి, నవఫలములతో వారికి అతిథి సత్కారముల గావించెను. ఆసనముపై ఆసీనుడైన కమలదళ లోచనుని మహర్షి తనవితీర దర్శించి కృతార్థుడయ్యెను.
(మానస)

దేవకార్య నిమిత్తం చ యయా సం త్వరమాణయా ।
దశ రాత్రం కృతా రాత్రిః సేయం మాతేవ తే ఽ నఘ ॥
తామిమాం సర్వ భూతానాం నమస్కార్యాం తపస్వినీమ్।
అభిగచ్ఛతు వైదేహీ వృద్ధామ క్రోధనాం సదా ॥

(వాల్మీకి రామాయణము)

''శ్రీరామా! ఈమె దేవకార్య నిమిత్తము పది రాత్రులను ఒకే రాత్రిగ చేసినట్టి అనసూయాదేవి. మీకు తల్లి వలె పూజనీయురాలు. సర్వప్రాణులు నమస్కరింపదగిన తపస్విని. క్రోధ మెరుగనిది. విదేహ నందిని సీతను వృద్ధురాలైన అనసూయ చెంతకు పంపుము'' అని మహర్షి చెప్పెను.

శ్రీరాముని ఆదేశమును పొందిన సీతాదేవి అనసూయను సమీపించి ఆమె చరణములపై బడెను. తన పాదములపై బడిన సీతను గాంచి అనసూయా దేవి హర్షముతో ''బిడ్డా! సీతా''! అనుచు ఆదరముతో ఆలింగనము చేసికొని విశ్వకర్మ నిర్మించిన రెండు పట్టు చీరలును, దివ్యాంగ రాగమును నొసగి ''కమల ముఖీ! ఈ అంగరాగమును ధరించిన నీ శరీర శోభ ఎన్నిటికిని తరుగదు'' అని చెప్పెను. అనంతరము అనసూయ సీతకు పతివ్రతా ధర్మములను చక్కగ ఉపదేశించెను. ''రఘునాథునితో కలసి సుఖముగ తిరిగి నీ గృహమున కేగుదువు'' అని అనసూయ ఆశీర్వదించగా సీత ప్రసన్నురా లయ్యెను.

అనసూయ రామునితో ''రామా! మీరు సమస్త భువనముల సృష్టి కర్తలు. ప్రపంచమును మోహింప జేయు మాయ కూడ సదా మీకు భయపడుచుండును'' అని కొనియాడెను.

శ్రీసీతారామలక్ష్మణులు ఆ రోజు అత్రి మహర్షి ఆశ్రమమందు విశ్రమించి రెండవ రోజు అత్రి మహర్షితో ''మునీశ్వరా! మేము ఋషులు, మునులతో నిండిన దండ కారణ్యమునకు వెళ్ళవలెనని కోరుకొనుచుంటిమి. మాకు మార్గము చూపుటకు మీ శిష్యులను మా వెంట పంపుడు'' అని శ్రీరాముడు కోరగా అత్రి ముని నవ్వుచు ''రామా! దేవతాశ్రయ స్వరూపా! సర్వులకు మార్గదర్శకుడవు నీవై యుండగా నీకు మార్గదర్శకులు ఎవరు? కాని ఇప్పుడు మీరు లోకవ్యవహారమును అనుసరించుచున్నారు

గాన శిష్య గణమును మీకు మార్గము చూపుటకు పంపుదును''
అని చెప్పెను.

భక్త వాంఛాకల్ప తరువగు శ్రీరామ ప్రభువు అత్రి మహర్షి చరణములపై శిరస్సు నుంచి దండ కారణ్యమునకు ప్రయాణ మయ్యెను. మహర్షి నిలువబడి అశ్రుపూరిత నయనములతో చూడసాగెను. శ్రీరాముని ప్రేమను పొందగలిగిన అనసూయాత్రి మహర్షులు ధన్యులు, వందనీయులు.



# దశరథ మహారాజు వాత్సల్య భక్తి

శ్రీరామ చంద్రుడు ప్రేమవశుడై దశరథ మహారాజునకు పుత్రుడుగా అవతరించెను. దశరథ మహారాజు మనువు నవతారము. ఇతడు శ్రీరామ భగవానుని పుత్రునిగా పొంది ఆనందిచుటకుగాను భూతలముపై జన్మించి రాముని వియోగము భరించలేక ప్రాణము వదలి ఆదర్శ ప్రేమను స్థాపించెను.

దశరథ మహారాజు పరమ తేజస్వి . మను మహారాజువలె ప్రజలను రక్షించినవాడు. ఇతడు వేదములు తెలిసిన వాడు, గొప్ప సేనకు ప్రభువు, ప్రజా రక్షకుడు, దూరదర్శి, దేశవాసులకు ప్రియుడు, మహాయజ్ఞములు చేసిన వాడు, ధర్మ ప్రియుడు, మహర్షుల వలె సద్గుణములు గలవాడు, రాజర్షి, త్రిలోక ప్రసిద్ధుడు, పరాక్రమ వంతుడు, శత్రు నాశకుడు, ఉత్తమమైన మిత్రులు గలవాడు, జితేంద్రియుడు, సంపదలలో కుబేరుని అంతటివాడు, ఇంద్రునితో సమానుడు, సత్య ప్రతిజ్ఞాపాలకుడు, ధర్మార్థ కామములను శాస్త్రాను సారముగ పాలించువాడు.

దశరథుని మంత్రి మండలి యందు వసిష్ఠ మహాముని, వామదేవుడు, సుయజ్ఞుడు, జాబాలి, కాశ్యపుడు, గౌతముడు, మార్కండేయుడు, కాత్యాయనుడు, దృష్టి, జయంతుడు, విజయుడు,సురాష్ట్రుడు, రాష్ట్ర వర్ధనుడు, అకోపుడు, ధర్మపాలుడు మున్నగువారు విద్యా వినయ సంపన్నులు, శ్రీ సంపన్నులు, పవిత్ర హృదయము గలవారు, శాస్త్రజ్ఞులు, శస్త్రజ్ఞులు, ప్రతాపవంతులు, రాజనీతి విశారదులు, సావధానులు, రాజాజ్ఞను అనుసరించువారు, తేజస్వులైన క్షమాశాలురు, నగుమోము గలవారు, కామ క్రోధ లోభరహితులు, సత్యవాదులైన పురుష ప్రవరులునై యుండిరి.

ఆదర్శవంతుడైన రాజు, మంత్రి మండలితో ప్రజలు సుఖ సంపన్నులై యుండిరి. దశరథుని సహాయము దేవతలు కూడ కోరుచుండిరి. ఇతడు అనేక యజ్ఞములు చేసెను. చివరి సారి జననీ జనకుల భక్తుడైన శ్రవణ కుమారుని వధించిన పాపమునకు ప్రాయశ్చిత్తముగా అశ్వమేధము, జ్యోతిష్టోమము, ఆయుష్టోమము, అతిరాత్రము, అభిజిత్, విశ్వజిత్, ఆప్తోర్యామాది యజ్ఞములు గావించెను. ఈ యజ్ఞము లందు ఇతర వస్తువులు గాక పది లక్షల పాడి యావులను, పది కోట్ల సువర్ణ ముహరీలను, నలుబది కోట్ల వెండి రూపాయలను దానమిచ్చెను. దీని తరువాత పుత్రప్రాప్తికి ఋష్యశృంగుని ఋత్విజునిగ నియమించి దశరథుడు పుత్రేష్టి యజ్ఞమును చేసెను. ఈ యజ్ఞ మందు సమస్త దేవతలు తమ తమ భాగమును గ్రహించుటకు స్వయముగ వచ్చిరి. దేవతలు, మునులు, ఋషులు ప్రార్థించగా భగవానుడు దశరథుని పుత్రునిగా అవతరించుటకు ఆమోదించెను. యజ్ఞ పురుషుడు స్వయముగ ప్రత్యక్షమై పాయసముతో నిండిన సువర్ణ పాత్రను దశరథునికిచ్చి ''రాజా ! ఈ పాయసము దేవతలచే తయారు చేయబడినది. ఇది సంతాన ప్రాప్తిని గలిగించును. ధనవృద్ధిని, ఆరోగ్య వృద్ధినిని గూడ గలిగించును. దీనిని నీ రాణులకు ఇమ్మ''నెను.

రాజు ప్రసన్నుడై మర్యాదానుసారము కౌసల్య ధర్మపత్ని గనుక బంగారు పాత్రలోని పాయసమును సగము చేసి కౌసల్యకు ఇచ్చెను. మిగిలిన సగ భాగమును రెండు భాగములుగ జేసి ఒక భాగమును సుమిత్రకు ఇచ్చెను. మిగిలిన ఒక భాగమును రెండు భాగములుగ జేసి ఒక భాగము కైకకు ఇచ్చెను. మిగిలిన ఆ అర్ధ భాగమును రాజు ఆలోచించి సుమిత్ర మధ్య భార్య కావున ఆమెను ఆనంద పరచుటకు మఱల సుమిత్రకు ఇచ్చెను. ఈ విధముగ రాజు పాయసమును ముగ్గురు భార్యలకు పంచి పెట్టెను.

కౌసల్యకు 12వ మాసమున చైత్ర శుక్ల పక్షమున నవమి తిథి పునర్వసు నక్షత్రము కర్కాటక లగ్న మందు శ్రీరాముడు జన్మించెను.

అనంతరము కైకకు పుష్య నక్షత్రము మీన లగ్న మందు భరతుడు జన్మించెను.

ఆ తరువాత సుమిత్రకు ఆశ్లేషా నక్షత్రము కర్కా లగ్న మందు రెండు భాగములు గ్రహించిన కారణమున లక్ష్మణ, శత్రుఘ్నులు జన్మించిరి.

ఈ విధముగ భగవానుడు నాలుగు రూపములతో అవతరించెను.

రాజునకు ఈ నలుగురు పుత్రులు పరమ ప్రియులైనను శ్రీరాముని యందు విశేషమైన ప్రేమ గలదు. శ్రీరాముని కొరకే కొన్ని వేల సంవత్సరములు నిరీక్షించిన వాడు కావున, ఒక్క క్షణము కూడ శ్రీరాముని చూడకుండ నుండగలిగెడి వాడు కాదు.

విశ్వామిత్రుడు యజ్ఞ రక్షార్థము శ్రీరాముని పంపుమని అడుగుటకు వచ్చినప్పుడు రాముని వయస్సు 15 సంవత్సరములు పూర్తి అయి యుండెను. దశరథుడు రాముని పంపుటకు ఆమోదించ లేదు. వసిష్ఠులు నచ్చ జెప్పిన తరువాత ఆమోదించెను. ''శ్రీరాముడు నా ఎదుట ఉన్నంత వరకే నా ప్రాణములు నిలచి యుండును'' అనెను. తన వచనము సత్యము చేయుటకే రామ ప్రేమానల మందు తన ప్రాణము ఆహుతి ఇచ్చెను.

భగవానుడు కైక మతిని మార్చి అనేకములగు పనులు చేయించెను. జగత్తులో ఆదర్శ మర్యాదను స్థాపించుటకే భగవానుడు అవతరించెను. ముఖ్యమైన ఆదర్శములు :-

1. దశరథుని సత్య రక్షణ - శ్రీరాముని ప్రేమ.

2. వనవాసము చేయుచు రాక్షసులను వధించి దుష్ట సంహారము చేయుట.
3. శ్రీ భరతుని త్యాగము - ఆదర్శమైన సోదర ప్రేమ.
4. శ్రీ లక్ష్మణుని బ్రహ్మ చర్యము-సేవాభావము-రామ పరాయణత - త్యాగము.
5. శ్రీ సీతా దేవి ఆదర్శ పవిత్ర పాతివ్రత్య ధర్మము.
6. శ్రీ కౌసల్యా పుత్ర ప్రేమ - కోడలిపై ప్రేమ - పాతివ్రత్యము - ధర్మ ప్రేమ - రాజనీతి - కుశలత.
7. సుమిత్రకు శ్రీరాముని యందు ప్రేమ - త్యాగము - రాజనీతి కుశలత.
8. కైకేయి దుష్ట బుద్ధి - తిరస్కరింపబడియు రాముని ఎడల కఠినత్వము.
9. హనుమానుని నిష్కామ ప్రేమ భక్తి.
10. విభీషణుని శరణాగతి - అభయ ప్రాప్తి.
11. సుగ్రీవునితో రామునికి ఆదర్శ స్నేహము.
12. రావణాదుల వినాశము - అంతమున ఉద్ధరించుట.

శ్రీరామునకు వనవాసము లేకున్న ఇవి కష్టమయ్యెడివి. ఇవి అన్నియు ఆదర్శ మర్యాదలు, అనుకరణీయములు. దశరథుని వంటి భాగ్యవంతులు ఎవరుందురు ? శ్రీరాముని దర్శించవలెనను కోరికతో రాముని కొరకు రామ-రామ-రామ అనుచు ప్రాణ త్యాగము చేసెను. లంకా విజయానంతరము దశరథుడు శ్రీరాముని దర్శించెను. దశరథుడు శ్రీరాముని సమీపించి శ్రీరాముని ఆలింగనము చేసికొని ప్రేమాలాపనలు కావించెను. తరువాత లక్ష్మణునితో ''సుమిత్రా సుఖవర్ధన లక్ష్మణా ! నీవు నిరంతరము శ్రీరాముని సేవ యందే యుండవలెను. దీని వలన

నీకు గొప్ప శుభము గలుగు'' నని ఉపదేశించెను. ఆ తరువాత సీతతో కూడ మాటాడెను. త్రిలోక వాసులు, సిద్ధపురుషులు, మహర్షులు, మునులు పురుషోత్తముడైన శ్రీరామునికి అభివందనములు చేసి పూజించిరి.

ఎవరిని వేదములలో అవ్యక్త అక్షర బ్రహ్మయని, దేవతల హృదయమని, గుప్త తత్త్వమని చెప్పుచున్నారో ఆ పరమ తపస్వి రాముడితడే.



# కౌసల్యా భక్తి హృదయము

రామాయణ మందు మహారాణి కౌసల్య చరిత్ర ఎంతయు నుదారమైనది, ఆదర్శమైనది. ప్రాచీన కాలమందు మను-శత రూపలు తప మొనరించి శ్రీరాముని పుత్రునిగా పొందు వరము పొందిరి. ఆ మను శతరూపలే దశరథ - కౌసల్యలు. శ్రీరామ భగవానుడు పుత్రుడుగా వీరి గృహ మందు అవతరించెను.

శ్రీరామునికి రాజ్యాభిషేకము చేయవలెనని నిర్ణయించి నప్పుడు కౌసల్య ఆనందమునకు అవధి లేదు. ఈమె శ్రీరామునికి శుభము జరుగవలెనను కోరికతో అనేక యజ్ఞములు, దానములు, దైవ పూజలు చేయుచు ఉపవాస వ్రతమందు నిమగ్నమై యుండెను.

## దర్మము కొరకు త్యాగము

శ్రీరాముడు వనవాసమున కేగవలెనని నిశ్చయించి నప్పుడు తల్లి ఆజ్ఞను తీసికొనుటకు కౌసల్యా భవనమునకు వచ్చెను. శ్రీరామ చంద్రుడు తల్లిని సమీపించెను. రాముని చూడగానే వెంటనే లేచి పుత్రుని ఆలింగనము చేసికొని శిరస్సు నిమిరెను. కౌసల్య నేత్రముల నుండి ప్రేమాశ్రువులు స్రవించు చుండెను. రాముడు ఉపవాస దీక్షలో నున్నది కౌసల్యకు గుర్తు వచ్చెను. ముహూర్తము సమీపించుటకు ఇంకను ఆలస్యముండెను. అంత వరకు నా రాముడు ఆకలితో ఎట్లుండును ? అని తలచి యేదైన మిఠాయిగాని నాలుగు పండ్లుగాని తినిపించిన బాగుండునని భావించును. రాముడు వేరే పని మీద వచ్చెనని ఆమెకు తెలియదు.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

అప్పుడు రాముడు తల్లితో ''అమ్మా! తండ్రిగారు నాకు వన రాజ్యము ఇచ్చెను. అచట నాకు అన్ని విధముల శుభము జరుగును. నీవు ప్రసన్నురాలవై నేను వనవాసము చేయుటకు అనుజ్ఞ నిమ్మ. పదు నాలుగు సంవత్సరములు వన మందు నివసించి పితృ వాక్యము సత్యము గావించి తిరిగి వచ్చి నీ చరణములు దర్శించెదను. అమ్మా! నీవు దుఃఖించకుము'' అనెను.

రాముని వచనములు కౌసల్య హృదయ మందు శూలములు గ్రుచ్చినట్లయ్యెను. ఎక్కడి సామ్రాజ్య సింహాసనము! ఎక్కడి వనవాసము! కౌసల్య మాటాడ లేకపోయెను. మూర్ఛితురాలయి క్రింద పడెను. కొంత సేపటికి తేరుకొని పలు విధముల విలపించి తండ్రి ప్రేమ కంటె తల్లి ప్రేమే గొప్పది. మహారాజు వనవాసము చేయుమనినను నేను వెళ్ళనివ్వను అని అనుకొని ఇది కైకేయి ఆజ్ఞ. ఆపుటకు నాకేమి అధికారమున్నది? ఎందుకనిన కన్న తల్లి కంటె సవతి తల్లి అధికారము ఎక్కువగా నుండును. నేను శ్రీరాముని బలవంతముగ వెళ్ళ నివ్వకున్న, ధర్మము వెళ్ళిపోవును. దానితో అన్నదమ్ములకు పరస్పర విరోధము గలుగును, అని ధర్మ పరాయణురాలైన సాధ్వి కౌసల్య హృదయ మును కఠినముగ చేసికొని ''కుమారా! తల్లియు తండ్రియు ఆజ్ఞాపించిరి. నీవును అది ధర్మమని తలచితివి. నేను కూడ ధర్మమునకు హాని గలుగనివ్వను. వెళ్ళి ధర్మమును పాలించు'' మనెను.

## పతివ్రతా ధర్మము

కౌసల్య హృదయ మందు తుఫాను చెలరేగెను. తనను కూడ రాముని వెంట తీసుకొని వెళ్ళమని అనెను. అప్పుడు రాముడు ఇట్లనెను. ''అమ్మా! పతిని పరిత్యజించుట స్త్రీ చేయకూడని

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

క్రూరమైన పని. ఈ ఆలోచనను దూరముగ నుంచుము. నా తండ్రి జీవించి యున్నంత వరకు నీవు ఆయనను సేవించ వలెను. ఇది సనాతన ధర్మము. స్త్రీకి పతియే దైవము, ప్రభువు. మహారాజు మన ఇరువురకు రాజు. భరతుడు కూడ ధర్మాత్ముడు, సదాచారము గలవాడు. అతడు నిన్ను కూడ సేవించును. అమ్మా! నేను వెళ్ళిన తరువాత మహారాజు శోకముతో ప్రాణ త్యాగము చేయకుండ నీవు సర్వదా మహారాజునకు హితవు గలుగు నట్లుగ నుండవలెను. పతికి అనుకూలముగ నుండనిచో అధమగతి ప్రాప్తించును. పతిని సేవించిన స్వర్గ ప్రాప్తి లభించును. ఇది స్త్రీ ధర్మము''.

కౌసల్య పతివ్రతా శిరోమణియే. పుత్ర ప్రేమచే అట్లనెను. కర్తవ్యమును గ్రహించి పుత్రునికి అనుజ్ఞ నిచ్చెను.

సీత శ్రీరాముని వెంట వెళ్ళుటకు సిద్ధపడి నప్పుడు కౌసల్య ఆమెను దగ్గరకు తీసికొని ''పుత్రీ ! కుల మర్యాదను ఎప్పుడు ఉల్లంఘించకుము. పతియే పరమ దైవము. నేడు నా పుత్రుని తండ్రి వనవాసమును చేయ నియమించెను. అతడు ధనవంతుడు గాని, నిర్ధనుడు గాని అతడే నీకు దైవము. అందువలన ఎప్పుడును తిరస్కరించకుము'' అనెను.

సీతాదేవికి పతివ్రతా ధర్మము నుపదేశించుట సూర్యునకు దీపము చూపినట్లుండును. అయినను అత్తగారి మాటలు ధర్మార్థ యుక్తముగ భావించి, చేతులు జోడించి ''అమ్మా ! నేను మీరు ఉపదేశించి నట్లే చేయుదును. ఇట్లే నాకు నా తల్లి దండ్రులు కూడ నుపదేశించిరి. చంద్రుని నుండి వెన్నెల వేరు కాదు. తల్లి తండ్రి సోదరుడు తనయుడు పరిమితమైన సుఖము నిచ్చెదరు. ఇది ఈ లోకములోనే లభించును. కాని పతి మోక్షరూపమైన అపరిమిత సుఖము నిచ్చును. అందువలన పతి సేవయే పరమ ధర్మ''మని పలికెను.

కమలమువలె, నలిగిన కలువవలె, ధూళితో కప్పబడిన బంగారము వలె, మేఘములతో కప్పబడిన చంద్రునివలె నున్న నీ ముఖము చూచినప్పుడు నా హృదయ మందు రగిలిన శోకాగ్ని నన్ను కాల్చుచున్నది'' అని యేడ్చును.

శ్రీరామ భరతుల యందు సమ భావము ప్రజాహితము.

కౌసల్యకు శ్రీరాముని యందును, భరతుని యందును సమానమైన ప్రేమ. అన్ని అనర్థములకు తానే కారణమని విలపించుచున్న భరతుని కౌసల్య హృదయమునకు చేర్చుకొనెను. రాముడు తిరిగి వచ్చెనను భావన కలిగెను.

మహారాజు దహన క్రియా నంతరము వసిష్ఠుడు రాజ్య సింహాసనముపై కూర్చుండుమని కోరినప్పుడు భరతుడు ఒప్పుకొనడు. అప్పుడు కౌసల్య ప్రజల హితము కొరకు భరతునితో ''వత్సా ! ప్రజాభీష్టము ననుసరించి రాజ్యభారము వూను''మని బోధించును. రాముడు అడవికి వెళ్ళు నప్పుడు కౌసల్యాదేవి ''రామునకు రాజ్యమునకు బదులుగా వన రాజ్యము లభించినది. నాదుఃఖమునకు కారణము రాముడు లేనందు వలనగాదు, దశరథ మహారాజునకు భరతునకు ప్రజలకు మిక్కిలి క్లేశము కలుగునని దుఃఖించుచున్నా''నని అనును. ఎంత ఆదర్శమైన పలుకులు !

## పుత్ర ప్రేమ

కౌసల్య పుత్ర వాత్సల్యము ఆదర్శమైనది. ధర్మ రక్షణకు పుత్రుని త్యాగము చేసినది.

వనమునకు వెళ్ళు సమయమున పుత్రునితో ''కుమారా ! సత్పురుషుల మార్గమును అనుసరించుము. నీవు పాలించు ధర్మము నిన్ను రక్షించును'' అని రక్ష కట్టి వనమునకు పంపెను. పుత్ర వియోగ దావానలముతో హృదయము దగ్ధమగుచున్నను

తనయుని త్యజించెను. ఇదియే ఆదర్శమైన ప్రేమ. పదునాలుగు సంవత్సరములు నిరంతర వ్యాకులతతో గడపినది. లంకా విజయానంతరము రాముడు అయోధ్యకు వచ్చుచున్నాడను వార్త విని నప్పుడు ఆవు దూడ కొరకు పరుగిడిన విధముగ పరుగిడెను.

కౌసల్య రాముని హృదయమున చేర్చుకొని తల నిమురుచు ''సుకుమారులైన ఈ బిడ్డలు రామలక్ష్మణులు. రావణుని ఎట్లు జయించ గలిగిరి'' ? అనుకొనును.

త్రిభువనేశ్వరుడు పుత్ర రూపమున లోక కళ్యాణము కొరకు జన్మించె ననునది మరచెనేమో ! కౌసల్య ధర్మ పాలనమునకు ఫలము లభించినది. శ్రీరామునిచే తత్త్వ జ్ఞానము పొంది పరమ పద ప్రాప్తి పొందినది. కౌసల్య ధన్యురాలు.



# సుమిత్రా భక్తి హృదయము

దశరథుని భార్యలు 360 అని చెప్పబడినది. ఎందరున్నను అందరిలో మహారాణి కౌసల్య పట్ట మహిషి. మహారాజునకు కైకపై అధికమైన ప్రేమ. మిగిలిన వారిలో సుమిత్ర కూడ ప్రధానురాలే. మహారాజు కైక భవన మందే యుండెడి వాడు. సుమిత్ర కౌసల్య చెంత నుండెడిది. రామ లక్ష్మణ భరత శతుఘ్నులు నలుగురు సుమిత్ర ఒడిలోనే నిదురించెడివారు. లాలన పాలన అన్నియు సుమిత్రయే చూచెడిది. రాత్రులు నిదుర మేల్కొని యేడ్పు చుండగా కౌసల్య రాముని ఎత్తుకొని సుమిత్ర చెంతకేగి ''సుమిత్రా! రాముని తీసికొమ్ము. నీ చెంత తప్ప నిదురించడు. చూడుము ఏడ్చి యేడ్చి కనులు ఎంత ఎరుపెక్కినవో!'' అని వదలి పెట్టును. రాముడు సుమిత్ర ఎత్తుకొనగనే యేడుపు మానెడి వాడు.

రాముడు పెద్దవాడు అయిన తరువాత కూడ నిదుర లేవగానే తండ్రికి తల్లులకు ప్రణామములు చేయువాడు. సర్వ కార్యములు సుమిత్రయే నిర్వహించెడిది. అందుకని రాముడు ఎక్కువగా ''సుమిత్రా మాత ఎక్కడ'' అని అడిగెడి వాడు. లక్ష్మణుడు రాముని వెంట అడవికి వెళ్ళు సమయమున సుమిత్ర లక్ష్మణునితో ''కుమారా ! ఇంక నీకు తల్లి వైదేహి, తండ్రి రాముడు. ఎక్కడ రాముడు నివసించిన అదియే అయోధ్య. వారి పాద సేవయే నీకు పరమావధి'' అని పలు విధముల ఆజ్ఞాపించి ఆశీర్వదించెను.

భరతుడు రాముని దగ్గరకు చిత్రకూటమునకు వెళ్ళినప్పుడు తల్లులందరు, సీత తల్లి జనకుని భార్య సునయన అందరు కలిసిరి. సునయనకు కైకపై చాల కోపము వచ్చెను. కౌసల్య ఎంత నచ్చ జెప్పినను ఆమె కోపము చల్లారలేదు. అప్పుడు సుమిత్ర ''దేవీ ! కైక శిక్షను అనుభవించు చున్నది'' అని చెప్పి శాంతింప జేసినది.

మరొక మారు లంకలో యుద్ధము జరుగుచున్న సమయమున లక్ష్మణుడు రణ భూమి యందు మూర్ఛపోగా,

హనుమానుడు సంజీవినీ పర్వతమును ఎత్తుకొని వచ్చుచుండెను. అప్పుడు భరతుడు శత్రువేమో అనుకొని బాణముతో కొట్టగా హనుమానుడు క్రిందపడి విషయమును తెలిపెను.. అప్పుడు సుమిత్ర ''నా పుత్రుడు లక్ష్మణుడు శ్రీరాముని కొరకు రాముని ఎదుటనే యుద్ధము చేయుచు పడిపోయినాడా! ఆహా! నేను ధన్యురాల నయితిని'' అని ఆనంద పరవశురాలయ్యెను. మరుక్షణముననే ''అయ్యో! శ్రీరాముడు శత్రువుల మధ్యలో ఒంటరిగా పోరాడు చున్నాడు గాబోలు'' అని తలచి దుఃఖించెను. శత్రుఘ్నుని కూడ లంకకు పంపవలెనని నిర్ణయించు కొనెను. అప్పుడు వసిష్ఠ మహర్షి వద్దని చెప్పగా ఊరుకొనెను. ఇంతటి ఆదర్శ హృదయము గల సుమిత్ర ధన్యురాలు.



# కైకేయీ భక్తి హృదయము

కైక సరళ స్వభావము గలది, బుద్ధిమతి, వీరనారి. ఒకసారి దశరథుడు శంబరాసురునితో యుద్ధము సలుపుచుండగా రథ చక్రపు ఇరుసు విరిగిపోయెను. అప్పుడు ఆ స్థానములో కైక తన చేయి పెట్టి కాపాడెను. మరొక మారు సారథి హతుడు కాగా తానే సారథ్యము చేసి భర్తను కాపాడెను. దశరథుడు కైక నా వెంట లేకున్న నేను నిశ్చయముగ మరణించెడి వాడను అని అనుకొని కైకను రెండు వరాలు కోరుకొనుమని అనెను. కైక వద్దని అనెను. కాని రాజు బలవంతము చేయగా మరెప్పుడైన వానిని అడుగుదునని అనెను.

దశరథుడు కైకను పరిణయమాడు సమయమున కైక తండ్రి కేకయ నరేశునకు కైక కొడుకే రాజ్యమునకు ఉత్తరాధికారి కాగలడని అనెను. ఈ విషయము కైకకు కూడ తెలియును. కాని దశరథుడు తన వంశమునకు ప్రథముడైన కారణమునను, శ్రీరాముని యందు అధికానురాగము చేతను శ్రీరాముని రాజును చేయవలె అని నిశ్చయించుకొనెను.

మంథర ఈ విషయం కైకకు చెప్పినప్పుడు రఘువంశ మర్యాద తెలియుట చేతను శ్రీరాముని యందు ప్రేమ చేతను అత్యంతానంద భరితురాలయి దాసీకి కానుకలు ఇచ్చెను. ''మంథరా! ఎంత మంచి వార్త చెప్పితివి. నాకు రాముడు భరతుడు ఇద్దరు ఒకటే. ఇంత మంచి వార్త చెప్పినందుకు నీకేదైన వరము ఇత్తును కోరుకొనుము'' అని అనెను.

మంధర కైక ఇచ్చిన కానుకలు విసరి కొట్టి కైకకు దుర్బోధ చేసెను. దేవకార్యము నెరవేరుటకు, దుష్టసంహారము జరుగుటకు దేవతలు సరస్వతీ దేవిని అయోధ్యాపురమునకు వెళ్ళి శ్రీరాము పట్టాభిషేకమునకు విఘ్నము కలిగించు మని కోరిరి. మొదట మంధరలో ప్రవేశించి ఆ తరువాత కైకలో ప్రవేశించి పట్టాభిషేక విఘ్నము గావించి ఆ తరువాత స్వర్గ లోకమునకు తిరిగి రమ్ము అని పంపిరి.

ఈ పథకము ప్రకారము కైక దశరథుని భరతుని రాజును చేయుమనియు 14 సం॥లు రాముని అరణ్యవాసము పంపుమనియు రెండు వరములు కోరెను.

భరతుడు చిత్రకూటమునకు వెళ్ళు సమయమున భరద్వాజ మునిని కలిసెను. అప్పుడు ముని ''భరతా ! నీవు కైకను ద్వేష దృష్టితో చూడకు. శ్రీరాముని వనవాసము దైవ నిర్ణయముతో జరిగినది. ఇది జగత్కల్యాణము కొరకుగాన ఆమెను ద్వేషించకుము'' అని చెప్పెను.

భరతుడు రాముని రాజ్యము స్వీకరించుమని అనేక విధముల ప్రాధేయ పడు సమయమున వసిష్ఠుల వారు భరతుని ఏకాంత స్థలమునకు తీసికొని వెళ్ళి ''భరతా! ఒక రహస్యము చెప్పుచున్నాను వినుము. శ్రీరామ భగవానుడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడు. బ్రహ్మాది దేవతలు ప్రార్థించగా రావణ సంహారమునకై దశరథునకు పుత్ర రూపమున జన్మించెను. యోగమాయయే జనక నందిని సీత. ఆది శేషుడు లక్ష్మణుడుగా జన్మించి రాముని అనుసరించి వచ్చెను. రావణ సంహారము జరుగుచున్నది. కావున రాముని వనవాసమునకు వెళ్ళనిమ్ము. కైక వరములు కోరుట, నిష్ఠురముగ

భాషించుట, తదితరములన్నియు దేవతల ప్రేరణతో జరిగినవియే. కావున నీవు రాముని తిరిగి రమ్మని కోరకుము'' అని చెప్పెను.

భరతుడు పాదుకలు తీసికొని వచ్చు సమయములో కైక శ్రీరామునితో ఏకాంతముగ సంభాషించును. నేత్రముల వెంట అశ్రుధారలు కురియు చుండగా రామునితో ''రామా ! మాయచే మోహితనగు నేను గొప్ప అనుచిత కార్యము చేసితిని. అందుకు నన్ను క్షమింపుము. సాధు జనులు సర్వదా క్షమా శీలురైయుందురు. దైవ కార్యము నెరవేర్చ వలెనను దృష్టితోనే నీవే నా చేత ఈ పని చేయించితివి. ఇప్పుడు నిన్ను గుర్తించితిని. నీవే దేవతలకు దేవతవు. విశ్వేశ్వరా ! అనంతా ! నన్ను రక్షింపుము . జగన్నాథా ! మీకు నమస్కారము. ప్రభూ ! మీరే నాకు శరణు. మీరు మీ జ్ఞానాగ్ని రూప ఖడ్గముతో నా పుత్ర, ధనాది స్నేహ బంధములను ఖండింపుడు'' అని ప్రార్థించెను.

అప్పుడు శ్రీరాముడు నవ్వుచు ''మహాభాగినీ ! నీవు చెప్పిన దంతయు నిజమే. నా ప్రేరణ చేతనే దైవ కార్య సిద్ధి కొరకు నీవు అట్లు మాటాడితివి. ఇందులో నీ దోషమేమియు లేదు. ఇంక నీవు వెళ్ళుము. అహర్నిశలు హృదయ మందు నన్ను స్మరింపుము. నా భక్తి చేత శీఘ్రముగ ముక్తి పొందెదవు. నేను సర్వ దర్శకుడను. నాకు అప్రియమైనది, ప్రియమైనది ఏది లేదు. నాకు ఎవరి యందును రాగద్వేషము లుండవు. ఎవరు నన్ను ఎట్లు స్మరించెదరో నేను గూడ అట్లే వారిని ధ్యానించెదను. మాతా ! నా మాయచే మోహితులైన జనులు నన్ను సాధారణ మనుష్యుడను కొనుచున్నారు. వారు నా వాస్తవ స్వరూపమును ఎరుగరు. నీవు గొప్ప భాగ్యవంతు రాలవు. నీలో సంసార బంధనము తొలగి తత్త్వజ్ఞానము పుట్టెను.

నీవు నన్ను స్మరించుచు గృహమందే యుండుము. ఇంక నిన్ను కర్మ బంధనములు బాధించవు'' అనెను.

శ్రీరాముని మాటల వలనకైక నిర్దోషి అని వెల్లడి అయినది రామ కార్య నిమిత్తము అపకీర్తిని స్వీకరించినది. అనన్య శ్రీరామ భక్తుడైన భరతుని తల్లి తిరస్కార యోగ్యురాలు కాదు. సదా పూజనీయురాలే.

(వాల్మీకి రామాయణము - అధ్యాత్మ రామాయణము - రామచరిత మానసము)

# సీతా లోకానుగ్రహము

ఒకసారి సీతా మాత మనస్సులో అయోధ్యా వీధులను చూడ వలెనను కోరిక గలిగినది. శ్రీరామునకు తన కోరికను తెలిపెను. త్రికాల దర్శియగు శ్రీరాముడు, సీత మనస్సున ఉదయించిన ఈ కోరిక ప్రజాహితము కొరకే అని గ్రహించెను.

శ్రీరాముడు చిరునవ్వుతో సీతాదేవిని ఎత్తయిన ఒక భవనముపైకి తీసికొని వెళ్ళెను. అచట నుండి అయోధ్యా వీధులన్నియు చక్కగా కనిపించు చుండెను. ఒక గవాక్షము చెంత రత్న సింహాసనముపై సీతా రాములు కూర్చొని అయోధ్యా నగర రమణీయ దృశ్యములను తిలకించుచుండిరి. జన సముదాయము అటునిటు తిరుగుచుండిరి. శ్రీరాముడు అయోధ్యా రాజ మార్గములను వ్రేలుతో చూపుచు సీతకు చెప్పుచుండెను. దాని కంటె ముందు సీత దృష్టి కృశించి దీనావస్థలో నున్న ఒక బ్రహ్మణ స్త్రీపై పడెను. ఆమె ఒడి యందు ఒక బాలుడుండెను. మలినమైన చినిగిన వస్త్రముతో శరీరము కప్పుకొనుచుండెను. ఆమె భోజనము చేసి ఎన్నో రోజులైనట్లుండెను. భిక్షాటనకు వీధిలోకి వచ్చినట్లుండెను. ఆమెను గాంచిన కరుణామయియగు సీతా మాతకు దుఃఖము కలిగెను. [illegible] వెంటనే ఒక సేవకు రాలిని పిలచి ఆమెను తన వద్దకు తీసికొని రమ్మని ఆదేశించెను.

సీత ఆమెను సత్కరించి ఆసనముపై కూర్చుండ బెట్టి ''అమ్మా ! నీవు ఎవరవు ? ఒడలిపై నగలు లేకపోగా వస్త్రము కూడ చాలినంత లేక ఎందు కొరకు వీధిలో తిరుగుచుంటివి ?'' అని ప్రశ్నించెను.

ఆ బ్రాహ్మణి ''దేవీ నే నభాగ్యురాలనైన ఒక బ్రాహ్మణ పత్నిని. నాకు ఎవ్వరును లేరు. నా పతి తీర్థ యాత్రల కని వెళ్ళి చాల కాలమైనది. ఇంత వరకు రాలేదు. జనులు అతడు మరణించి యుండ వచ్చునని అనుచున్నారు. నా తండ్రి చెంత కేగవలెనను కొంటిని. కాని కొంత కాలము క్రింద అతడును దేహము చాలించెను. మరి ఇంక ఎక్కడికి వెళ్ళ గలను ? ఈ బిడ్డను పోషించు వారు ఎవ్వరు ? నగల మాట అటుండ నిండు, దేహముపై వస్త్రము కూడ లేదే ? మరి భోజనమెట్లు దొరుకును ? అందు చేత భిక్షాటన చేసి ఈ బాలునికి పెట్టి మిగిలిన దానితో నా పొట్ట నింపుకొను చుంటిని'' అని చెప్పుచు రోదించ సాగెను.

ఆమె గాథను వినుచున్న సీతా మాత నేత్రములు అశ్రు పూరితము లయ్యెను. చెంత కూర్చున్న శ్రీరాముడు అంతయు వినుచుండెను. సీత ఒక్కసారి రాముని వైపు చూచెను. మౌనము గానే రాముని అనుమతి పొందిన సీత వెను వెంటనే తన వస్త్ర భూషణములను తీసి విప్ర పత్నికి నొసగి ''దేవీ ! నీవు ఇప్పుడు లక్ష్మణుని చెంత కేగుము. నా ఆజ్ఞాను సారము అతడు నీకు ఒక లక్ష స్వర్ణ ముద్రికలను ఇచ్చును. వానిని గ్రహించి సుఖముగ నుండుము'' అని చెప్పెను.

బ్రాహ్మణి సీతా మాత చరణములపై బడెను. ఆమె దయను తలపోయుచు లక్ష్మణుని చెంతకేగి అమ్మ ఆదేశము విన్నవించెను. లక్ష్మణుడు ఆదరముతో లక్ష స్వర్ణ ముద్రికల నొసగెను. ఆ బ్రాహ్మణ స్త్రీ అత్యంత సంతోషముతో సీతా రాముల గుణములను పొగడుచు గృహమునకేగి సుఖముగ జీవించసాగెను. సీతా మాత కృపాకటాక్షము పొందిన ఆమె ఆనందమునకు అంతములేదు.

విప్ర పత్ని వెళ్ళిన తరువాత సీతా దేవి సప్త ద్వీప వసుంధర యందు ( ప్రపంచమంతయు) ఈ విధముగ చాటింపు వేయించెను. ''నేటి నుండి యే రాజ్యమందైనను స్త్రీ గాని, పురుషుడు గాని దీనస్థితిలో కనిపించ కూడదు. ప్రతి ఒక్కరు వస్త్రాభూషణములతో సుఖః శాంతులతో సుసంపత్తులతో తుల తూగుచుండ వలెను. దీనికి భిన్నముగ అభాగ్యులై యే దేశమందైనను, యే రాష్ట్ర మందైనను జనులు కనిపించినచో ఆదేశ రాష్ట్రాధ్యక్షుడు గాని, రాజు గాని అందకు బాధ్యులగుదురు. అందు చేత రాజులు తమ ప్రజలకు తమ ధనమును సముచితముగ పంచ వలెను. లేనిచో ఆ రాజులు శ్రీరామ దండనను అనుభవించెదరు''

అయోధ్యాయాం తథా రాష్ట్రే ఘోషయా మాస దున్దుభిమ్
సప్తద్వీపేషు సర్వత్ర పృథ గ్వర్షేషు సాదరమ్ ।
కాచిన్నారీ పుమాన్ వాపి వినా సద్ వస్త్ర భూషణైః ॥

దృష్టశ్చారెర్మ యాజ్ఞాతో యద్ దేశేయ త్పురే తదా ।
తద్రాజ్ఞ శ్చాస్తుమే దండో రామ స్యాపి విశేషతః ॥

ఇతి మచ్చిక్షితం జ్ఞాత్వా స్వకోశైః స్వీయ రాష్ట్రకే।
వస్త్రాలంకార భూషాభిర్భూషణో యాద్విజాదయః ॥

(ఆనంద రామాయణము)

ఈ చాటింపు వినిన సమస్త రాజులు దానిని పాలించిరి. ఈ వృత్తాంతము అద్భుతమైన దయా మమతలతో నిండి జానకీ దేవి మాతృ హృదయమును తెలుపును. సీతారాముల అనంత కృపను ఎవరు వర్ణించ గలరు ?



# జనకుని గూఢ శ్రీరామ భక్తి

అనేక ఋషులతో కలసి విశ్వామిత్ర మహర్షి మన నగరము నందలి ఆమ్రవ కాననమునకు విచ్చేసి నాడని ప్రజలు చెప్పుకొనుచుండ జనక మహారాజు మంత్రులతోను బ్రాహ్మణులతోను కలసి విశ్వామిత్రుని దర్శించుటకు వెళ్ళెను.

జనక మహారాజు విశ్వామిత్రుని చరణములకు ప్రణామములు గావించెను. విశ్వామిత్రుడు ప్రేమతో జనకుని తన చెంత కూర్చుండ బెట్టుకొని కుశల ప్రశ్నలడిగెను. శ్రీరామలక్ష్మణులు పుష్పవాటికను దర్శించి తిరిగి వచ్చిరి. తేజోవంతులగు ఆ ఇరువురిని గాంచి అచట నున్న వారందరు లేచి నిలువబడిరి. వారి అద్భుత రూప లావణ్యముల గాంచి అందరు ఆనందపులకితులైరి. వారి నేత్రముల వెంట ఆనందాశ్రువులు స్రవించుచుండెను. వీరిని దర్శించిన విదేహ మహారాజు పరవశించి పోయెను. రామునిపై జనకునికున్న గుప్త ప్రేమ శ్రీరామునకే తెలియును. కొన్ని సంవత్సరముల క్రిందట నారదుడు చెప్పిన మాటలు సత్యమయిన వనిపించెను.

అంతకు ముందు నారదుడు జనకునికి జెప్పిన పరమ రహస్య వచనములివి. ''భక్తులపై దయతో హృషీకేశుడు దైవ కార్య సిద్ధికి, రావణాది రాక్షసులను వధించుటకు మాయా మానవ రూపముతో అవతరించి ''రామ'' నామముతో విఖ్యాతి గాంచును. ఆ పరమేశ్వరుడు తన నాలుగు అంశలతో దశరథునకు పుత్రుడై అయోధ్య యందుండెను. ఇచట యోగ మాయయే సీతా రూపమున జన్మించెను. అందువలన ఈ సీతను రఘు నాథునకు ఇచ్చి పాణి గ్రహణము చేయింపుము. పరమాత్మ రాముని భార్య గనుక ఈమెకు తదితరులతో వివాహము కాదు''.

ధనుర్యజ్ఞానంతరము జనకుడు సీతకు వివాహము గావించి తన జన్మ సఫలమైన దనుకొనెను.

వివాహానంతరము దశరథ మహారాజు పుత్రులతోను కోడండ్రలతోను అయోధ్యకు ప్రయాణమయ్యెను. జనకుడు ప్రేమను దాచ లేకపోయెను. నేత్రములు అశ్రుపూరితములయ్యెను. దశరథుని వంక కొంచెము సేపు, రాముని వైపు కొంచెము సేపు, సీతవైపు కొంచెము సేపు చూడ సాగెను. రాముడు వెళ్ళు చున్నాడను కొనిన తన ప్రాణమే పోవుచున్నట్లుండెను. తిరిగి రండని దశరథుని ప్రార్థేయ పడుచుండెను. దశరథుడు ప్రేమతో వారించగా జనకు ప అశ్రు నయనములతో రథము దిగి ప్రణమిల్లెను. అనంతరము రాముని సమీపించి చేతులు జోడించి మాటాడవలెనని అనుకొనుచున్నను ప్రేమ వశముతో మాటాడ లేకుండెను. వాక్కు అవరుద్ధ మగు చుండెను. ఎంతయు ప్రయత్నము మీదనెమ్మదిగా వినమ్రుడై ఇట్లు ప్రార్థించెను.

''రామా ! నేడు నా జన్మ ఫలించెను. సూర్యునివలె ప్రకాశించు మిమ్ములను సీతా సహితులను గాంచు చుంటిని. యోగులు మీ చరణ కమల పరాగ రసికులై భయంకర కాల చక్రమును జయించిన వారై సంసార సాగరమును దాటుదురు. మీ నామ సంకీర్తనముతో దేవ గణములు శోకమును, దుఃఖమును జయించు చున్నారు. అట్టి మిమ్ములను శరణు వేడు చుంటిని. నా హృదయ మందున్న మీ చరణములను నేను ఎప్పుడును మరువ కూడదు'' అని వేడుకొనగా శ్రీరాముడు జనకుని వచనములకు ప్రేమ పూరితుడై సంతుష్టుడయ్యెను. జనకుని తన తండ్రి దశరథుని వలెను, గురువు విశ్వామిత్రుని వలెను, కుల గురువు వసిష్ఠుని వలెను భావించి గౌరవించెను

అనంతరము జనకుడు భరతుని లక్ష్మణుని శత్రుఘ్నుని కలసి ఆశీర్వదించెను.

తరువాత జనకుడు విశ్వామిత్రుని కలసి ఆయన పాదములు పట్టుకొని ఆ పాద ధూళిని నేత్రములకు అద్దుకొని శిరస్సున ధరించెను

శ్రీరాముడు సీతా లక్ష్మణ సహితుడై అయోధ్య విడిచి వనవాసమునకేగె ననియు, భరతుడు దుఃఖముతో శ్రీరాముని తిరిగి తెచ్చుటకు చిత్రకూటమునకు వెళ్ళెననియు, వినిన జనకుడు కూడ చిత్ర కూటమునకు వెళ్ళెను. అచట శ్రీరాముని దర్శించి భరతుని భక్తి చూచి వారితో యేమియు చెప్పలేకపోయెను. శ్రీరాముని భరతుని పారస్పరిక ప్రేమ తర్కించవలవి గానిది.

జనకుడు శ్రేష్ఠ కర్మ యోగి. ఆదర్శ జ్ఞానులందు అగ్రగణ్యుడు. ద్వాదశ ప్రధాన భాగవతాచార్యులం దొకడు. జనకుడు ధన్యుడు. ధన్యమైనది అతని గూఢ ప్రేమ.



# భరతుని శ్రీరామ భక్తి

మహా భాగ్యవంతుడైన శ్రీ భరతునకు జయము. జానకీ రాముల చరణ కమలముల మకరందమును గ్రోలు రసిక భ్రమరము భరతుడు. జగత్ భూషణుడు, సూర్య వంశ విభూషణుడు, నృప శిరోమణి శ్రీరామ చంద్రునిపై పూర్ణానురాగము గలవాడు భరతుడు.

జగత్తును భరించి పాలించిన వాడు భరతుడు. భరతుడు జన్మించకున్న ప్రథ్విపై సర్వ ధర్మ భారమును ఎవరు ధరింపగలరు? జడమును చేతనమును, చేతనమును జడమును ఎవరు చేయ గలరు? శ్రీ రాముడే భరతునకు సర్వస్వము. శ్రీ రాముడే తండ్రి, తల్లి, సోదరుడు, బంధువు. జీవన సర్వస్వము రాముడే.

శ్రీరాముని వనవాస విషయము వినిన భరతుడు తండ్రి మరణ విషయము మరచిపోయెను. ఈ సర్వానర్థములకు కారణము నేనే అని తలచి స్తంభించి పోయెను. శ్రీ రామునిపై అమితమైన ప్రేమ కారణముననే భరతుడు తన తల్లి అయిన కైకను కటు శబ్ద ములతో తూలనాడి తననే దోషినిగా భావించి పశ్చాత్తాపముతో దుఃఖపడు చుండెను. భరతుని స్వభావమెరిగిన కౌసల్యా దేవి 'నీవు సదా రామచంద్రుని ప్రేమించువాడవని నాకు తెలియును. శ్రీరాముడు నీకు ప్రాణము కంటె ప్రియమైనవాడు. శ్రీ రామునకు కూడ నీవు ప్రాణము కంటె ప్రియుడవు' అని పలుకుచు ఓదార్చెను

అనంతరము వామదేవ వసిష్ఠులు భరతుని ఓదార్చిరి. మంచి ముహూర్తమున రాజ సభ నేర్పాటు గావించి మంత్రులను, సభాసదులను, భరతుని, కౌసల్యాదులను పిలిపించి భరతునితో ''రాజ్యము స్వీకరింపు'' మని కోరిరి.

అప్పుడు భరతుడు వారితో వినయముగా ''నా తండ్రి స్వర్గమున కేగెను. శ్రీ సీతారాములు వన మందుండిరి. ఇట్టి

సమయమున మీరు నా శుభమును కోరుచుంటిరా ? శ్రీరాముడు తప్ప నా మనోభావమును గ్రహించువారు ఎవరు ? ప్రాతః కాలముననే శ్రీరాముని చెంత కేగుదు'' నని నిశ్చయముగ పలికెను. ''సీతాపతి సేవయే నాకు శుభ'' మనెను.

భరతుడు వనమునకు వెళ్ళు సమయమున నిషాదుని కలసి వానితో ''నేను మహాపాపిని. విధాత మా వంశ కలంకమునకే నన్ను పుట్టించి నట్లున్నది'' అని బాధ పడుచుండగా నిషాదుడు భరతుని ఓదార్చుచు ''శ్రీరామ ప్రభువు మిమ్ములను పదే పదే గుర్తు చేసి కొనుచు ప్రశంసించుచు గడిపెను. మీ కంటె అతిప్రియమైన వారు శ్రీరామునకు లేరు. ఇది ప్రమాణము చేసి చెప్పు చుంటె'' ననెను.

అనంతరము భరతుడు భరద్వాజ మునిని కలిసెను. మునికి ప్రణామ మాచరించి ''నా తల్లి కైక చేతలు నాకు తెలిసినవి కావు. జనులు నన్ను నీచుడను కొందురు. అందుకు బాధపడుట లేదు. పరలోక భ్రష్టుడ నైనందుకు బాధలేదు. తండ్రి మరణము కూడ నాకు శోకము గలిగించుట లేదు. అతడు పుణ్యాత్ముడు రామ లక్ష్మణులను పుత్రులుగా పొంద గలిగినాడు. సీతా రామలక్ష్మణులు ముని వేషములతో కాళ్ళకు చెప్పులు కూడ లేకుండ వనము లందు తిరుగుచున్నారు. నార బట్టలు ధరించి ఫలములు భుజించుచు నేలపై దర్భలను, ఆకులను పరచుకొని నిదుర పోవుచున్నారు. వృక్షముల క్రింద నివాసము చేయుచు నిత్యము ఎండ వానగాలులను సహించు చున్నారు. అదియే నాకు దుఃఖము గలిగించు చున్నది. నా హృదయము సంతాపాగ్నిలో నిరంతరము కాలిపోవుచున్నది. నాకు పగలు ఆకలి వేయుట లేదు. రాత్రులు నిదుర కూడ వచ్చుట లేదు. నేను ధర్మార్థ కామ మోక్షము లలో దేనిని కోరుట లేదు. జన్మ జన్మల యందు శ్రీరాముని చరణములపై ప్రేమనే వరముగా కోరుకొనెదను. ఇంకేదియు నాశించుట లేదు'' అని భరతుడు చెప్పగా భరద్వాజ ముని ''భరతా! ధన్యుడవు నీ కీర్తితో జగత్తునే జయించితివి'' అనుచు ప్రేమ మగ్నుడయ్యెను.

భరతుడు శ్రీరాముని విరోధియని లక్ష్మణుడు భ్రమ పడెను. అప్పుడు రాముడు ''లక్ష్మణా! వినుము. భరతుని వంటి ఉత్తమ పురుషుడు బ్రహ్మ సృష్టియందు ఉన్నట్లు వినలేదు, కనలేదు. అతడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మించిన వాడయినను రాజ గర్వము లేనివాడు. నేను గురువు వసిష్ఠునిపై ప్రమాణము చేసియు తండ్రి చరణముల సాక్షిగను శపథము చేసి చెప్పుచుంటిని. విశ్వ మందెక్కడను భరతుని వంటి సోదరుడు లేడు'' అని చెప్పెను.

(రామ చరిత మానసము)



# ఊర్మిళా లక్ష్మణుల శ్రీరామ భక్తి

లక్ష్మణుడు శ్రీరాముని సేవించుటకు అరణ్యవాసమునకు వెళ్ళుచుండెను. ఊర్మిళ కూడ లక్ష్మణుని వెంట వెళ్ళిన రాముని సేవించుటకు అంతరాయము గలుగును. రాముని సేవించుటయే లక్ష్మణుని ధర్మము. ఆ ధర్మము కాపాడుటకు భర్తకు ఊర్మిళ సహకరించినది. అదియును గాక ఇంద్రజిత్తునకు ఒక వరముండెను. 12 సం॥లు కంద మూలఫలములను భుజింపుచు, నిద్రను త్యజించి అఖండ బ్రహ్మచర్యమును పాటించు మహాపురుషుని చేతిలో మేఘనాథుడు మరణించునని. ఇందువలన ఊర్మిళ అయోధ్యయందే యుండెను. మహావ్రతమును పాటించుచు లక్ష్మణుడు రాముని వెంట వెళ్ళెను.

ఈ విషయ మంతయు లక్ష్మణుడు చెప్పుట వలన ఊర్మిళ మౌనముగా పాతివ్రత్య ధర్మమును పాటించెను. పతి ధర్మ రక్షణలో సహాయపడుట పత్నీ ధర్మము గనుక మారు మాటాడలేదు. వివాహమై జనకపురి నుండి వచ్చిన తరువాత 12 సం॥లు లక్ష్మణుని అనుసరించి యున్నది ఊర్మిళ. సుమిత్ర వలెనే ఊర్మిళ కూడ త్యాగము చేసి తన ధర్మమును నెరవేర్చినది.

మరొక విషయము శ్రీరాముడు స్వతంత్రుడు. అందు వలన జానకిని తన వెంట తీసికొని వెళ్ళినాడు. సేవా పరాయణుడగు లక్ష్మణుడు పరతంత్రుడు. ఊర్మిళను తీసికొని వెళ్ళుట అనుచితము

వనవాస సమయమున లక్ష్మణుడు శ్రీ సీతారాములను అన్ని విధముల సేవించుచు వీరాసనముతో కూర్చుండి మనస్సు రాముని యందు నిలిపి రామ నామము జపించుచు జాగరూకుడై యుండెడివాడు.

రావణుడు సీతను ఆకాశ మార్గమున తీసికొని వెళ్ళు చుండగా నగల మూట ఋష్యమూక పర్వతముపై నున్న వానరు

మధ్యపడ వేసెను. రామలక్ష్మణులు సీతను వెదకుచు వచ్చునప్పుడు హనుమానుని ప్రేరణతో సుగ్రీవుని చెంతకు వెళ్ళిరి. అప్పుడు సుగ్రీవుడు ఆ నగల మూటను రాముని ముందు ఉంచెను. రాముడానగలను గుర్తించమని లక్ష్మణునికి చెప్పును. అప్పుడు లక్ష్మణుడు ''స్వామీ! నేను ప్రతి నిత్యము చరణములకు వందనము చేయునప్పుడు ఆ తల్లి నూపురములనే దర్శించెడి వాడను. అందువలన వాటిని మాత్రమే నేను గుర్తించ గలను '' అని అనెను. లక్ష్మణుని సేవా ధర్మము ధన్యమైనది. శ్రీరాముని విడచి యుండని వాడు, రామ నామము తప్ప మరేదియు తెలియని వాడు లక్ష్మణస్వామి.



# శత్రుఘ్నుని శ్రీరామ భక్తి

ప్రపంచ మందు అనేక విధములైన భక్తులున్నారు. అందరిలో శత్రుఘ్నుని భక్తి విలక్షణమైనది. ఇతడు మూక కర్మ యోగి. ఏమి చెప్పువాడు కాదు. ఏమి అడుగువాడు కాదు. భగవానుని అనుసరించుట, భక్తితో సేవించుట, భక్తితో వెన్నంటి యుండుట, భరతుని సేవించుట ఇతని ధర్మములు. భరతుని విడచి యుండు వాడు కాదు. అందుచేతనే వసిష్ఠుడు భరతునితో ''రామలక్ష్మణులు అయోధ్య వచ్చినచో మీ ఇరువురు వనవాసము చేయుడు'' అని చెప్పెను. భరతుడు శత్రుఘ్నుని అడుగకుండగనే వసిష్ఠుని మాటకు అంగీకారము తెలుపును. శత్రుఘ్నుడు తనను విడచి యుండడని భరతునకు తెలియును.

చిత్రకూటము నుండి తిరిగి వచ్చినప్పుడు భరతుడు నంది గ్రామ మందు రామ లక్ష్మణుల వలెనే తపస్వియై యుండెను. తల్లులను రాజ పరివారమును సేవకులను సంరక్షించు భారము భరతుడు శత్రుఘ్నునకు అప్ప జెప్పెను. హృదయ మందు దుఃఖాగ్ని రగులు చుండెను. తాను కూడ వస్త్ర భూషణములు త్యజించిన తపస్వియైన తల్లులు అది చూచి భరించలేరని అందరి కొరకు దుఃఖమును హృదయ మందే నిలిపెను. మనస్సు నందు భగవానుని నిలిపి 14 సం॥లు ప్రసన్న ముద్ర దాల్చుట అన్నిటి కంటె కఠోరమైన తపస్సు.

రామ రాజ్యాభిషేకా నంతరము శత్రుఘ్నుడు రఘునాథుని ఆజ్ఞతో లవణాసురుని వధించి మధురాపురమును నిర్మించెను. కొంత కాలము తరువాత ఆ రాజ్యమును తన ఇరువురు కుమారులకు అప్ప జెప్పి శ్రీరాముని వద్దకు వచ్చెను. భరతుని ఆజ్ఞాబద్ధుడై యుండెను.



# హనుమంతుని శ్రీరామ భక్తి

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృత మస్త కాంజలిమ్ ।
బాష్ప వారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్ ॥

శంకర భగవానుని అంశతో వాయుదేవుని వలన కపిరాజు కేసరి పత్ని అంజనకు హనుమానుడుద్భవించెను.

మర్యాదా పురుషోత్తముడగు శ్రీరాముని శంకరుడు స్వరూపముతో సేవించలేడు గనుక తన ఏకాదశ రుద్ర రూపములను ఈ విధముగ వానర రూపములతో అవతరింప జేసెను.

జన్మించిన కొద్ది సమయమునకే హనుమానుడు ఉదయించు సూర్యుని ఎఱ్ఱని ఫలమని తలచి దానిని మ్రింగుటకు ఆకాశము వైపు పరుగిడెను. ఆ దినము సూర్యగ్రహణ మగుటచే రాహువు మరొకరు సూర్యుని పట్టుకొనుటకు వచ్చుట చూచి సూర్యుని విడచి ఆ వచ్చువారిని పట్టుకొనుటకు వచ్చెను. వాయు పుత్రుడు రాహువును మ్రింగుటకు వెంటపడెను. రాహువు భయముతో ఇంద్రుని శరణు వేడెను. ఐరావతమును వచ్చుచున్న ఇంద్రుని చూచిన పవన కుమారుడు ఐరావతమును పెద్ద తెల్లని పండుగా భావించి దానిని పట్టుకొన బోయెను. ఇంద్రుడు భయపడి వజ్రాయుధముతో కొట్టెను. అప్పుడు హనుమాని దవడకు గాయమగుటచే వంకర పోయెను. ఇందు వలననే మారుతి హనుమానుడుగా పిలువబడుచున్నాడు. వజ్రఘాతముతో మారుతి మూర్ఛపోయి క్రిందపడెను. పుత్రుడు మూర్ఛపోవుట గాంచిన

వాయుదేవుడు వాయువును స్తంభింప జేసెను. శ్వాస ఆడకపోవుటచే వ్యాకులపడి సమస్త దేవతలు హనుమానునకు అమరత్వమొసగి అనేక వరము లిచ్చి వాయు దేవుని సంతుష్ట పరచిరి.

హనుమానుడు జాతి స్వభావముతో చంచలుడై ఋషుల ఆశ్రమములలోని వృక్షములను పడగొట్టుచు, ఆశ్రమ వస్తువులను అస్తవ్యస్తము గావించు చుండెను. అప్పుడు ఋషులు ఇతనిని "నీవు నీ బలమును మరచెదవు. ఎవరైనను నీ బలమును నీకు గుర్తు చేసిన మరల నీ బలమును నీవు పొందెదవు" అని శపించిరి. అప్పటి నుండి సామాన్య వానరునిగా మెలగసాగెను. తల్లి ఆజ్ఞానుసారమ సూర్యనారాయణుని చెంతకేగి వేద వేదాంగ ప్రభృతులు సమస్త శాస్త్రములు కళలు అధ్యయనము చేసెను. తరువాత కిష్కింధకు వెళ్ళి సుగ్రీవుని వెంట నుండసాగెను. సుగ్రీవుడు మారుతిని తన సహాయ మంత్రిగా నియమించెను. వాలి సుగ్రీవుని తరిమి వెళ్ళగొట్టి నప్పుడును, హనుమానుడు సుగ్రీవునితోనే ఋష్యమూక పర్వతముపై నుండెను.

అంజనాదేవి పదే పదే రామచరిత్రను హనుమానునకు పసితనము నుండియే బోధించెడిది. తరువాత వేదములలోను, పురాణములలోను నున్న శ్రీరామ కథను అధ్యయనము చేసెడివాడు. కిష్కింధకు వచ్చిన తరువాత శ్రీరాముడు అయోధ్యలో అవతరించెనను విషయము తెలిసినది. అప్పటి నుండి తన స్వామిని దర్శించుటకు ఎదురు చూచు చుండెను.

"నిరంతరము భగవానుని కృపకు ఎదురు చూచుచు, ప్రారబ్ధ కర్మల వలన సమకూడిన సుఖ దుఃఖములను సంతోషముగ అనుభవించుచు హృదయ పూర్వకముగ సాష్టాంగ ప్రణామము చేయును. హృదయ మందు భగవానుని స్మరించుచు, వాక్కుతో

భగవన్నామ సంకీర్తన గావించుచుండెను. తనువుతో భగవానుని పూజించువారు ముక్తి పదమునకు అధికారులగుదురు'' అని భాగవతములో గలదు.

శ్రీ హనుమానుడు జన్మతోనే మాయా బంధన ముక్తుడయ్యెను. అహర్నిశలు శ్రీరామునే స్మరించు చుండెను.

సీతను వెదకుచు రామలక్ష్మణులు ఋష్యమూకమునకు వచ్చిరి వారిని చూచిన సుగ్రీవుడు, వాలి తనను వధింపుమని వీరిని పంపెనేమోయని శంకించెను. వారిని పరిచయము చేసికొని రమ్మని హనుమానుని పంపెను.

హనుమానుడు విప్ర వేషము ధరించి వెళ్ళి వారిని పరిచయము చేసికొని శ్రీరాముడు తన స్వామియే యని గుర్తించి చరణములపై బడి రోదించు చుండ శ్రీరాముడు లేపి హృదయమున చేర్చుకొనెను. అప్పటి నుండి హనుమానుడు శ్రీ అవధేశ కుమారుని చరణముల సమీపముననే యుండెను.

హనుమానుడు ప్రార్థించగా శ్రీరాముడు సుగ్రీవునితో మిత్రత్వము పొంది వాలిని సంహరించి సుగ్రీవునకు కిష్కింధా రాజ్యమిచ్చెను. రాజ్య భోగముతో సుగ్రీవుడప్రమత్తుడగుట గాంచి, హనుమానుడు వానిని సీతాన్వేషణకు అప్రమత్తుని గావించెను. పవన కుమారుడే వానరులందరిని ఒక చోటికి చేర్చెను. శ్రీరాముడు ఇతనికే ముద్రిక నిచ్చెను.

''నూరు యోజనముల సముద్రము దాటుటెట్లు ?'' అను ప్రశ్న వచ్చినప్పుడు జాంబవంతుడు హనుమానునకు అతని బలమును గుర్తుకు దెచ్చి ''మీరు అవతరించినదే రామ కార్యము నెరవేర్చుటకు'' అని చెప్పెను. అప్పుడు తన శక్తిని గ్రహించిన వాడై కేసరీ కిశోరము లేచి నిలువబడెను.

దేవతలు పంపగా వచ్చిన నాగమాత సురసను సంతుష్ట పరచి, సముద్ర మందు దాగియున్న సింహికా రాక్షసిని వధించి, హనుమానుడు లంకా నగరము చేరెను. ద్వారపాలిక లంకిణిని ఒక ముష్టి ఘాతముతో సరి చేసి, చిన్న రూపము ధరించి రాత్రి సమయమున లంక యందు ప్రవేశించెను.

అశోక వాటిక యందు జానకిని దర్శించి, ధైర్యము చెప్పి అశోక వనమును విధ్వంసము గావించెను. రావణుడు పంపగా వచ్చిన రాక్షసులను, రావణ పుత్రుడు అక్షయ కుమారుని సంహరించెను. మేఘనాథుడు బ్రహ్మాస్త్రముతో బంధించి రాజ సభకు తీసికొని వెళ్ళెను. అచట హనుమానుడు రావణునితో ''అభిమానము వదలి శ్రీరామ భగవానుని శరణు వేడు'' మనెను. రావణుని ఆజ్ఞతో హనుమానుని తోకకు నిప్పు ముట్టించిరి. ఆ అగ్నితోనే హనుమానుడు లంకా దహనము గావించెను. తరువాత సీత చెంత కేగి చిహ్నముగా నొసగిన చూడామణిని తీసికొని శ్రీరాముని చెంతకు తిరిగి వచ్చెను.

రాముడు యుద్ధమునకు బయలుదేరి సముద్రముపై సేతు నిర్మాణము గావించెను. సంగ్రామ మందు రావణుడు సమస్తాను చరులు బాంధవులతో మరణించెను. యుద్ధ మందు హనుమానుడు అందరి కంటె ఎక్కువగా తన పరాక్రమమును చూపెను. తన హుంకారముతో రాక్షసులను కంపింప జేసెను. మేఘనాథుని శక్తితో మూర్ఛపోయిన రామలక్ష్మణులను, మార్గ మందు అడ్డు వచ్చిన దుష్టుడగు కాలనేమిని వధించి ద్రోణాచలమును పెళ్ళగించి తెచ్చి సంజీవనీ ఓషధితో రామ లక్ష్మణులను మూర్ఛ నుండి తేర్చెను. రావణుడు మాయతో యుద్ధ భూమి నుండి రామ

లక్ష్మణులను ఎత్తుకొని పోగా పాతాళము ప్రవేశించి అహిరావణుని వధించి, హనుమానుడు రామ లక్ష్మణులను తెచ్చెను.

రావణ వధ సమాచారమును జానకికి వినిపించిన సౌభాగ్యము, శ్రీరాముడు తిరిగి వచ్చు చున్నాడను సంతోష వార్తను భరతునకు అందించిన గౌరవము, శ్రీరామ ప్రభువు తన ప్రియ సేవకుడైన హనుమానునకే ప్రసాదించెను.

హనుమానుని భక్తి అతులనీయము. అయోధ్యలో రాజ్యాభిషేకా నంతరము రాముడు అందరికి కానుక లొసగెను. అన్నిటి కంటె అమూల్య మైన మణిహారమును జానకి తన కంఠము నుండి తీసి హనుమానుని మెడలో వేసెను. హనుమానుడు ఆ మణులను పరిశీలన చేయుచు దంతములతో కొరికి ముక్కలు చేయుచుండెను. దుర్లభమైన రత్నములను ఈ విధముగ నష్టము చేయుట కొందరికి చాల కష్టమనిపించెను. మరి కొందరు వారింపగా హనుమానుడు ''నేను వీని యందు భగవానుని నామము వెదకుచుంటిని. వీని యందు నా స్వామి సీతా రాముని నామము లేదు. వాని మూర్తి కూడ లేదు. అందువలన ఇది వ్యర్థమైన'' దనెను.

అప్పుడు కొందరు ''ఏమి ! మీ శరీర మందు శ్రీరామ మూర్తి నామములున్నవా ? '' అని అడిగిన వెంటనే హనుమానుడు గుండె చీల్చి అందరికి చూపెను. వాని రోమ రోమము నందును 'రామ' అను దివ్యనామము అంకితమై యుండెను. వాని హృదయ మందు శ్రీ జనక నందినితో కలసి సింహాసనముపై మహారాజాధి రాజ శ్రీ అవధేశ భువన సుందర మూర్తి విరాజ మానమై యుండెను. సమస్త జనులు జయ - జయ నినాదములు చేసిరి. శ్రీరామ భగవానుడు హనుమానుని హృదయమునకు హత్తుకొనెను

హనుమానుడు ఆజన్మ నైష్ఠిక బ్రహ్మచారి, మహావ్యాకరణ పండితుడు, వేదజ్ఞుడు, జ్ఞాన శిరోమణి, గొప్ప విచార శీలుడు, తీక్ష్ణ బుద్ధి గలవాడు, అతుల పరాక్రమవంతుడు, సంగీత నిపుణుడు, గాయకుడు కూడ.

ఒకసారి దేవ దానవ ఋషి సమ్మేళనములో జలాశయ తీరమున శంకర భగవానుడు, దేవర్షి నారదాదులు గానము చేయుచుండిరి. అప్పుడు హనుమానుడు మధుర స్వరముతో సుందరమైన గానము ప్రారంభించెను. అప్పుడు అందరు తమ తమ గానముల నాపి, పరవశులై మౌనముగా వినసాగిరి. అప్పుడు హనుమానుడొక్కడే గానము చేయుచుండెను. (పద్మ పురాణము)

ఎప్పటి వరకు రామ కథ ఉండునో అప్పటి వరకు హనుమానుడు ఈ పృథ్విపై నుండునట్లు స్వయముగ శ్రీరామ ప్రభువు వలన వరము పొందెను. శ్రీరాముని అశ్వమేధ యజ్ఞ మందు అశ్వరక్షా సమయమున అనేక మహా సంగ్రామములు జరిగెను. వానిలో హనుమానుడు పరాక్రమముతో సర్వ విజయి అయ్యెను. మహా భారత మందు అర్జునుని రథ ధ్వజముపై కూర్చుండెను. అందువలననే అర్జునుని రథము నెవ్వరు వెనుకకు మళ్ళించ లేకపోయిరి. ఒకసారి గరుడ భీమార్జునుల అభిమానమును తొలగించెను.

హనుమానుడు తన వజ్ర నఖములతో పర్వత శిలపై రామచరిత్ర కావ్యమును వ్రాసెను. దానిని గాంచిన వాల్మీకి మహర్షికి దుఃఖము గలిగెను. ఒక వేళ ఈ కావ్యము లోక మందు ప్రఖ్యాతి గాంచిన, నా ఆది కావ్యమునకు ఆదరము లభించదను కొనెను. అప్పుడు ఋషిని సంతుష్ట పరచుటకు హనుమానుడా శిలను సముద్రమున వేసెను. నిజమైన భక్తునిలో అభిమాన

చెప్పుచు ఉండెను. హనుమానుడు తన ప్రభువు పావన యశస్సును లోకములో గానము చేయును. శ్రీరామ కథా శ్రవణము, రామ నామ కీర్తన హనుమానునకు అతిప్రియమైనవి. రామ నామ కీర్తన గాని, రామ కథగాని యుండు చోటికి హనుమానుడు గుప్త రూపముతో వెళ్ళి ప్రారంభము నుండి చివరి వరకు చేతులు జోడించి నిలువబడి యుండును. అట్టి అతులనీయ శ్రీరామ భక్తుని పావన పద కమలములకు అనంత నమస్కారములు.



శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

## శ్రీరామ జయ రామ జయ జయ రామ

లంకా విజయా నంతరము శ్రీరాముడు మహాసభ యందుండగా దేవర్షి నారదుడు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు అనేక ఋషి గణములు సమావేశమై యుండిరి. అట్టి సమయమున నారదుడు ఋషులను ''శ్రీరామ నామము (భగవానుని నామము), శ్రీరాముడు (స్వయం భగవానుడు) వీనిలో నేది శ్రేష్ఠమైనది ?'' అని ప్రశ్నించెను. అందరును తర్కించుచు ఏమియును చెప్పకుండిరి. అప్పుడు నారదుడు ''నేను నిర్ణయించితిని. నామమే శ్రేష్ఠమైనది'' అని చెప్పి అది అప్పుడే ఋజువు చేయవలెనని తలచి హనుమానుని పిలచి ''మహావీరా ! నీవు శ్రీరామునకు సమస్త ఋషులకు నమస్కారము చేయుము. కాని విశ్వామిత్రునకు మాత్రము చేయకుము'' అని చెప్పెను హనుమానుడు అట్లే చేసెను.

అప్పుడు నారదుడు విశ్వామిత్రుని చెంతకేగి ''చూచితిరా! హనుమానునకెంత గర్వమో ! అందరికి ప్రణామము చేసి మీకు మాత్రము చేయలేదు. అందువలన మీరు తప్పక శిక్షించవలెను'' అని చెప్పెను.

విశ్వామిత్రుడు కోపముతో రాముని సమీపించి ''రాజా ! నీ సేవకుడైన హనుమానుడు ఇందరి ఋషుల మధ్య నన్ను ఘోరముగ అవమానించెను. అందువలన రేపు సూర్యుడు అస్తమించు లోపలనే వానిని నీవే స్వయముగ సంహరించ వలెను'' అని కోరెను.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

విశ్వామిత్రుడు శ్రీరామునికి గురువు అగుటచే రాముడు వాని ఆజ్ఞను పాలించవలెను. రాముడు నిశ్చేష్టుడయ్యెను.

రాముడు హనుమానుని వధించును అన్న వార్త నగరమంతట వ్యాపించెను. హనుమానుడు నారదుని సమీపించి "నన్ను రక్షించుడు మీరు చెప్పినట్లే గదా నేను చేసితిని ? రేపు రాముడు నన్ను వధించును" అనగా నారదుడు "హనుమా ! భయపడకుము. నేనుచెప్పినట్లు చేయుము. సూర్యోదయమునకు ముందుగా లేచి సరయూ నది యందు స్నానము చేసి నదీ తీరమున నిలువబడి "శ్రీరామ జయ రామ జయ జయ రామ" అను ఈ మంత్రమును జపింపుము. నీకు హాని జరుగదు" అని ఉపదేశించెను.

హనుమానుడు అట్లే చేసి నామము జపించు చుండెను. నగరవాసులందరు హనుమత్సంహారమును చూచుటకు అచటికి చేరిరి. రాముడు హనుమానుని కరుణా కటాక్షము వీక్షించుచునే అనిష్టముగనే బాణ వర్షము కురిపించు చుండెను. అవి హనుమానుని యేమి చేయ లేకుండెను. రాముడు రావణ కుంభకర్ణాది రాక్షసులను వధించిన అమోఘమైన బాణములు ప్రయోగించెను. ప్రయోజనము లేకపోయెను. తుదకు బ్రహ్మాస్త్రమును ఎత్తెను. హనుమానుడు పెద్దగా నామము జపించు చుండెను. రామనామము ఘోషించు చుండెను. అందరు ఆశ్చర్యచకితులై చూచు చుండిరి.

ఇట్టి సమయమున నారదుడు విశ్వామిత్రుని చెంతకు వచ్చి "మునీ ! మీ క్రోధమును ఉప సంహరింపుడు. రాముడు అలసిపోవుచున్నాడు. ఈ సంఘర్షణ నుండి రాముని విముక్తుని చేయుడు శ్రీరామ నామ మహత్తును చూచితిరి గదా!" అని చెప్పెను.

అప్పుడు విశ్వామిత్రుడు ''రామా ! బ్రహ్మాస్త్రము చేత కూడ హనుమానుడు హతుడు కాడు'' అని రాముని విరమింప జేసెను. హనుమానుడు శ్రీ రాముని చరణములపై బడెను. విశ్వామిత్రునకు కూడ ప్రణమిల్లెను. విశ్వామిత్రుడు శ్రీరామ భక్తిని ప్రశంసించి ఆశీర్వదించెను.



# శ్రీరాముని వర దానము

శరభంగ ముని బ్రహ్మ లోకమునకు వెళ్ళిన తరువాత మునుల సముదాయము శ్రీరాముని చెంత కేగి ''రఘునందనా! మీరు ఇక్ష్వాకు వంశీయులకు సమస్త భూమండలమునకు ప్రభువులు. ఇంద్రుడు దేవతలకు రక్షకుడైనట్లు మీరు మనుష్య లోకమునకు రక్షకులు. మీ యశస్సు పరాక్రమము త్రిలోకములందును ఖ్యాతి గాంచెను. పితృాజ్ఞా పాలన వ్రతము, సత్యము ధర్మములు మూర్తీ భవించిన మహాత్ములు. మేము స్వార్ధముతో మిమ్ము ప్రార్ధించుటకు వచ్చియున్నాము. ఇందుకు మమ్ములను క్షమింపుడు.

స్వామీ! రాజు ప్రజల ఆదాయ మందు ఆరవ భాగము పన్ను రూపమున గ్రహించుచున్నాడు. అందువలన బిడ్డల వలె ప్రజలను రక్షించకున్న అధర్మము చేసినట్లగును. శ్రీరామా! భూపాలుడు ప్రజా రక్షకుడై తన రాజ్య మందు నివసించు ప్రజలను ప్రాణ సమానులుగను, అంత కంటె అధికముగను, ప్రియ పుత్రులతో సమానముగను, సదా సావధానుడై రక్షించ వలెను. అట్లుచేసిన రాజు అనేక సంవత్సరములు రాజ్యము పాలించి అక్షయ కీర్తిని పొందును. అంతమున బ్రహ్మలోకమున విశేషముగ సత్కరింపబడును.

రాజ్య మందు మునులు కందమూల ఫలములను ఆహార ముగ గ్రహించుచు ఉత్తమమైన ధర్మమును అనుష్ఠానము చేయు చుందురు. అందులో నాలుగవ భాగము ధర్మానుసారముగ ప్రజలను రక్షించు ఆ రాజునకు చెందును. శ్రీరామా! ఈ వన మందు నివసించు వాన ప్రస్థులగు మహాత్ముల యందు అధికముగ బ్రాహ్మణులున్నారు. వారి రక్షకులు మీరే. రాక్షసులచే సంహరింప బడిన మునుల ఎముకల ప్రోవులు గుట్టలుగ పడియున్నవి. వీరిలో

పంపా సరోవర మందుండు వారు కొందరు, తుంగభద్రా నదీ తీర నివాసులు కొందరు, మందాకినీ తీర వాసులు కొందరు, చిత్రకూట పర్వత ప్రాంత మందుండు వారు కొందరు నున్నారు.

అందువలన ఈ రాక్షసుల బారి నుండి మమ్ము రక్షించెదవని నీ శరణు జొచ్చితిమి. శ్రీరామా ! నీవు శరణాగత వత్సలుడవు. మమ్ము రక్షింపుము. ఈ భూమండల మందు మిమ్ములను మించిన వీరులు మరొకరు లేరు. ఈ రాక్షసుల బారి నుండి మమ్ము రక్షింపుడు'' అని మునులు ప్రార్థించిరి.

అప్పుడు రాముడు ''ముని వర్యులారా ! మీరు నన్ను ప్రార్థించ కూడదు. నేను మీ ఆజ్ఞా పాలకుడను. రాక్షసులను సంహరించి మిమ్ము రక్షించుట కొరకే నేను తండ్రి ఆజ్ఞను పాలించి ఈ వనమునకు వచ్చితిని. మీ ప్రయోజన సిద్ధి కొరకే దేవతలు నన్ను ఇచటికి పంపించిరి. మీ సేవా భాగ్యముతో నేను ధన్యుడనైతిని. తపోధనులారా ! మునులకు శత్రువులైన ఆ రాక్షసుల నందరిని సంహరించెదను. సోదర సహితముగ నా పరాక్రమమును దర్శించెదరు'' అని తపోధనులకు వరమొసగెను.

# కాకభుశుండి శ్రీరామ భక్తి

లంకలో యుద్ధము జరుగుచుండగా శ్రీరాముని, మేఘనాథుడు నాగపాశముతో బంధించెను. తన స్వామిని బంధ విముక్తుని గావించుటకు నారదుడు గరుడుని పంపెను. గరుడుడు నాగపాశమును తొలగించెను. కాని గరుడునకు ఒక సందేహము "తుచ్ఛుడైన మేఘనాథుడు సర్వ సమర్థుడైన భగవానుని ఎట్లు బంధించెను ?" అని.

గరుడుడు నారదుని సమీపించి తన సందేహమడిగెను. నారదుడు "గరుడా ! నీ హృదయ మందు మహామోహము ఉత్పన్నమయ్యెను. నీవు బ్రహ్మ కడకేగి వాని నడుగు" మనెను. బ్రహ్మ చెంతకేగగా అతడు శంకరుని వద్దకు పంపెను. శంకరుడు "నీ సందేహము పోవలెననిన నీవు కొంత కాలము సత్సంగము చేయవలెను. మహాత్ముడైన కాకభుశుండి దగ్గరకు వెళ్ళుము. అతడు శ్రీ రామ భక్తుడు. అతడు సదా భగవానుని లీలా గాథలను చెప్పుచుండును. అతనికడ వయోవృద్ధులైన రాజహంసలు, శ్రేష్ఠమైన పక్షులు కథను వినుచుండును. నీవు అచటికి వెళ్ళి ప్రభుని చరిత్ర వినుము. అచట నీ భ్రమ తొలగిపోవును" అని చెప్పెను. శంకరుని ఆజ్ఞాను సారము గరుడుడు నీలాచలముపై నున్న కాక భుశుండి ఆశ్రమమునకు వెళ్ళెను. హరికథ చెప్పుమని కోరగా పరమపావన రామ కథను సంపూర్ణముగ వినిపించెను.

గరుడుడు కోరగా కాకభుశుండి తన కథను ఇట్లు చెప్పెను. "పూర్వ కాలమున కలియుగ మందు అయోధ్యలో శూద్ర కులమందు జన్మించితిని. ఒకసారి కరువు రాగా అయోధ్య విడిచి

ఉజ్జయినికి వెళ్ళితిని. అచట శంకర భగవానుని ఉపాసకుడైన బ్రాహ్మణ సాధువుండెను. అతడు నాకు శివ మంత్రమును ఉపదేశించెను. నేను శివ భక్తుడనైతిని. కాని రాముడన్నను, కృష్ణుడన్నను నాలో ఈర్ష్య పెరిగినది. నా గురువు ఎంతయు బాధపడుచు ''శంకరుడు సదా రామ నామమును జపించును. నీకు ఈ ద్వేషము పనికిరాదు'' అని ఎన్ని మారులు చెప్పినను నాలో ఆ ద్వేషము పోలేదు.

ఒకసారి శంకరుని మందిర మందు శివ నామము జపించు చుంటిని ఆ సమయమున నా గురువులు అచటికి వచ్చిరి. అహంకారముతో నేను లేచి నిలబడలేదు, నమస్కారము చేయలేదు. అయినను నా గురువు సహించెను. కాని శంకర భగవానుడు నన్ను క్షమించ లేదు. ఆకాశవాణి ''ఇతడు సహస్ర్ర జన్మలెత్తు'' నని శపించెను. దయగల నా గురువు అయ్యో అనుచు లేచి నిలువబడి ఈశ్వరుని ప్రార్ధించెను. గురుదేవుని ప్రార్ధనతో సంతుష్టుడైన ఉమానాథుడు ''నా శాపము వ్యర్థము కాదు. అధమ యోని యందు ఒక వెయ్యి మారులు అవశ్యము జన్మింప వలసినదే. నా దయ వలన ఇతనికి సర్వము గుర్తుండును. అంతిమ జన్మ యందు ఇతడు బ్రాహ్మణ కులమందు జన్మించును. అప్పుడు శ్రీరాముని చరణములపై ప్రీతి యేర్పడును'' అని పలికెను.

శంకురుని శాపానుసారము అనేక జన్మ లెత్తి చివరకు బ్రాహ్మణ కులమున జన్మించితిని. పూర్వ జన్మ స్మృతితో శ్రీరాముని యందు భక్తి యేర్పడెను. కొంత కాలము గడిచిన తరువాత నా తల్లి దండ్రులు గతించిరి. ఇల్లు విడచి వనమునకు వెళ్ళితిని. అచటికి వచ్చు ఋషులకు, మునులకు నేను శ్రీ రాఘవేంద్రుని గుణములను గానము చేయుచు వినిపించు చుంటిని.

నెమ్మది నెమ్మదిగా నాకు శ్రీరాముని దర్శించవలెనను కోరిక అధికమయ్యెను. ఎవరిని అడిగిన భగవానుడు సర్వవ్యాపకుడు, నిర్గుణుడు, నిరాకారుడు అని ఉపదేశించు చుండిరి. కాని నాకు సంతోషము గలుగుట లేదు. రాఘవేంద్రుని దర్శించ వలెనను వ్యాకుల పడుచుంటిని. అతని చరణములకు ప్రణామము జేసి ''సగుణ సాకార భగవానుని దర్శించు ఉపాయము చెప్పు'' మని అడిగితిని. అతడును నిర్గుణ నిరాకార బహ్మనే ప్రతిపాదించు చుండ నేను దానిని ఖండించుచు సగుణ సాకారుని సమర్థించు చుంటిని. మహర్షి ఎన్ని మారులు చెప్పినను విననైతి. మహర్షి కోపముతో కాకివి కమ్మని శపించెను. వెంటనే నేను ఈ రూపము ధరించితిని. మహర్షి వెను వెంటనే పశ్చత్తాపము జెంది నన్ను పిలచి శ్రీరాముని బాలరూపమును, శ్రీరామ మంత్రమును నాకు ప్రసాదించెను. ప్రేమతో నాశిరస్సు నిమురుచు 'నీ హృదయ మందు శ్రీరామునిపై భక్తి ఎల్లప్పుడుండును. శ్రీరాముడు కూడ నిన్ను సదా ప్రేమించును. జ్ఞాన వైరాగ్యాది సమస్త శుభగుణములు నీలో సదా నివాస ముండును. ఇచ్ఛాను సారముగ రూపము ధరించెదవు. మృత్యువు కూడ నీ ఇచ్ఛాను సారమే జరుగును. నీ మనోవాంఛ నెరవేరును. నీవు ఏ ఆశ్రమ మందున్నను అచటికి ఒక యోజన దూరము వరకు అజ్ఞానము ప్రవేశించలేదు' అని పలికెను.

గురుని అనుగ్రహముతో కృతార్థుడనైతిని. గురువునకు వందనములు సమర్పించి ఇచటికి వచ్చితిని. ఇచట 27 కల్పములు గడిచిపోయినవి. భగవానుడు అవతారములు ఎత్తినప్పుడు అయోధ్యకు వెళ్ళి అతనిని 5 సంవత్సరముల బాలకుని వరకు బాలలీలలు గాంచుచు భువన మోహన రూపమును దర్శించు:

కృతార్థుడనగు చుందును. తరువాత శిశు రూపమును హృదయమున ధరించి తిరిగి ఈ ఆశ్రమమునకు వచ్చి శ్రీరాముని ధ్యానించుచు వాని లీలా కథలను చెప్పుచుందును. ఈ రాజహంసలు ఎంతో ఆదరముగ వినును'' అని గరుడునకు చెప్పెను.

శంకర భగవానుడు స్వయముగ పార్వతీ మాతకు కాకభుశుండి ఆశ్రమమును గురించి వర్ణించి చెప్పెను.



# ఆది శంకరాచార్యుల శ్రీరామ భక్తి

ఆది శంకరాచార్యులు సాక్షాత్ శివ భగవానుని అవతారము. ఇతడు యోగ జ్ఞాన వైరాగ్య భక్తి స్వరూపుడు. ఇతడు కొద్ది కాలములోనే బౌద్ధులను, జైనులను మొదలగు వారిని ఓడించి భారతదేశమున నాలుగు వైపుల నాలుగు మఠములను, ఉప మఠాదులను నిర్మించి సమస్త దేశ మందు సత్యసనాతన ధర్మమును స్థాపించెను. ఉపనిషత్తులకు, గీత, వేదాంత దర్శనాదులకు అద్భుతమైన భాష్యమును రచించి తన తీవ్ర ప్రతిభా దివ్య విజ్ఞానములతో సమస్త ప్రపంచమును ఆశ్చర్యపరచెను. శక్తి ఉపాసనపై సౌందర్య లహరి, నృసింహ ఉపాసనపై లక్ష్మి నృసింహ స్తోత్రము, శివ, విష్ణు, కృష్ణ, గణపతి, హనుమదాది దేవతల ఉపాసనలపై కూడ దివ్యమైన స్తోత్రములను రచించెను.

మహర్షి వాల్మీకి ఆది కావ్యము శ్రీమద్ రామాయణము రచించి అనుపమైన కార్యము చేసెను. దీనికి సరి సమానమైనది మరి లేదు అనిపించును. శంకరాచార్యుని శ్రీరామ భుజంగ ప్రయాత స్తోత్రమును చూచి నప్పుడు అట్లే అనిపించును. ఇది కేవలము 29 శ్లోకములతో నున్నది. ఇతడు శ్రీరాముని ఎడల అనన్య నిష్ఠ, విశుద్ధ భక్తి, ఆత్మ పరాయణత చూపించెను. ఇతడు వాల్మీకి రామాయణమును, అనేక రామ చరిత్రలను పలుమారులు శ్రద్ధా భక్తులతో అభ్యసించె ననిపించును. శ్రీరామ భక్తి యందు అందరి కంటె గొప్ప వాడయ్యెను. ఇతని శ్రీరామ భుజంగ

ప్రయాత స్తోత్రమున ప్రతి పద మందు ఇతడు అహర్నిశలు రామ నామము జపించుచు, శ్రీరాముని స్వరూపమును ధ్యానించుచు, అత్యంత నమ్రతతో శ్రీరాముని స్తుతించుచు సదా తన ఆరాధ్య దైవము శ్రీరాముని నవ విధ భక్తి యందు నిమగ్నుడై తన్మయము జెందు చుండెను. ఈ స్తోత్రములో ప్రతి పద్యము సర్వోత్తమము గనే అనిపించును. అతని రామ నిష్ఠను, రామ ప్రేమను మర్మముగ నేర్పుతో వర్ణించెను. దీనిని ఎన్ని పర్యాయములు చదివినను మనస్సు మళ్ళదు. పాఠకులకు శ్రీరామునిపై భక్తి పెరుగును. ఈ దృష్టితోనే ఇచట కొన్ని పద్యములకు భావానువాదము ఇవ్వబడినది. దీని వలన పాఠకులు అపార లాభమును పొందెదరు. స్తోత్ర ప్రారంభమును ఆచార్య శంకర భగవత్పాదులు చెప్పినది :

విశుద్ధం పరం సచ్చిదానంద రూపం
గుణాధార మాధార హీనం వరేణ్యమ్ ।
మహాన్తం వి భాన్తం గుహాన్తం గుణాన్తం
సుఖాన్తం స్వయం ధామ రామం ప్రపద్యే ॥

శుద్ధ సచ్చిదానంద పరమాత్మ స్వరూపుడు స్వయముగ సర్వథా నిరాధారుడు, సమస్త గుణాధారుడు, సర్వ శ్రేష్ఠుడు, సదా స్వయం ప్రకాశ స్వరూపుడు, అందరి కంటె గొప్పవాడు, సర్వ ప్రాణుల హృదయ నివాసియు, అనంత గుణనిధి, సుఖ స్వరూపుడు, స్వ ప్రకాశస్వరూపుడు అయిన శ్రీరామ భగవానుని శరణు వేడుచున్నాను.

శివం నిత్యమేకం విభుం తారకాఖ్యం
సుఖాకారమాకార శూన్యం సుమాన్యమ్ ।

మహేశం కలేశం సురేశం పరేశం
నరేశం నిరీశం మహీశం ప్రపద్యే ॥

పరమ కల్యాణ స్వరూపుడు, త్రికాలము లందు నిత్యము ఒకే రూపమందుండువాడు, సర్వ సమర్థుడు, ముక్తి ప్రదాత, తరించువారికి తారక రామ నామముతో ప్రసిద్ధుడు, సుఖ స్వరూపుడు, నిరాకారుడు, అందరి చేత అన్ని విధముల పూజింప బడువాడు, ఈశ్వరునికి కూడ ఈశ్వరుడైన వాడు, సర్వ కళా స్వరూపుడు, సమస్త దేవతలకు ప్రభువైన వాడు, అందరి స్వామి అయినందున తనను మించిన స్వామి లేనివాడు, సమస్త మానవులకు స్వామి, పృథ్వికి కూడ స్వామి, తనపై శాసకుడు లేనట్టివాడు అయిన శ్రీరామ భగవానుని శరణు వేడుచున్నాను.

యదా వర్ణయత్ కర్ణ మూలేఽన్తకాలే
శివో రామ రామేతి రామేతి కాశ్యామ్ ।
తదేకం పరం తారక బ్రహ్మరూపం
భజేఽహం భజేఽహం భజేఽహం భజేఽహం ॥

కాశీ యందు శంకర భగవానులు ప్రాణుల అంత కాలమందు వారి కర్ణముల చెంత నెమ్మదిగా ''రామ రామ'' అని చెప్పుచు ఏ రామ నామము ఉపదేశించెనో అట్టి తారక బ్రహ్మ స్వరూపుడు శ్రీరామ భగవానుని పదే పదే నిరంతరము భజింతును.

మహా రత్న పీఠే శుభే కల్పమూలే
సుఖా సీన మాదిత్య కోటి ప్రకాశమ్ ।
సదా జానకీ లక్ష్మణో పేత మేకం
సదా రామ చన్ద్రం భజేఽహం భజేఽహమ్ ॥

క్వణద్రత్న మంజీర పాదార విన్దం
లసన్మేఖలా చారు పీతాంబరాఢ్యమ్ ।
మహా రత్న హారోల్ల సత్కౌస్తు భాంగం
నద చ్చం చరీ మంజరీలోల మాలమ్ ॥
లసచ్చంద్రి కాస్మేర శోణాధ రాభం
సముద్య త్ప తంగేన్దు కోటి ప్రకాశమ్ ।
నమద్ బ్రహ్మ రుద్రాది కోటీర రత్న
స్ఫుర త్కాన్తి నీరాజ నారాధితాం ఘ్రిమ్ ॥

కల్ప వృక్షము క్రింద మహారత్నమయ మంగళమయ సింహాసనముపై కోట్ల సూర్యులతో సమానముగ ప్రకాశించువాడు, సీతాలక్ష్మణ సహితుడై సుఖముగ విరాజమానుడై యుండు అనుపమ శ్రీరామ చంద్రుని నేను పదే పదే నిరంతరము శరణు వేడుచున్నాను. చరణ కమలముల యందు రత్న నిర్మిత మంజీర ధ్వనులు గలవాడు, శరీరముపై రమ్యమైన పీతాంబరము గలవాడు, నడుమునకు స్వర్ణమయమగు మొలత్రాడు తో శోభించువాడు, వక్షఃస్థలముపై మహారత్నమయ హారము దివ్య కౌస్తుభమణిని ధరించినవాడు, కంఠమందు దివ్యవనమాలను దాల్చిన వాడును, ఎఱ్ఱని అధరములపై మందహాసముతో కూడిన చిరునవ్వును దివ్యమైన వెన్నెలవలె అంతట వెదజల్లు వాడును, కోట్ల సూర్యులు ఉదయించు శోభను ధిక్కరించు శోభ గలవాడును, బ్రహ్మ శివాది దేవతా గణములు నీరాజనములు పట్టురత్న చరణ పీఠముతో వెలుగొందు శ్రీరామ చరణములకు వందనములు.

పురః ప్రాంజలీనాంజనేయాది భక్తాన్
స్వచిన్ముద్రయా భద్రయా బోధయన్తమ్ ।
భజేఽహం భజేఽహం సదా రామ చంద్రం
త్వదన్యం న మన్యే న మన్యే న మన్యే ॥

శ్రీరామ భగవానుని ఎదుట అంజనీతనయాది భక్తులు అంజలి ఘటించి నిలువబడగా భగవానుడతనికి కల్యాణమయ జ్ఞాన ముద్రచే దివ్యమైన విజ్ఞానమును ఉపదేశించెను.

నేను అట్టి రామ చంద్రుని సదా భజించు చున్నాను. ప్రభూ! మిమ్ము తప్ప నేను ఇతర దేవతలను స్వప్న జాగ్రత్ సుషుప్తులను మూడు అవస్థలలో ఎప్పుడును కూడ వేడుకొనను, వేడుకొనను, వేడుకొనను. ఇది సత్యము.

అ సీతా సమే తైర కోదండ భూషై
రసౌమిత్రి వన్ద్యైర చండ ప్రతాపైః ।
అలంకే శకాలై ర సుగ్రీవ మిత్రై
రరా మాభిధే యై రలం దైవ తై ర్నః॥

సీతా సమన్వితుడు, కోదండ ధనుర్వి భూషితుడు, లక్ష్మణాభి వన్దితుడు, ప్రచండ ప్రతాప సమన్వితుడు, లంకేశ రావణునికి కాల స్వరూపుడు, సుగ్రీవుని పరమ మిత్రుడు, శ్రీ రామ నామముతో శోభించు భగవానుని విడచి నాకు ఇతర దేవతలతో యేమి ప్రయోజనము లేదు.

అవీరాసన స్థై రచిన్ముద్రికా ఢ్యై
రభక్తాం జనేయాది తత్త్వ ప్రకాశైః ।
అ మందారమూ లైర మందార మాలై
రరామాభి ధేయైరలం దైవ తై ర్నః ॥

వీరాసనముతో నుండువాడు, జ్ఞానముద్రా సంయుతుడు తన భక్తుడైన హనుమానునకు జ్ఞాన తత్త్వమును బోధించుచు మందార మను దేవ వృక్షము క్రింద విరాజమానుడై, మందార పుష్పమాలను ధరించినట్టి శ్రీ రామ నామధారి అయిన నా ఇష్ట దైవమును విడువను. ఇతర దేవతలతో నాకు ప్రయోజనము లేదు.

అసింధు ప్రకో పైర వన్ద్య ప్రతాపై
రబన్ధు ప్రయాణైర మన్ద స్మితా ఢ్యైః ।
అదండ ప్రవాసైర ఖండ ప్రబోధై
ర రామాభి ధే యైరలం దేవ తై ర్నః॥

సముద్రునిపై కోపించినవాడు, తన ప్రతాపమును గాని ప్రసన్నతనుగాని ఎప్పుడును వ్యర్థముగానీయని వాడు, లక్ష్మణునితో కలిసి సంచరించు వాడు, ఎల్లప్పుడు మందహాసము తో శోభించు మోము గలవాడు, దండకచిత్రకూటాదు లందు నివసించిన వాడు, అఖండ జ్ఞాన స్వరూపుడు, శ్రీ రామ నామ ధారి అయిన నా ఇష్ట దైవమును ఎప్పుడును విడువను. అన్య దేవతలతో నాకేమియు ప్రయోజనము లేదు.

(పై మూడు శ్లోకములలో శంకరాచ్ఛార్యుల వారు శ్రీరాముని యందు తనకున్న అనన్య భక్తి నిష్ఠల స్వరూపమును ప్రదర్శింప జేసిరి.)

ఈ శ్లోకములలో పరమ భక్తులగు శ్రీ శంకరాచార్యుల వారి కావ్య కళ, వేద శాస్త్ర పరిజ్ఞానము, నిత్య అద్వైత నిష్ఠ, వినయము, నిరభిమానము, స్వచ్ఛమైన నిర్మల హృదయము, పవిత్రత, కోమలమైన భావము, పరిపక్వ ధ్యానము, భక్తిశ్రద్ధలు, సూర్య కిరణముల వలె ప్రతి పదమందును ప్రకాశించుచున్నవి.



# యామునా చార్యుని శ్రీరామ భక్తి

విశిష్టా ద్వైత సంప్రదాయమున శ్రీ యామునా చార్యులు ప్రసిద్ధమైన రామ భక్తులు. వాల్మీకి రామాయణమునకు టీకను లిఖించిన వారిలో మాధవ యోగీంద్రులు, గోవిందాచార్యులు, రామానుజ కందాలాది అనేక విద్వాంసులు ఈ సంప్రదాయమును అనుసరించిన వారే. వాల్మీకి రామాయణమునకు సర్వోత్తమమైన టీక గోవిందాచార్యులు రచించినది. ఇతడు 12 సంవత్సరములు అఖండమైన తపస్సుతో శ్రీ రాముని ఆరాధించి వాని కృపను పొంది ఈ వ్యాఖ్యానము రచించుట ప్రారంభించెను. ఈ సంప్రదాయమునకు మూల ప్రవర్తకులు ఆచార్య రామానుజులు అని చెప్పబడినది. అయినను ఇతడు రామభక్తిని గురించి దీక్షను తన గురువు శ్రీ యామునాచార్యుని దగ్గర పొందెను.

శ్రీ యామునాచార్యులు వైష్ణవ సంప్రదాయమున గొప్ప ఆచార్యులు. వీరు శ్రీనాథముని పౌత్రులు. శ్రీ ఈశ్వర ముని పుత్రులు. వీరి ఆవిర్భావము 1010వ సం॥లో వీరనారాయణ (మధుర) యందు జరిగెను. వీరి జీ[illegible]ము భగవత్ సేవలో భగవత్ కైంకర్యములో గడిచెను. శ్రీ యామునాచార్యునకు శ్రీ

రామానుజాచార్యులనిన మిక్కిలి ప్రేమ. శ్రీ రామానుజాచార్యులు కూడ గురువుల యెడల భక్తి భావము గలిగియుండెను.

శ్రీ యామునాచార్యులు రచించిన అన్ని గ్రంథములు లభించుట లేదు. కేవలము ఆగమప్రామాణ్యము, స్తోత్ర రత్నము, సిద్ధిత్రయము, గీతార్ధ సంగ్రహాది కొన్ని గ్రంథములు లభించెను. యామునాచార్యునకు ఆలవన్దార్ అని మరొక నామము గలదు. ఇందువలన స్తోత్ర రత్నము సమాజ మందు ఆలవందార్ స్తోత్ర నామముతో విశేషముగ ప్రసిద్ధమయ్యెను. ఇది యేదో ఒక సంప్రదాయమునకే గాక, భక్తి సముదాయమునకు, అన్ని సంప్రదాయముల విద్వాంసులకు, భక్తులకు కంఠహారమైనది. చైతన్య మహాప్రభువు కూడ ఈ స్తోత్ర శ్లోకములను ప్రేమతో కీర్తనలుగ గానము చేసి ప్రవచనము చేసెను. ఈ విషయము చైతన్య చరితామృత మందు పలుమారులు లిఖించబడినది. ఈ స్తోత్ర మందు అలంకార విశేషము, భావప్రవణత, భగవంతునిపై పూర్ణ విశ్వాసము, శరణాగతి, అన్ని మతముల వారు ఆమోదించు విధముగ పక్షపాతము లేక అనేక దివ్య గుణములు గలవు. అందువలన సమస్త సంప్రదాయముల యందు గోస్వామి తులసీదాసు భక్తి భావము గలిగియుండినట్లే ఇతని యందును భక్తిభావము గలిగి యుండిరి. తులసీదాసు వలెనే శ్రీ యామునాచార్యులు కూడ శివ విష్ణు శక్త్యాదులందు భేద భావము చూపలేదు.

యామునాచార్యులు శ్రీరాముని ప్రార్థించుచు ''ప్రభూ! ఈ ప్రపంచమున నాకు ఎవ్వరు లేరు. మీరే నా తల్లి తండ్రి పుత్ర మిత్ర కళత్ర గురువులు. నేను సత్యము చెప్పుచున్నాను. నీవు నా ఒక్కడి వాడవు గావు. అందరి వాడవు. నేను మీ దాసుడను, ఆశ్రితుడను, శరణాగతుడను. మీరు నన్ను పాలించి రక్షించుడు. పరహిత పరాయణా ! నన్నుద్ధరింపుము'' అని ప్రార్థించెను.



# తులసీదాసుని శ్రీరామ భక్తి

ప్రయాగసమీపమున బాదా జిల్లా యందు రాజాపురమను ఒక గ్రామముండెను. అచట ఆత్మారామదూబే యను పేరు గల బ్రాహ్మణుడు నివసించు చుండెను. ఇతని ధర్మపత్ని 'హులసి'. వీరికి 1554 సం॥ శ్రావణ శుక్ల సప్తమి దినమున అభుక్త మూలా నక్షత్ర మందు 12 మాసములు గర్భమందుండి గోస్వామి తులసీదాసు జన్మించెను. జన్మించి నప్పుడు బాలుడు రోదించక రామ నామము ఉచ్చరించెను. 32 దంతములు గలిగి 5 సంవత్సర ముల బాలుని వలె యుండెను. ఈ అద్భుత బాలుని గాంచిన తండ్రి అమంగళమేమోయని భయపడెను. తల్లి హులసి అనిష్టమే మోయని భయపడెను. ఈమె అత్త దశమి నాటి రాత్రి పురిటి శిశువును తన దాసికి ఇచ్చి పంపి వేసెను. మరుసటి దినమున తల్లి మరణించెను. దాసి చునియా ప్రేమతో బాలుని 5½ సంవత్సర ములు పెంచి తనువు చాలించెను. తులసీదాసు అనాథయై ఇల్లిల్లు తిరుగుచుండెను.

జగన్మాత పార్వతీ దేవి బాలునిపై కరుణతో బ్రాహ్మణి వేషము ధరించి వచ్చి స్వయముగ ప్రతిదినము అన్నము తినిపించు చుండెను. శంకర భగవానుని ప్రేరణతో రామశైలము (పర్వతము) పై నివసించు శ్రీ అనంతానందుల వారి ప్రియ శిష్యుడు శ్రీ నరహర్యానందుడు తులసీదాసుని కొరకు వెదకుచు వచ్చి బాలుని తీసికొని వెళ్ళి ''రామబోలా'' యను నామము పెట్టి అయోధ్య తీసికొని వెళ్ళెను. అచట 1561వ సం॥ మాఘ శుక్ల పంచమీ

శుక్రవారము బాలునికి ఉపనయన సంస్కారము గావించెను. నేర్పింపకనే ఈ బాలుడు గాయత్రీ మంత్ర ముచ్చరించెను. ఇది గాంచిన వారందరు చకితులైరి. తరువాత నరహరి స్వామి వైష్ణవుల పంచ సంస్కారములు గావించి రామ మంత్ర దీక్ష నిచ్చి అయోధ్య యందే బాలునిచే అధ్యయనము చేయించు చుండెను. ఇచట కొద్ది దినము లుండి గురు శిష్యు లిద్దరు సూకర క్షేత్రమునకు వెళ్ళిరి. ఇచట శ్రీ నరహరి స్వామి తులసీదాసునకు రామ చరితమును వినిపించెను. ఇచట నుండి తులసీదాసు కాశీ వెళ్ళెను. కాశీ యందు శేషసనాతనుని వద్ద యుండి 15 సంవత్సరములు వేద వేదాంగములు అభ్యసించెను. తదుపరి గురు నాజ్ఞ పొంది జన్మ భూమికి తిరిగి వచ్చెను. అచట తన వారందరు మరణించిరని తెలిసికొని వారందరికి శ్రాద్ధకర్మలు గావించి అచటనే యుండి జనులకు రామ కథను వినిపించు చుండెను.

1583 వ సం॥ జ్యేష్ఠ శుక్ల త్రయోదశి గురువారము భరద్వాజ గోత్రీయ కన్యను వివాహమాడెను. ఆ దంపతులు సుఖముగ జీవించు చుండిరి. ఒకనాడు ఆయన భార్య తన సోదరునితో పుట్టి నింటికి వెళ్ళెను. వెనువెంటనే తులసీదాసు కూడ ఆమెను వదలి యుండ లేక భార్య దగ్గరకు వెళ్ళెను. ఆమె చాల కోపించి భర్తతో "నా ఈ శరీరముపై మీకున్న ఆసక్తిలో సగము భగవానుపై నున్నచో మీ జీవన నౌకను సంసారబ్ధిని దాటించి మిమ్ములను తరింపజేయు" ననెను.

తులసీదాసు ఆ మాటలకు విరక్తి నంది ఒక్క క్షణమైనను అచట నిలువక వెను వెంటనే వెళ్ళి సాధు వేషము ధరించి ప్రయాగకు

వెళ్ళెను. అచట నుండి తీర్థ యాత్రలు చేయుచు కాశీ వెళ్ళెను. కాశీ యందు రామ కథను చెప్పుచుండెను. అచట ఒక దినము ఒక ప్రేతము ఈయనకు కనిపించెను. ఈ ప్రేతము తులసీదాసునకు హనుమంతుని నివాసము తెలిపెను. తులసీదాసు హనుమానుని దర్శించి శ్రీ రఘునాథుని దర్శింప జేయుమని ప్రార్థించెను. హనుమంతుడు చిత్రకూట మందు రఘునాథుని దర్శనమగునని చెప్పెను. తులసీదాసు చిత్రకూటమునకు వెళ్ళెను. ఇచట రామఘాట్‌పై ఆసనము వేసి కూర్చుండెను. ఒక దినము ప్రదక్షిణము చేయుచుండగా రామలక్ష్మణులు ధనుర్బాణములు ధరించి అశ్వారోహకులై వెళ్ళుచు దర్శనమిచ్చిరి. వారిని గాంచి ఈయన ముగ్ధుడయ్యెను గాని వారిని గుర్తించనేరు. హనుమంతుడు వచ్చినవారు రామలక్ష్మణులని చెప్పగా తులసీదాసు బాధ పడుచుండ హనుమంతుడు ఓదార్చి రేపు ఉదయము మరల నీకు దర్శనమగునని చెప్పెను.

1607వ సం॥ అమావాస్య బుధవారమున శ్రీరాముడు తిరిగి ప్రకటమయ్యెను. బాలుని రూపముతో "బాబా ! మాకు చందనము ఇవ్వవా?" అని అడిగెను. తులసీదాసు తన్ను తానే మరచియుండగా భగవానుడు తన చేతితో చందనము తీసి తులసీదాసు శిరస్సుపై నుంచి అంతర్ధాన మయ్యెను.

హనుమంతుని ఆజ్ఞతో తులసీదాసు 1628వ సం॥ అయోధ్య చేరెను. అప్పుడు ప్రయాగ యందు మాఘమేలా జరుగుచుండెను. అచట కొద్ది రోజులుండెను. పండుగ ఆరు దినములు గడచిన తరువాత ఒక వటవృక్షము క్రింద భరద్వాజ యాజ్ఞవల్క్య మునులు

తులసీదాసు అయోధ్యకు వచ్చి 1631వ సం॥ శ్రీరామనవమినాడు శ్రీరామ చరిత మానస రచన ప్రారంభించెను. రెండు సంవత్సరముల ఏడు నెలల ఇరువది ఆరు రోజులకు గ్రంథము పూర్తి చేసెను. 1633వ సం॥ మార్గ శీర్ష శుక్ల పక్షమున శ్రీరామ వివాహము నాడు ఏడు కాండములు సంపూర్ణము గావించెను. తరువాత భగవానుని ఆజ్ఞతో తులసీదాసు కాశీకి వెళ్ళి అచట విశ్వనాథునకు అన్నపూర్ణకు శ్రీరామ చరిత మానసమును వినిపించెను. ఆ రాత్రి విశ్వనాథుని మందిర మందు గ్రంథము ఉంచెను. తెల్లవారగనే గ్రంథము తెరచి చూచెను. దాని యందు 'సత్యం శివం సుందరమ్' అని వ్రాసి క్రింద శంకర భగవానుని సంతకముండెను.

ఇదిగాంచిన పండితులకు ఈర్ష్య జనించెను. వారు తులసీదాసును నిందించిరి. గ్రంథమును కూడ నాశనము చేయవలెనని ప్రయత్నములు చేయుచుండిరి. గ్రంథమును ఎత్తుకొని రమ్మని ఇద్దరు దొంగలను పంపిరి. దొంగలు వెళ్ళి చూడగా తులసీదాసు కుటీరము చెంత ఇరువురు వీరులు ధనుర్బాణములు ధరించి కావలి కాయుచుండిరి. వారిని దర్శించిన చోరులకు బుద్ధి మారిపోయెను. దొంగతనము మరచి భజన చేయుచుండిరి. తులసీదాసు ఇది గ్రహించి గ్రంథ క్షేమమునకు తన మిత్రుడైన తోడరుమల్లు చెంత గ్రంథము నుంచి రెండవ ప్రతి వ్రాసి కొనెను.

పండితులు ఈ గ్రంథమును శ్రీమధుసూదన సరస్వతి స్వామిని చూడమని ప్రేరేపించిరి. స్వామి దానిని పరిశీలించి ఎంతయు ప్రసన్నుడై తన శుభాశంసనను వ్రాసెను. ఇది పండితులకు ఇంకను ఈర్ష్యను పెంచెను. గ్రంథమునకు పరీక్ష పెట్టుమనిరి. విశ్వనాథుని గర్భగుడి యందు వేదములు, వాని క్రింద శాస్త్రములు,

వాని క్రింద పురాణములు అన్నిటి కంటె క్రింద శ్రీరామ చరిత మానసేమును ఉంచి తలుపులు బంధించిరి. తెల్లవారగనే వెళ్ళి గుడి ద్వారములు తెరచిరి. శ్రీరామ చరిత మానసము వేదముల కంటె పైన ఉండుట చూచి పండితులు సిగ్గుపడి తులసీదాసును క్షమింపుమని కోరిరి.

తరువాత హనుమంతుడు వినయ పత్రికను రచింపుమని కోరగా తులసీదాసు రచించి దానిని భగవానునకు సమర్పించెను. దానిపై శ్రీరాముని హస్తాక్షరములు పడెను.

1680 వ సం॥ శ్రావణ తృతీయ శనివారము నాడు అసీఘాటు దగ్గర గోస్వామి రామ రామ యనుచు ఈ లోకమును విడిచెను. ఈ లోకములో ప్రవేశించు నప్పుడును రామ రామ యనుచు ప్రవేశించెను. వెళ్ళునప్పుడును రామ రామ యనుచు వెళ్ళెను.



శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

## ద్వితీయ ఖండము

# శ్రీరామ సహస్ర నామ స్తోత్రమ్

## పూర్వపీఠికా

ష్ణుదాస ఉవాచ

ముదాస గురో ప్రోక్తం త్వయా పూర్వంమ మాంతికే।
ాహ కాండ చరమ సర్గేఽత్ర పాత కాపహే ॥ 1

మనామ సహస్రేణ నారదేన మహాత్మనా।
ాతోక్తేన సభాయాం స రామ చంద్రః స్తుత స్త్వితి ॥ 2

శ్యేదృశం రామనామ సహస్రం మాం ప్రకాశయ।
కం సూతేన కధితం మునీ నామగ్రతః పురా॥ 3

ురామదాస ఉవాచ

మ్యక్ పృష్టం త్వయా శిష్య సావధాన మనాః శ్రుణు।
మనామ సహస్రంచ సూతోక్తం ప్రవదామితే ॥ 4

ంధాత్వయా కృతః ప్రశ్నః శౌనకేన తధా కృతః।
ాతః ప్రాహతదాకర్ణ్య శౌనకం నైమిషే వనే ॥ 5

సూత ఉవాచ

కదా సుఖమాసీనౌ పార్వతీ పరమేశ్వరౌ।
ోన్యాశ్లిష్ట హృద్బాహూ లోక రక్షణ తత్పరౌ ॥ 6

ంద్రాది లోక పాలైశ్చ సేవితౌ చపరాత్పరౌ।
ర్వతీ పరిపప్రచ్ఛ తదా ధర్మాననుక్రమాత్ ॥ 7

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

పార్వత్యు వాచ

మన్నాథ ! జతాం నాథ ! సర్వజ్ఞ ! పరమేశ్వర ।
త్వ(త్ప్ర)సాదాన్మయా జ్ఞాతం ధర్మ శాస్త్ర మనుత్త మమ్ ॥ 8

ప్రాయశ్చిత్తం తు పాపానాం శ్రుతం సర్వ మశేషతః ।
బ్రహ్మహత్యాది పాపానాం నిష్కృతిం వక్తు మర్హసి ॥ 9

శ్రీమహదేవ ఉవాచ

శ్రుణుదేవి ప్రవక్ష్యామి గుహ్యాద్ గుహ్యతరం మహత్ ।
సనత్కుమార విఘ్నేశ సంవాదం పాపనాశనమ్ ॥ 10

ఉపవిష్టం గణాధ్యక్షమేకాన్తే ప్రణి పత్యచ ।
సనత్కుమారః ప్రపచ్ఛ సర్వధర్మవిదాం వరమ్ ॥ 11

సనత్కుమార ఉవాచ

భగవన్ ! సర్వధర్మజ్ఞ సర్వవిఘ్న వినాశన ।
ద్విజహత్యా హరం ధర్మం వక్తు మర్హసి మే ప్రభో ॥ 12

వినాభవన్తం ధర్మస్య వక్తా నాస్తి జగత్త్రయే ।

శ్రీగణేశ ఉవాచ

సాధు పృష్టం త్వయా బ్రహ్మన్సర్వలో కోపకారమ్ ॥ 13
మయాచిరం కృతం కర్మ స్మారితం భవతాఽనఘ ।
పురాఽహం గజరూపేణ జాతః పర్వత సన్నిభః ॥ 14

తతో వృక్షా న్సముత్పాట్య ముని హింసాం సమారభమ్ ।
తదా మయా మునిగణా నిహతా బహవో బలాత్ ॥ 15

హాహా కారో మహానాసీద్ బ్రాహ్మణానాం సమన్తతః ।
తదా హత్యా సహస్రేణ వేష్టితః పతితోఽస్మ్య హమ్ ॥ 16

| | | |
|---|---|---|
| 61 | సౌమ్యః | : శాంత స్వభావుడు. |
| 62 | బ్రహ్మణ్యః | : బ్రాహ్మణుల హితము కోరువాడు. |
| 63 | మునిసంస్తుతః | : మునులచే స్తుతింపబడు వాడు. |
| 64 | మహాయోగీ | : సమస్తయోగములకు అధిష్ఠానమగుటచే మహాయోగి. |
| 65 | మహోదారః | : మిక్కిలి ఉదారుడు. |
| 66 | సుగ్రీవేప్సిత రాజ్యదః | : సుగ్రీవునకు స్థిరమైన రాజ్యమును ఇచ్చిన వాడు. |
| 67 | సర్వపుణ్యాధిక ఫలః | : సమస్త పుణ్యముల ఉత్కృష్ట ఫలరూపుడు. |
| 68 | స్మృత సర్వాఘ నాశనః | : స్మరించినంతనే సర్వపాపములు నశింపజేయువాడు. |
| 69 | ఆది పురుషః | : బ్రహ్మను గూడ ఉత్పన్నముజేసిన వాడగుటచే సమస్తమునకు ఆది భూతాంతర్యామి పరమాత్మ అయిన వాడు. |
| 70 | పరమపురుషః | : సర్వోత్కృష్ట పురుషుడు. |
| 71 | మహాపురుషః | : సమస్త పురుషులలో గొప్పవాడు. |
| 72 | పుణ్యోదయః | : పుణ్యమును ప్రకటించువాడు. |
| 73 | దయాసారః | : దయాసారభూత పరమాత్మ అయిన వాడు. |
| 74 | పురాణ పురుషోత్తమః | : పురాణ ప్రసిద్ధక్షర - అక్షర పురుషులలో శ్రేష్ఠ లీలా పురుషోత్తముడు. |
| 75 | స్మితవక్త్రః | : నగుమోము గలవాడు. |
| 76 | మితభాషీ | : మితముగ మాటాడు వాడు. |
| 77 | పూర్వభాషీ | : ముందు మాటాడు వాడు. |
| 78 | రాఘవః | : రఘుకులమందు అవతరించిన వాడు. |
| 79 | అనంతగుణ గంభీరః | : అనంత కల్యాణమయ గుణములతో గంభీరుడు. |
| 80 | ధీరోదాత్తగుణోత్తరః | : ధీరోదాత్తమైన లోకోత్తర గుణములు గలవాడు. |

| | | |
|---|---|---|
| 81 | మాయా మానుష చారిత్రః | : తన మాయతో మనుష్యుని వలె లీలలు చేసిన వాడు |
| 82 | మహాదేవాది పూజితః | : మహాదేవాదులచే నిరంతరము పూజింపబడు వాడు. |
| 83 | సేతుకృత్ | : సముద్రముపై వంతెన నిర్మింప జేసిన వాడు. |
| 84 | జితవారీశః | : సముద్రుని జయించినవాడు. |
| 85 | సర్వతీర్థమయః | : సర్వతీర్థ స్వరూపుడు. |
| 86 | హరిః | : పాపతాపములను హరించు వాడు. |
| 87 | శ్యామాంగః | : శ్యామవర్ణ శరీరముగలవాడు. |
| 88 | సుందరః | : పరమ మనోహరుడు. |
| 89 | శూరః | : అనుపమ శౌర్య సంపన్నుడైన వీరుడు. |
| 90 | పీతవాసాః | : పీతాంబర ధారి. |
| 91 | ధనుర్ధరః | : ధనస్సు ధరించు వాడు. |
| 92 | సర్వయజ్ఞాధిపః | : సమస్త యజ్ఞములకు స్వామి. |
| 93 | యజ్వా | : సోమయాజ స్వరూపుడు. |
| 94 | జరామరణ వర్జితః | : జరామరణములు లేనివాడు. |
| 95 | విభీషణ ప్రతిష్ఠాతా | : లంకా నగరమందు విభీషణుని ప్రతిష్ఠింప జేసిన వాడు. |
| 96 | సర్వావగుణ వర్జితః | : సమస్త పాప సమూహ రహితుడు. |
| 97 | పరమాత్మా | : పరమశ్రేష్ఠుడు, నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావుడు. |
| 98 | పరంబ్రహ్మ | : సర్వోత్కృష్టుడు, సర్వవ్యాపి, సర్వాధిష్ఠానమగు పరమేశ్వరుడు. |
| 99 | సచ్చిదానంద విగ్రహః | : సచ్చిదానందమయ దివ్య విగ్రహముగలవాడు. |
| 100 | పరంజ్యోతిః | : పరమప్రకాశమయుడు, పరమజ్ఞాన మయుడు. |
| 101 | పరంధామ | : సర్వోత్కృష్ట తేజోమయుడు, సాకేత ధామ స్వరూపుడు. |

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

102 పరాకాశః : త్రిపాద విభూతి యందుండు వాడు. పరమ వ్యోమనామ వైకుంఠధామ రూపుడు, మహాకాశస్వరూపబ్రహ్మ.

103 పరాత్పరః : పరమేశ్వరుడు.

104 పరేశః : సర్వోత్కృష్టశాసకుడు.

105 పారగః : మాయామయ జగత్తునకు వెలుపల నుండువాడు.

106 పారః : అంతకును నావల నుండు వాడు లేక భవసాగరమును దాటవలెనను కొనువారికి పొందదగిన పరమాత్ముడు.

107 సర్వదేవాత్మకః : సర్వ దేవతల హృదయములందు ఆత్మరూపమై యున్నవాడు.

108 పరః : సర్వోత్తముడు, ఆది దేవుడు, సనాతనుడు, అవ్యయుడు.

ఇవి శ్రీరామచంద్రుని 108 నామములు దేవీ ! ఈ నామములు అతి రహస్యమైనవి. కానీ స్నేహ వశముతో నేను వీనిని నీ యెదుట ప్రకటించితిని. భక్తితో ఈ నామములు పఠించువారు లేక వినువారు నూరు కోట్ల కల్పములందు చేసిన సమస్త పాపముల నుండి ముక్తి నొందెదరు.

పార్వతీ ! ఈ నామములను భక్తి భావముతో పఠించిన వారి కొరకు జలము కూడ స్థలమగును. శత్రువులు మిత్రులగుదరు. రాజు దాసుడగును. మండుచున్న అగ్ని చల్లబడును. సమస్త ప్రాణులు అనుకూలురగుదురు. చంచల లక్ష్మిస్థిరముగ నుండును. గ్రహములు అనుగ్రహముతో వ్యవహరించును. సమస్త ఉపద్రవములు శాంతించును. భక్తి భావముతో ఈ నామములను పఠించిన వారికి మూడు లోకములందున్న ప్రాణులు వశమగుదురు. మనస్సునందున్న కోరికలు ఈ నామకీర్తనతో తీరును. శ్యామ సుందరుడు, కమల నయనుడు, పీతాంబర ధారియగు శ్రీరామ భగవానుని ఈ దివ్య నామములతో స్తుతించిన వారు సంసార బంధనమున నెప్పుడును పడరు.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

రామునికి, రామ భద్రునికి, రామ చంద్రునికి, వేధకు, రఘునాథునికి, నాథునికి, సీతాపతికి నమస్కారము. దేవీ ! కేవలము ఈ మంత్రము రాత్రి పగలు జపించువారు సమస్త పాపముల నుండి ముక్తినొంది శ్రీ విష్ణు సాయుజ్యము నొందెదరు. నేను నీ యందలి ప్రేమతో శ్రీరామ చంద్ర భగవానుని వేదాను మోదిత మాహాత్మ్యమును వర్ణించితిని. ఇది పరమ కల్యాణ కారకమైనది''.

శంకర భగవానుని చే చెప్పబడిన పరమాత్మ శ్రీరామచంద్రుని మాహాత్మ్యమును వినిన పార్వతీ దేవి

''రామాయ రామభద్రాయ రామ చంద్రాయ వేధసే ।
రఘునాథాయ 'నాథాయ సీతాయాః పతయే నమః ॥

ఈ మంత్రమును సదా సర్వావస్థలయందును జపించుచు కైలాసమందు తన పతితో సుఖముగ నుండసాగెను.

అని వసిష్ఠుల వారు దిలీప మహారాజుతో చెప్పుచు ''రాజా! నేను నీకు పరమ రహస్యమైన విషయమును చెప్పితిని. భక్తితో దీనిని చదివినగాని, వినినగాని, మానవులు సమస్త కర్మ బంధముల నుండి ముక్తులై పరమ పదమును పొందెదరు.

రాజా ! మీ కులమందు ( వంశము) పురాణ పురుషోత్తము డగు శ్రీహరి సమస్త లోకముల మేలుకోరి 'దశరథ నందన రూపముతో అవతరించును. కావున నీవు ధన్యుడవు. అందుచేత ఇక్ష్వాకు వంశీయ క్షత్రియులు దేవతలందరికి పూజనీయులు'' అని ఇక్ష్వాకు వంశమును ప్రశంసించెను.

**శ్రీరామాష్టోత్తర శతనామ వివరణ సంపూర్ణము**

# శ్రీరామ శతనామ స్తోత్ర వివరణ

శంభు రువాచ :

రాఘవం కరుణాకరం భవనాశనం దురితాప హమ్ ।
మాధవం ఖగగామినం జలరూపిణం పరమేశ్వరమ్ ॥
పాలకం జనతారకం భవహారకం రిపుమారకమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 1

రఘు వంశమందు జన్మించిన వాడు, కరుణానిధి, భవనాశకుడు, పాపములను హరించు వాడు, లక్ష్మీపతి, గరుడ వాహనుడు, జలరూపుడు, జగత్తును పాలించు వాడు, భక్త జనోద్ధారకుడు, భవబంధములను తొలగించువాడు, శత్రు సంహారకుడు, నరరూపధారియు జగదీశ్వరుడగు రఘునందనుని భజించుచున్నాను.

భూధవం వనమాలినం ఘనరూపిణం ధరణీధరమ్ ।
శ్రీహరిం త్రిగుణాత్మకం తులసీధవం మధుర స్వరమ్॥
శ్రీకరం శరణప్రదం మధు మారకం వ్రజపాలకమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 2

పృథివీపతి, వనమాలను ధరించిన వాడు, నీల మేఘ శ్యాముడు, ధరణీధరుడు, త్రిగుణాత్మకుడు, శ్రీహరి, తులసీపతి, మధురమైన స్వరము గలవాడు, శోభను విస్తరింపజేయువాడు, శరణదాత, మధువను దైత్యుని వధించిన వాడు, వ్రజపాలకుడు, నరరూపధారి, జగదీశ్వరుడైన రఘునందనుని భజించుచున్నాను.

విట్ఠలం మధురాస్థితం రజకాన్తకం గజ మారకమ్ ।
సన్నుతం బకమారకం వృషఘాతకం తురగార్దనమ్ ॥
నందజం వసుదేవజం బలియజ్ఞగం సురపాలకమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 3

విట్ఠల రూపముతో మధుర యందున్నవాడు, రజకుని (చాకలి ) సంహరించిన వాడు, కువలయాపీడమను గజమును వధించినవాడు, సత్పురుషులచే స్తుతింప బడువాడు, బకాసురుని, వృషాసురుని, అశ్వరూప ధారియగు కేశియను రాక్షసుని వధించిన వాడు, నంద కుమారుడు, వసుదేవ పుత్రుడు, బలియజ్ఞమునకు వెళ్ళినవాడు, దేవతలకు రక్షకుడు, మానవరూపము ధరించిన వాడు, జగదీశ్వరుడు నగు రఘునందనుని భజించుచున్నాను.

కేశవం కపివేష్టితం కపిమారకం మృగ మర్దినమ్ ।
సున్దరం ద్విజపాలకం దితిజార్దనం దనుజార్దనమ్ ॥
బాలకం ఖరమర్దనం ఋషి పూజితం ముని చిన్తితమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 4

కేశవుడు, కపిపరివేష్టితుడు, వాలియను వానరుని వధించిన వాడు, లేడి రూపము ధరించిన మారీచుని సంహరించిన వాడు, శోభాశాలి, ద్విజపాలకుడు, దైత్యదానవ సంహారకర్త, బాల రూపధారి, ఖరుడను రాక్షసుని వధించిన వాడు, ఋషులచే పూజింపబడువాడు, మునులచే ధ్యానింపబడువాడు, నరరూపము ధరించిన జగదీశ్వరుడు అయిన రఘునందనుని భజించుచున్నాను.

శంకరం జలశాయినం కుశబాలకం రథవాహనమ్ ।
సరయూనతం ప్రియ పుష్పకం ప్రియ భూసురం లవబాలకమ్ ॥
శ్రీధరం మధు సూదనం భరతాగ్రజం గరుడధ్వజమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 5

శుభకరుడు, జలమునందు శయనించు వాడు, కుశుడను పుత్రుడు కలవాడు, రథవాహనుడు, సరయూనదిచే నమస్కరింప బడిన వాడు, పుష్పక విమాన ప్రియుడు, బ్రాహ్మణ ప్రియుడు, లవుడను పుత్రుడు గలవాడు, వక్షః స్థలముపై లక్ష్మిని ధరించిన వాడు, మధువను రాక్షసుని సంహరించిన వాడు, భరతుని జ్యేష్ఠ సోదరుడు, గరుడ ధ్వజుడు, మానవ రూపము ధరించిన జగదీశ్వరుడు అయిన రఘునందనుని భజించుచున్నాను.

*గోప్రియం గురుపుత్రదం వదతాం వరం కరుణానిధిమ్ ।*
*భక్తపం జనతోషదం సురపూజితం శ్రుతిభిః స్తుతమ్ ॥*
*భుక్తిదం జనముక్తిదం జనరంజనం నృపనన్దనమ్ ।*
*త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 6*

గోప్రియుడు , యమలోకము నుండి గురుపుత్రుని తెచ్చి గురువునకు సమర్పించిన వాడు, వక్తలలో శ్రేష్ఠుడు, దయానిధి, భక్తరక్షకుడు, స్వజనులకు సంతోష మొసగినవాడు, దేవతలచే పూజింపబడువాడు, శ్రుతులచే స్తుతింపబడువాడు, భోగదాత, స్వజనులకు ముక్తి నొసగినవాడు, ప్రజలను సంతోషపెట్టువాడు, రాజకుమారుడు, మనుష్యరూపము ధరించిన జగదీశ్వరుడు అయిన రఘునందనుని భజించుచున్నాను.

*చిద్ఘనం చిరజీవినం మణిమాలినం వరదోన్ముఖమ్ ।*
*శ్రీధరం ధృతిదాయకం బలవర్ధనం గతి దాయకమ్ ॥*
*శాన్తిదం జనతారకం శరధారిణం గజగామినమ్ ।*
*త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 7*

చిద్ఘన స్వరూపుడు, చిరజీవి, మణిమాలను ధరించిన వాడు, వరమొసగుటకు ఉద్యుక్తుడై యుండు వాడు, సౌందర్య

శాలి, ధైర్యప్రదాత, బలవర్ధనుడు, మోక్షదాత, శాంతి దాయకుడు, భక్తులను తరింపజేయు వాడు, ముక్తి నొసగువాడు, బాణములు ధరించిన వాడు, గజముపై వెళ్ళువాడు, నరరూపము ధరించిన జగదీశ్వరుడు అయిన రఘునందనుని భజించుచున్నాను.

శార్ఙ్గిణం కమలాననం కమలాధ్విశం పద పంకజమ్ ।
శ్యామలం రవి భాసురం శశి సౌఖ్యదం కరుణార్ణవమ్ ॥
సత్పతిం నృపపాలకం నృపవన్దితం నృపతి ప్రియమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 8

శార్ఙ్గ మను ధనువు దాల్చిన వాడు, చరణములు, ముఖము కమలమువలె నుండు వాడు, లక్ష్మీదేవివైపు ధ్యాన పూర్వకముగ చూచువాడు, శ్యామ వర్ణ శరీరుడు, సూర్యునివలె దేదీప్య మానుడు, చంద్రునివలె సుఖప్రదాత, దయాసాగరుడు, శ్రేష్ఠుడైన ప్రభువు, రాజరక్షకుడు, రాజులచే పూజింపబడువాడు, రాజులకు ప్రియమైన వాడు, మానవ రూపము ధరించిన జగదీశ్వరుడు అయిన రఘునందనుని భజించుచున్నాను.

నిర్గుణం సుగుణాత్మకం నృపమండనం మతి వర్ధనమ్ ।
అచ్యుతం పురుషోత్తమం పరమేష్ఠినం స్మితభాషిణమ్ ॥
ఈశ్వరం హనుమన్నుతం కమలాధిపం జన సాక్షిణమ్ ।
త్వాం భజే జగదీశ్వరం నరరూపిణం రఘునందనమ్ ॥ 9

నిర్గుణుడు, సుగుణుడు, రాజభూషణుడు, బుద్ధి వర్ధకుడు, మర్యాదా పురుషోత్తముడు, పురుషశ్రేష్ఠుడు, బ్రహ్మ స్వరూపుడు, చిరునగవుతో మాటాడు వాడు, ఐశ్వర్యవంతుడు, హనుమంతునిచే స్తుతింపబడువాడు, లక్ష్మికి అధీనుడు, లోకసాక్షి

నరరూపము ధరించిన జగదీశ్వరుడు అయిన రఘునందనుని భజించుచున్నాను.

**ఈశ్వరోది తమే తదుత్తమ మాదరాచ్ఛుత నామకమ్ ।**
**యః పఠేద్ భువి మానవ స్తవ భక్తి మాంస్తప నోదయే ॥**
**త్వత్పదం నిజబన్ధు దారసుతై ర్యుత శ్చిరమే త్యనో ।**
**సోఽస్తుతే పదసేవ నే బహుతత్పరో మమవాక్యతః ॥ 10**

సూర్యోదయ కాలమందు శివునిచే చెప్పబడిన ఈ ఉత్తమ శతనామ స్తోత్రమును ఆదరముతో పఠించు వారికి రఘునందనునిపై భక్తి ఏర్పడును. నేను చెప్పిన విధముగ వారు బంధువులు, భార్యాపుత్రులతో కలసి నాలోకమునకు వచ్చి చిరకాలము వరకు రఘునందనుని సేవాతత్పరులగుదురు.

(ఆనంద రామాయణము, పూర్ణ కాండము షష్ఠసర్గము)

**శ్రీరామ శతనామ స్తోత్ర వివరణ సంపూర్ణము.**

# శ్రీరామ స్తోత్ర వివరణ

రావణ సంహారానంతరము సీత పవిత్రతను లోకమునకు తెలుపుటకై శ్రీరాముడు సీతను పరిత్యజించెను. అది భరించలేని సీత అగ్నిప్రవేశము చేయు సందర్భమున దేవతలందరు లంకకు వచ్చి ''శ్రీరామా ! సర్వజ్ఞుడవై దేవతలలో శ్రేష్ఠుడైన విష్ణుమూర్తివై యుండి అగ్ని ప్రవేశము చేయుచున్న సీతను సాధారణ మానవుని వలె నెట్లు చూచుచుంటివి ? త్రిలోకములకు ఆదికర్తవై, సృష్టికి ఆది మధ్యాంతములైన మీరు ఒక సాధారణ మనుష్యుని వలె ఎట్లు ఉపేక్షించుచుంటిరి ?'' అని దేవతలందరు అడుగగా శ్రీరాముడు వారితో నిట్లనెను.

''దేవతలారా ! నేను నన్ను దశరథపుత్రుడైన రామునిగా మానవునిగా భావించు చుంటిని. నేను ఎవరో ఎక్కడ నుండి వచ్చితినో అంతయు మీరే నాకు చెప్పుడు''. అంత శ్రీరఘునాథునితో బ్రహ్మ దేవుడు ''రఘువీరా ! సత్యమును వినుము.

**భవాన్ నారాయణోదేవః శ్రీమాంశ్చక్రాయుధః ప్రభుః।**
**ఏకశృంగో వరాహస్త్వం భూతభవ్యసపత్నజిత్॥ 1**

చక్రము ధరించిన సర్వసమర్థుడవు, శ్రీనారాయణ భగవానుడవు, ఒకే కోరపై పృథ్విని ధరించిన వరాహరూపుడవు, భూత భవిష్యత్తులు తెలిసిన వాడవు, శత్రువులను జయించు వాడవు నీవే.

అక్షరం బ్రహ్మ సత్యంచ మధ్యే చాన్తేచ రాఘవ ।
లోకానాం త్వం పరోధర్మో విష్వక్సేనశ్చతుర్భుజః ॥ 2

రఘునందనా ! నీవు అవినాశి పరబ్రహ్మవు. సృష్టి ఆది అంత మధ్యములందు సత్య రూపమున నున్న వాడవు. లోకములకు పరమ ధర్మమవు, విష్వక్సేనుడవు, చతుర్భుజ ధారి శ్రీహరివి నీవే.

శార్ఙ్గ ధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః ।
అజితః ఖడ్గధృగ్ విష్ణుః కృష్ణశ్చైవ బృహద్బలః ॥ 3

శార్ఙ్గ ధనుర్ధారివి, హృషీకేశుడవు, అంతర్యామి పురుషుడవు, పురుషోత్తముడవు, అపరాజితుడవు, నందక ఖడ్గము ధరించిన విష్ణుడవు, మహాబల సంపన్నుడగు కృష్ణుడవు నీవే.

సేనా నీర్గ్రామణీశ్చత్వం బుద్ధిః సత్యం క్షమాదమః ।
ప్రభవశ్చాప్యయశ్చ త్వము పేన్ద్రో మధుసూదనః ॥ 4

దేవసేనాపతివి, దివ్యజన పదాది పాలకుడవు, బుద్ధి, సత్యము, క్షమ, ఇంద్రియనిగ్రహము, సృష్టి ప్రళయ కారణుడవు, వామనుడవు, మధుసూదనుడవు నీవే.

ఇన్ద్ర కర్మామహేన్ద్ర స్త్వం పద్మనాభోరణాన్తకృత్ ।
శరణ్యం శరణం చత్వామాహుర్దివ్యా మహర్షయః ॥ 5

ఇంద్రుని కర్మవంటి కర్తవ్యము నొనర్చువాడవు, నిరతిశయైశ్వర్య సంపన్నుడవు, యుద్ధమున శత్రునాశమొనర్చివాడవు, పద్మనాభుడవు, మహర్షి గణములచే శరణదాత, శరణోపాయముగ పిలువబడు వాడవు నీవే.

సహస్ర శృంగో వేదాత్మా శత శీర్షో మహర్షభః ।
త్వం త్రయాణాం హి లోకానామాది కర్తాస్వయం ప్రభుః ॥ 6

సహస్ర శృంగములు గలవాడవు, శతశిరస్సులు గల వాడవు, వేదరూప మహా వృషభుడవు, త్రిలోకములకు ఆదికర్తవు, స్వయముగా ప్రభువైన వాడవు నీవే.

సిద్ధానా మపిసాధ్యానా మాశ్రయశ్చాసి పూర్వ జః ।
త్వంయజ్ఞ స్త్వం వషట్ కారస్త్వ మోంకారః పరాత్పరః ॥ 7

సిద్ధులకు సాధ్యులకు నాశ్రయుడవు, అందరికన్న ముందు జన్మించిన వాడవు, యజ్ఞము నీవే అందుపయుక్తములగు వషట్కార ఓంకార రూపుడవు, సర్వ శ్రేష్ఠ పరమాత్మవు నీవే.

ప్రభవం నిధనం చాపి నో విదుః కోభవాని తి ।
దృశ్యసే సర్వ భూతేషు గోషుచ బ్రాహ్మణేషుచ ॥ 8

మీ ఆవిర్భావ తిరోభావములను ఎవరును ఎరుగరు, మీరు ఎవరో కూడ ఎవరికి తెలియదు. సమస్త ప్రాణుల యందు, గోవులయందు, బ్రాహ్మణుల యందు కనుపించు వారు మీరే.

దిక్షు సర్వాసుగగనే పర్వతేషు నదీషుచ ।
సహస్ర చరణః శ్రీమాన్ శతశీర్షః సహస్రదృక్ ॥ 9

సమస్త దిశలయందు, ఆకాశమందు, పర్వతములందు, నదులయందు, మీ శక్తి యున్నది. సహస్ర చరణములు, శత మస్తకములు సహస్ర నేత్రములు గలవాడవు నీవే.

త్వం ధారయసి భూతాని పృథివీం సర్వ పర్వతాన్ ।
అన్తే పృథివ్యాః సలిలే దృశ్య సే త్వం మహోరగః ॥ 10

సమస్త ప్రాణులను, భూమిని, సమస్త పర్వతములను ధరించిన వాడవు, భూమ్యంత మందు, జలము నందు మహా సర్పమైన శేషుని రూపమున కనిపించు వాడవు నీవే.

*త్రీంల్లోకాన్ ధారయన్ రామ దేవ గన్ధర్వదానవాన్ ।*
*అహంతే హృదయం రామ జిహ్వాదేవీ సరస్వతీ ॥* 11

శ్రీరామా ! త్రిలోకములను, దేవతలను, గంధర్వులను, దానవులను ధరించిన విరాట్ పురుషనారాయణుడవు నీవే. అందరి హృదయముల యందు రమించు పరమాత్మా ! నేను బ్రహ్మను నీ హృదయమునై యున్నాను. సరస్వతీ దేవి నీ జిహ్వయై యున్నది.

*దేవా రోమాణి గాత్రేషు బ్రహ్మణా నిర్మితాః ప్రభో ।*
*నిమేషస్తే స్మృతా రాత్రి రున్మే షోదిన స్తథా ॥* 12

ప్రభూ! నేను ( బ్రహ్మ) సృష్టించిన ఈ సమస్త దేవతలు మీ విరాట్ దేహమందు రోమములై యున్నారు. నీ నేత్రములు మూసినపుడు రాత్రియు, తెరచునపుడు పగలును ఏర్పడుచున్నవి.

*సంస్కారా స్త్వభవన్ వేదా నైత దస్తిత్వయా వినా ।*
*జగత్ సర్వంశరీరం స్థైర్యతే వసుధాతలం ॥* 13

వేదములు నీ సంస్కారములు, నీవు లేనిచో ఈ జగత్తునకు అస్తిత్వము లేదు. సమస్త విశ్వము నీ శరీరము. పృథ్వి స్థిరత్వము ేలోనున్నది.

*అగ్నిః కోపః ప్రసాదసే సోమః శ్రీవత్సలక్షణః ।*
*త్వయాలోకాస్త్రయః క్రాన్తాః పురా స్వైర్విక్రమైస్త్రిభిః ॥* 14

అగ్ని నీ కోపము, చంద్రుడు ప్రసన్నత్వము, వక్షః స్థల ుందు శ్రీవత్స చిహ్నము ధరించిన విష్ణు భగవాను డవు నీవే. ూర్వకాలమున ( వామనావతార సమయమున) మూడు ాదములతో మూడు లోకములను కొలచిన వాడవు నీవే.

మహేంద్రశ్చ కృతో రాజాబలింబద్వా సుదారుణమ్ ।
సీతాలక్ష్మీ ర్భ వాన్ విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః ॥ 15

దైత్యరాజు బలిని బంధించి ఇంద్రుని త్రిలోకములకు రాజుగా నియమించితివి. సీత సాక్షాత్తు లక్ష్మి. నీవు విష్ణు భగవానుడవు, సచ్చిదానంద స్వరూపుడవు, కృష్ణుడవు, ప్రజాపతి కూడ నీవే.

యదర్థేరావణ స్యేహ ప్రవిష్టోమాను షీత నుమ్ ।
తదిదం నస్త్వ యా కార్యంకృతం ధర్మ భృ తాం వర ॥ 16

ధర్మ ధారక శ్రేష్ఠ ! రావణుని వధించుటకై ఈలోకమున మానవ శరీరమందు ప్రవేశించి మాకార్యమును నెరవేర్చితివి.

నిహతో రావణో రామ ప్రహృష్టో దివ మాక్రమ ।
అమోఘం దేవ వీర్యే తే నతేఽమోఘాః పరాక్రమాః ॥ 17

శ్రీరామా ! రావణుని సంహరించితివి. ఇంక నీ దివ్యధామమున ప్రవేశింపుము. నీ బలము అమోఘమైనది. నీ పరాక్రమము వ్యర్థమగునది కాదు.

అమోఘం దర్శనం రామ అమోఘస్తవ సంస్తవః ।
అమోఘాస్తే భవిష్యన్తి భక్తి మన్తో నరా భువి ॥ 18

శ్రీరామా ! మీ దర్శనము అమోఘము . మీ స్తవనము అమోఘము. మీయందు భక్తిగల మనుష్యులు కూడ ఈ భూమండలమందు అమోఘముగ నుందురు.

యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమమ్ ।
ప్రాప్నువన్తి తథా కామా నిహ లోకే పరత్ర చ ॥ 19

పురాణ పురుషోత్తముడవు, దివ్యరూపధారివి, పరమ ... నగు నీయందు భక్తి గలిగి యుండువారికి ఈలోకమందును, పరలోకమందును కోరిన వన్నియు ప్రాప్తించును.

ఇమ మార్షం స్తవం దివ్యమితి హాసం పురాతనమ్ ।
యే నరాః కీర్తయిష్యన్తి నాస్తి తేషాం పరాభవః ॥ 20

పరమ ఋషి వేద సమ్మితమై బ్రహ్మదేవునిచే ... ఈదివ్య స్తోత్రము పురావృత్తప్రతిపాదకము. అనాది సిద్ధ ... విద్యాప్రతి పాదకము . దీనిని కీర్తించు వారికి ఎప్పుడును పరాభవము (పునరావృత్తి) లేదు.

ఇది శ్రీమద్వాల్మీకి రామాయణములోని యుద్ధకాండ మందలి బ్రహ్మకృత శ్రీరామ స్తవముగల 120 వ అధ్యాయము (13 నుండి 32 శ్లోకముల వరకు).

శ్రీరామ స్తోత్ర వివరణ సంపూర్ణము.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీరామ రక్షా స్తోత్ర వివరణ

అస్య శ్రీరామ రక్షా స్తోత్ర మన్త్ర స్య బుధ కౌశిక ఋషిః.
శ్రీ సీతారామ చన్ద్రో దేవతా. అను ష్టుప్ ఛన్దః. సీతా శక్తి ః.
శ్రీమాన్ హనుమాన్ కీలకం. శ్రీరామ చన్ద్ర ప్రీత్యర్థే
రామ రక్షా స్తోత్ర జపే వినియోగః

ధ్యానమ్:

ధ్యాయేదాజాను బాహుం ధృత శరధనుషం బద్ధ పద్మాసన స్థం
పీతం వాసోవసానం నవకమలదల స్పర్థి నేత్రం ప్రసన్న మ్ ।
వామాంకా రూఢ సీతా ముఖకమల మిలల్లోచనం నీరదాభం
నానాలంకార దీప్తం దధతమురు జటామండలం రామచన్ద్రమ్॥

ధనుర్బాణములు ధరించిన వాడు, పద్మాసనము నుండి విరాజిల్లు వాడు, పీతాంబరములు ధరించిన వాడు, నవకమల దళములను పోలు నేత్రములతో ప్రసన్నముగ వామ భాగమున నున్న శ్రీసీతాదేవి ముఖకమలమును వీక్షించువాడు, ఆజాను బాహుడు, మేఘశ్యాముడు, నానా లంకార విభూషితుడు , విశాల జటాజూటధారి అయిన శ్రీరామ చంద్రుని ధ్యానించుచున్నాను.

స్తోత్రమ్ :

చరితం రఘునాథ స్య శతకోటి ప్రవిస్తరమ్ ।
ఏకైక మక్షరం పుంసాం మహాపాతక నాశనమ్ ॥ 1

శ్రీరఘునాథుని చరిత్ర శతకోటిగా విస్తరించి యున్నది. అందు ఒక్కొక్క అక్షరము మనుష్యుల మహాపాపములను నశింపజేయును.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

ధ్యాత్వా నీలోత్పల శ్యామం రామం రాజీవ లోచనమ్ ।
జానకీ లక్ష్మణోపేతం జటాముకుట మండితమ్ ॥ 2

రాముడు నీల కమల దళములవలె శ్యామ వర్ణము గలవాడు, కమల నయనుడు, సీతాలక్ష్మణ సహితుడు, జటామకుట శోభితుడు.

సాసితూణ ధనుర్బాణ పాణిం నక్తం చరాన్తకమ్ ।
స్వలీల యా జగత్త్రాతు మావిర్భూతమ జం విభుమ్ ॥ 3

హస్తములందు ఖడ్గము, తూణీరము (అమ్ములపొది) ధనుర్బాణములు ధరించి రాక్షసులను సంహరించు వాడు, జగత్ రక్షణకు తన లీలతో అవతరించిన వాడు.

రామ రక్షాం పఠే త్ప్రాజ్ఞః పాప ఘ్నీం సర్వకామదామ్ ।
శిరోమే రాఘవః పాతు ఫాలం దశరథాత్మజః ॥ 4

సర్వవ్యాపకుడు, సీతాలక్ష్మణయుక్తుడగు రఘురాముని స్మరించి రామరక్షాస్తోత్రమును ప్రాజ్ఞులు పఠించిన పాపములు నశించి సమస్తకాంక్షలు తీరును . నా శిరస్సును రాఘవుడు, లలాటమును దశరథాత్మజుడు రక్షించు గాక.

కౌసల్యేయో దృశౌపాతు విశ్వామిత్ర ప్రియః శ్రుతీ ।
ఘ్రాణం పాతు మఖ త్రాతా ముఖం సౌమిత్రి వత్సలః ॥ 5

కౌసల్యా నందకుడు నేత్రములను రక్షించుగాక, విశ్వామిత్ర ప్రియుడు కర్ణములను రక్షించుగాక, యజ్ఞ రక్షకుడు నాసికను, సౌమిత్రివత్సలుడు ముఖమును రక్షించుగాక.

జిహ్వాం విద్యానిధిః పాతు కంఠం భరత వన్దితః ।
స్కన్ధౌ దివ్యాయుధఃపాతు భుజౌ భగ్నే శ కార్ముకః ॥ 6

విద్యానిధి నాజిహ్వను, కంఠమును భరత వందితుడు, దివ్యాయుధములను దాల్చువాడు భుజాపురములను, భగ్నేశ

కార్ముకుడు (మహేశ్వరుని ధనస్సు విరచిన వాడు) భుజములను రక్షించు గాక.

కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్య జిత్ ।
మధ్యం పాతు ఖర ధ్వంసీ నాభిం జాంబవదా శ్రయః ॥ 7

కరములను సీతాపతి, హృదయమును జామదగ్న్య జిత్తు (పరశు రాముని జయించిన వాడు); మధ్యభాగమును ఖరధ్వంసి (ఖరుడను రాక్షసుని వధించిన వాడు), నాభిని జాంబవదా శ్రయుడు (జాంబవంతునికి ఆశ్రయమిచ్చిన వాడు) రక్షించుగాక.

సుగ్రీవేశః కటీ పాతు సక్థినీ హనుమ త్ప్రభుః ।
ఊరూ రఘూత్తమః పాతు రక్షః కులవినాశకృత్ ॥ 8

నడుమును సుగ్రీవేశుడు (సుగ్రీవుని స్వామి), ఊరువులను హనుమత్ప్రభువును, తొడలను రాక్షసకుల వినాశకుడు రఘుశ్రేష్ఠుడు రక్షించుగాక.

జానునీ సేతు కృత్పాతు జంఘే దశము ఖాన్తకః ।
పాదావిభీషణ శ్రీదః పాతు రామోఽ ఖిలంవపుః ॥ 9

మోకాళ్ళను సేతుపతి, తొడలను దశముఖాంతకుడు (రావణుని వధించిన వాడు), చరణములను విభీషణునకు ఐశ్వర్యము నొసగిన వాడు, సమస్త శరీరమును శ్రీరాముడు రక్షించుగాక.

ఏతాం రామ బలోపేతాం రక్షాం యః సుకృతీ పఠేత్ ।
సచిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ॥ 10

రామబల సంపన్నమైన ఈ రక్షా స్తోత్రమును ఏ పుణ్యవంతుడు పఠించునో వాడు దీర్ఘాయువై వినయ సంపన్నుడై పుత్రులతో సుఖించును.

పాతాల భూతల వ్యోమ చారిణ శ్చద్మ చారిణః ।
నద్రష్టు మపి శక్తా స్తే రక్షితం రామ నామభిః ॥ 11

పాతాళమందును, భూమి యందును, ఆకాశమందును, మారువేషమున సంచరించు జీవులు రామనామముతో సురక్షితులైన వారిని కన్నెత్తి చూడలేరు.

రామేతి రామ భద్రేతి రామ చన్ద్రేతి వా స్మరన్ ।
నరో న లిప్యతే పాపై ర్భుక్తిం ముక్తిం చవిన్దతి ॥ 12

రామ అని, రామభద్ర అని, రామచంద్ర అని రాముని స్మరించు వానిని పాపములంటవు. అతడు భుక్తిని, ముక్తిని పొందును.

జగజ్జై త్రై కమంత్రేణ రామ నామ్నా భి రక్షితమ్ ।
యః కంఠే ధార యేత్తస్య కరస్థాః సర్వ సిద్ధయః ॥ 13

జగత్తును జయించ వలెనను వారు ఒకే ఒక మంత్రమైన రామ నామముతో సురక్షితమైన ఈ స్తోత్రమును కంఠస్థము చేసిన సర్వసిద్ధులు వాని హస్తగతములగును.

వజ్ర పంజర నామేదం యో రామ కవచం స్మరేత్ ।
అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయ మంగళమ్ ॥ 14

వజ్ర పంజర నామకమగు ఈరామ కవచమును స్మరించు వాని ఆజ్ఞోల్లంఘనము ఎక్కడను జరగదు. వానికి సర్వత్ర జయము శుభము గలుగును.

ఆదిష్ట వా న్యథా స్వప్నే రామ రక్షామి మాం హరః ।
తథా లిఖితవా న్ప్రాతః ప్రబుద్ధో బుధ కౌశిక ః ॥ 15

స్వప్నమందు శ్రీశంకరుడు ఈరామ రక్షా స్తోత్రమును ఆదేశించిన విధముగ ప్రాతః కాలము మేల్కొనగనే బుధ కౌశికుడు లిఖించెను.

ఆరామః కల్ప వృక్షాణాం విరామః సకలాపదామ్ ।
అభిరామ స్త్రిలోకానాం రామః శ్రీమా న్న నః ప్రభుః ॥16

కల్ప వృక్షములకే తోట అయిన వాడు, సమస్త ఆపదలను అంతముచేయు వాడు, త్రిలోకములందును పరమ సుందరుడు అయిన శ్రీరాముడు మా ప్రభువు.

తరుణౌ రూప సంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ।
పుండరీక విశాలాక్షౌ చీర కృష్ణాజినాంబ రౌ ॥ 17

సుకుమార తరుణ రూపులు, మహాబలవంతులు, కమల విశాల నేత్రులు, చీరకృష్ణ మృగచర్మధారులు.

ఫలమూలాశినౌ దాన్తౌ తాపసౌ బ్రహ్మచారి ణౌ ।
పుత్రౌ దశరథ స్యైతౌ భ్రాత రౌ రామలక్ష్మణౌ ॥ 18

ఫలమూలములు భుజించు వారు, ఇంద్రియ నిగ్రహము గలవారు, తపస్వులు, బ్రహ్మచారులు అగు వీరు దశరథ పుత్రులు, సోదరులగు రామ లక్ష్మణులు.

శరణ్యౌ సర్వ సత్త్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మ తామ్ ।
రక్షః కుల నిహన్తా రౌ త్రాయే తాం నో రఘూత్తమౌ ॥ 19

సమస్త జీవులకు శరణమగు వారు, సమస్త ధనుర్ధా రులలో శ్రేష్ఠులు, రాక్షసకుల నాశకులు అయిన రఘుశ్రేష్ఠులు మమ్ము రక్షించుదురు గాక.

ఆత్త సజ్య ధనుషౌ విషు స్పృశా వక్షయాశుగని షంగ సంగినౌ।
రక్షణాయ మమరామ లక్ష్మణా వగ్రతః పథి సదైవ గచ్ఛతామ్ ॥ 20

అక్షయ బాణములతో నిండియున్న అమ్ముల పొదులతో నున్న రామలక్ష్మణులు బాణము పట్టి ధనస్సు సంధించి నన్ను రక్షించుటకు సదామార్గమందు నాకుముందు నడువ వలెను.

సన్నద్ధః కవచీఖడ్గీ చాప బాణ ధరోయువా ।
గచ్ఛన్మ నోరథాన్న శ్చరామః పాతు సలక్ష్మణః ॥ 21

సర్వ సన్నద్ధుడు, కవచము ఖడ్గము ధను ర్బాణములు ధరించి యుండువాడు, యువకుడు లక్ష్మణ సహితుడైన రాముడు నామనో రథము లీడేర్చ వలెను.

రామో దాశరథిః శూరో లక్ష్మణాను చరో బలీ ।
కాకుత్థ్సః పురుషః పూర్ణః కౌసల్యేయో రఘూత్తమః ॥ 22

రాముడు, దాశరథి, శూరుడు, లక్షణాను చరుడు, బలవంతుడు, కాకుత్థ్సుడు, పూర్ణ పురుషుడు, కౌసల్యా కుమారుడు రఘూత్తముడు.

వేదాన్త వేద్యో యజ్ఞేశః పురాణ పురుషోత్తమః ।
జానకీ వల్లభః శ్రీమాన ప్రమేయ పరాక్రమః ॥ 23

వేదాంత వేద్యుడు, యజ్ఞేశుడు, ఊహింప శక్యముగాని పురాణ పురుషోత్తముడు, జానకీ వల్లభుడు, శ్రీమంతుడు, ఊహింపశక్యముగాని పరాక్రమవంతుడు.

ఇత్యేతాని జపన్నిత్యం మద్భక్తః శ్రద్ధ యాన్వితః ।
అశ్వమేధాధికం పుణ్యం సంప్రాప్నోతి న సంశయః ॥ 24

ఈ నామములను నిత్యము శ్రద్ధగ జపించిన నా భక్తుడు అశ్వమేధ యజ్ఞఫలము కంటె అధిక ఫలమును పొందును. ఇందు ఎట్టి సంశయము లేదు.

రామం దూర్వాదల శ్యామం పద్మాక్షం పీతవాససమ్ ।
స్తువన్తి నామాభి ర్దివ్యై ర్న తే సంసారిణో నరాః ॥ 25

గరికపోచలవలె శ్యామవర్ణుడు, పద్మముల వంటి కన్నులు గలవాడు, పీతాంబర ధారియగు రాముని దివ్యనామములతో స్తోత్రము చేయు నరులు సంసారబద్ధులు గారు.

రామం లక్ష్మణ పూర్వజం రఘువరం సీతాపతిం సున్దరం
కాకుత్స్థం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్ ।
రాజేన్ద్రం సత్య సంధం దశరథ తనయం శ్యామలం శాన్తమూర్తిం
వన్దేలోకాభిరామంరఘుకుల తిలకం రాఘవం రావణారిమ్ ॥ 26

రఘు కులమందు శ్రేష్ఠుడు, లక్ష్మణుని కంటె పెద్దవాడు. సీతాపతి, అతి సుందరుడు, కకుత్ష్ఠకుల నందనుడు, కరుణా సాగరుడు, గుణనిధి, విప్రప్రియుడు, పరమ ధార్మికుడు, రాజ రాజేశ్వరుడు, సత్యనిష్ఠుడు, దశరథ తనయుడు, శ్యామల శాన్తమూర్తి, సర్వలోక సుందరుడు, రఘుకుల తిలకుడు, రాఘవుడు,రావణ సంహారి అయిన రామునకు వందనములు.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘు నాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥ 27

రామునకు, రామ భద్రునికి, రామచంద్రునికి, విధాత్ర స్వరూపునికి, రఘునాథునికి, ప్రభువునకు, సీతాపతికి నమస్కారము.

శ్రీరామ రామ రఘునందన రామ రామ
శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ ।
శ్రీరామ రామ రణ కర్కశరామ రామ
శ్రీరామ రామ శరణం భవ రామ రామ ॥ 28

శ్రీరామా! రామా! రఘునందనా శ్రీరామా! రామా! భరతాగ్రజా శ్రీరామా! రామా, రామా, రణ ధీరా రామా రామా శ్రీరామా ! రామా! రామా! రామా శరణగుము.

శ్రీరామచన్ద్ర చరణౌ మనసా స్మరామి
శ్రీరామచన్ద్ర చరణౌ వచసా గృణామి।
శ్రీరామచన్ద్ర చరణౌ శిరసానమామి
శ్రీరామచన్ద్ర చరణౌ శరణం ప్రపద్యే ॥ 29

నేను శ్రీరామ చంద్రుని చరణములను మనసా స్మరించు చున్నాను. శ్రీరామచంద్రుని చరణములను గానము చేయుచున్నాను. శ్రీరామ చంద్రుని చరణములకు శిరస్సువంచి నమస్కరించుచున్నాను. శ్రీరామ చంద్రుని చరణములను శరణు వేడుచున్నాను.

మాతారామో మత్పితా రామ చన్ద్రః
స్వామి రామో మత్సఖా రామ చన్ద్రః।
సర్వస్వం మే రామచన్ద్రో దయాలు -
ర్నాన్యం జానే నైవ జానే న జానే ॥ 30

రాముడే నా తల్లి, రాముడే నా తండ్రి, రాముడే నా స్వామి, రాముడే నా మిత్రుడు. దయామయుడైన రామచంద్రుడే నా సర్వస్వము. రాముని తప్ప అన్యులను నే నెరుగను, ఎరుగను. ఎరుగను.

దక్షిణే లక్ష్మణో యస్యవామే చ జనకాత్మజా।
పురతో మారుతిర్యస్య తం వన్దే రఘు నన్దనమ్ ॥ 31

కుడి వైపు లక్ష్మణుడు, ఎడమ వైపు జానకి, ఎదుట హను మానుడు విరాజిల్లుచున్నట్టి రఘునాథునకు నా వందనములు.

లోకాభిరామం రణరంగ ధీరం
రాజీవ నేత్రం రఘువంశనాథమ్।
కారుణ్యరూపం కరుణాకరం తం
శ్రీరామ చన్ద్రం శరణం ప్రపద్యే ॥ 32

లోకాభి రాముడు, రణరంగ ధీరుడు, రాజీవ నేత్రుడు,

రఘువంశ నాథుడు, కారుణ్యరూపుడు, కరుణాకరుడు అయిన శ్రీరామ చంద్రుని శరణు వేడుచున్నాను.

మనోజవం మరుతతుల్య వేగం
జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానర యూథ ముఖ్యం
శ్రీరామ దూతం శరణం ప్రపద్యే ॥ 33

మనస్సుతో సమానమగు వేగము గలవాడు, జితేంద్రియుడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, వానరాగ్ర గణ్యుడు, పవన నందనుడగు శ్రీరామదూతను శరణు వేడుచున్నాను.

కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం వన్దే వాల్మీకి కోకిలమ్ ॥ 34

కవితయను కొమ్మపై కూర్చుండి మధురాక్షరమగు ''రామ - రామ'' యను నామమును మధురముగా కూయుచున్న వాల్మీకి కోకిలకు వందనములు.

ఆపదా మప హర్తారం దాతారం సర్వ సంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్ ॥35

ఆపదలను హరించువాడు, సర్వ సంపదలొసగువాడు, లోకాభి రాముడు అయిన శ్రీరామునకు పదే పదే నమస్కారములు.

భర్జనం భవబీజా నామర్జనం సుఖ సంపదామ్ ।
తర్జనం యమ దూతానాం రామరామేతి గర్జనమ్ ॥ 36

రామ రామ అని ఘోషించుట సర్వ సంసార బీజములను వేయించు నది, సమస్త సుఖ సంపదలను ప్రాప్తింపజేయునది, యమ దూతలను భయపెట్టునది అయియున్నది.

రామో రాజమణిః సదావిజయతే రామం రమేశం భజే
రామేణాభి హతా నిశాచర చమూ రామాయ తస్మై నమః ।
రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోఽస్మ్యహం
రామే చిత్తలయః సదా భవతు మే భో రామ మా ముద్ధర ॥ 37

రాజులలో శ్రేష్ఠుడైన శ్రీరాముడు సదా విజయి అయియున్నాడు. లక్ష్మీపతి రాముని భజించు చున్నాను. సమస్త రాక్షస సేన ధ్వంసము రామునిచే చేయబడినది. ఆ రామ చంద్రునకు నమస్కారము. రాముని మించిన ఆశ్రయము మరి లేదు. నేను ఆ రామ చంద్రుని దాసుడను. నా చిత్తము సదా రాముని యందే లీనమై యుండుగాక. రామా ! నన్నుద్ధరించుము.

( శ్రీ మహేశ్వరుడు పార్వతితో చెప్పినది)

రామ రామేతి రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥ 38

హే సుముఖీ । రామనామము విష్ణు సహస్ర నామముతో సమానమైనది. నేను సర్వదా రామ రామ రామ యని మనస్సును రంజింపజేయు రామనామ మందే రంజిల్లు చున్నాను.

ఇతి శ్రీ బుధ కౌశికముని విరచితం
శ్రీరామ రక్షాస్తోత్రం సంపూర్ణమ్ । 39

అని శ్రీ బుధ కౌశికముని విరచితమగు శ్రీరామ రక్షా స్తోత్రము సంపూర్ణము.

# శ్రీరామ చన్ద్ర స్తుతి వివరణ

నమామి భక్త వత్సలం కృపాలు శీల కోమలం
భజామి తే పదాంబుజం అకామినాం స్వధా మదమ్
నికామ శ్యామ సుందరం భవాంబునాథ మందరం
ప్రఫుల్ల కంజలోచనం మదాది దోష మోచనమ్ 1

భక్త వాత్సలా ! హేకృపాళూ ! అతి కోమల స్వభావా ! నీకు నమస్కారము చేయు చున్నాను. నిష్కాములకు నీ పరమధామము నొసగు నీ చరణములను భజించు చున్నాను. మిక్కిలి శ్యామ వర్ణముతో సుందరుడవు, సంసార సముద్రమును మధించుటకు మందరాచలము వంటి వాడవు, వికసించిన కమల సమాన నేత్రుడవు, మదాది దోషములను తొలగించు వాడవు.

ప్రలంబ బాహు విక్రమం ప్రభో ౭ ప్రమేయ వైభవం
నిషంగ చాప సాయకం ధరం త్రిలోకనాయకమ్
దినేశ వంశ మండనం మహేశ చాప ఖండనం
మునీంద్ర సంతరంజనం సురారి బృంద భంజనమ్ 2

ప్రభూ ! బలిష్ఠములు, ఆజానువులగు బాహువుల పరాక్రమముగల వాడవు, అప్రమేయమగు నైశ్వర్యము గల వాడవు, ధనుర్బాణ ధారివి, త్రిలోక స్వామివి, సూర్యవంశ భూషణుడవు, శివధనస్సును విరచిన వాడవు, ముని రాజులను, సజ్జనులను ఆనంద పరచిన వాడవు, దేవతల శత్రువులైన అసురులను నశింపజేసిన వాడవు.

మనోజవైరి వందితం అజాది దేవ సేవితం
విశుద్ధ బోధ విగ్రహం సమస్త దూషణాపహమ్
నమామి ఇందిరా పతిం సుఖాకరం సతాంగతిం
భజే స శక్తి సానుజం శచీపతి ప్రియానుజమ్ 3

మన్మథుని శత్రువగు మహేశ్వరునిచే ఆరాధింపబడు వాడవు, బ్రహ్మాది దేవతలచే సేవింపబడు వాడవు, విశుద్ధ జ్ఞానమయ విగ్రహము గల వాడవు, సమస్త దోషములను నశింప జేయు వాడవు. లక్ష్మీపతీ! సుఖనిధీ ! సత్పురుషులకు ఏక మాత్రగతివగు రామా! శచీపతి చిన్న తమ్ముని (వామన) స్వరూపుడవైన నిన్ను భజించు చున్నాను.

త్వదంఘ్రిమూలంయే నరాః భజంతి హీన మత్సరాః
పతంతి నో భవార్ణవే వితర్క వీచి సంకులే
వివిక్త వాసినః సదా భజంతి ముక్తయే ముదా
నిరస్య ఇంద్రియాది కంప్రయాంతితే గతిం స్వకమ్ 4

ద్వేష రహితులై మీ చరణములను సేవించువారు సంసార సాగరము నందు పడరు. ఇంద్రియ నిగ్రహముతో ఏకాంతవాసులై ముక్తి కొరకు నిన్ను భజించువారికి తమ కిష్టమగు పదము లభించును.

తమేక మద్భుతం ప్రభుం నిరీహమీశ్వరం విభుం
జగద్ గురుం చ శాశ్వతం తురీయమేవ కేవలమ్
భజామి భావ వల్లభం కు యోగినాం సుదుర్లభం
స్వభక్త కల్ప పాదపం సమం సుసేవ్యమన్వహమ్ 5

ఇచ్ఛారహితుడవు, ఈశ్వరుడవు, జగద్గురువు, సనాతనుడవు, సర్వవ్యాపకుడవు, త్రిగుణాతీతుడవు, అ

మూర్తివి, భక్తి భావ ప్రియుడవు, జాగ్రదాదులగు మూడు అవస్థల కతీతుడవు, కుయోగులకు అత్యంత దుర్లభుడవు, నీ భక్తులకు కల్పవృక్షమవు సదా సేవింపదగిన వాడవు, అద్భుత ప్రభువు అయిన నిన్ను నిరంతరము భజించెదను.

అనూప రూప భూపతిం నతోఽహ ముర్విజాపతిం
ప్రసీదమే నమామి తే పదాబ్జ భక్తిం దేహిమే
పఠంతి యే స్తవం ఇదం నరాద రేణ తే పదం
వ్రజంతి నాత్ర సంశయం త్వదీయ భక్తి సంయుతాః 6

అనుపమ సుందరా! పృథ్వీపతీ! జానకీ నాథా! నీకు ప్రణామములు. నాకు ప్రసన్నుడవు కమ్ము. నీకు నా నమస్కారములు. నాకు మీ చరణ కమలములపై భక్తి నొసగుడు. దీనిని ఆదరముతో స్తుతించువారు మీ భక్తులై మీ పరమ పదము నొందెదరు. ఇందు సందేహము లేదు.

ఇతి శ్రీమద్ గోస్వామి తులసీదాసకృత
శ్రీరామ చన్ద్ర స్తుతిః సంపూర్ణా

అని శ్రీమద్ గోస్వామితులసీ దాస కృతమగు శ్రీరామ చన్ద్ర స్తుతి సంపూర్ణము.

# శ్రీరామ మంగళా శాసన సవివరణ

*మంగళం కోసలేన్ద్రాయ మహనీయ గుణాబ్ధయే ।*
*చక్రవర్తి తనూజయ సార్వభౌమాయ మంగళమ్ ॥ 1*

ప్రశంసనీయ గుణసాగరుడను, కోసలేంద్రుడను శ్రీరామ చంద్రునకు మంగళము. చక్రవర్తి యగు దశరథరాజ పుత్రుడు మండలేశ్వరుడగు శ్రీరామ చంద్రునకు మంగళము కలుగుగాక.

*వేద వేదాన్త వేద్యాయ మేఘశ్యామల మూర్తయే ।*
*పుంసాం మోహన రూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్ ॥ 2*

వేదవేదాంతజ్ఞేయుడు, మేఘమువలె శ్యామ వర్ణము గలవాడు, పురుషులలో అతి మనోహరుడు (పురుషులను మోహింప జేయు రూపము గలవాడు), పవిత్ర యశస్సు గలవాడగు శ్రీరామ చంద్రునకు మంగళము అగుగాక.

*విశ్వామిత్రాన్త రంగాయ మిథిలానగరీ పతేః ।*
*భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్ ॥ 3*

విశ్వామిత్ర ఋషికి ప్రియమైన వాడు, జనక మహారాజు భాగ్య ఫల స్వరూపుడు, భవ్య రూపుడునగు శ్రీరామచంద్రునకు మంగళము కలుగుకాక.

*పితృభక్తాయ సతతం భాతృభిః సహసీతయా ।*
*నన్దితాఖిల లోకాయ రామభద్రాయ మంగళమ్ ॥ 4*

సదాపితృభక్తి ఆచరించువాడు, తన సోదరుల తోను, సీతతోను గూడి శోభించువాడు, సమస్త లోకములకు ఆనందము చేకూర్చువాడు అయిన శ్రీరామ భద్రునకు మంగళము అగుగాక.

**త్యక్త సాకేతవాసాయ చిత్రకూట విహారిణే।**
**సేవ్యాయ సర్వయమినాం ధీరోదాత్తాయ మంగళమ్ ॥ 5**

అయోధ్యా నివాసులను వదలి చిత్రకూటముపై విహరించిన వాడు, సమస్తమునులకు సేవ్యుడును, ధీరోదాత్తు డునగు శ్రీరామ భద్రునకు మంగళము కలుగుగాక.

**సౌమిత్రిణా చ జానక్యా చాప బాణాసి ధారిణే।**
**సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్ ॥ 6**

లక్ష్మణుని చేతను, సీత చేతను ఎల్లప్పుడు భక్తి పూర్వకముగ సేవింపబడువాడు, ధనుర్బాణములను, ఖడ్గమును ధరించిన వాడు నగు నా స్వామి శ్రీరామ భద్రునకు మంగళము అగుగాక.

**దండ కారణ్య వాసాయ ఖర దూషణ శత్రవే।**
**గృధ్ర రాజాయ భక్తాయ ముక్తి దాయాస్తు మంగళమ్ ॥ 7**

దండకావనమందు నివసించినవాడు, ఖరదూషణులకు శత్రువు అయిన వాడు, తన భక్తుడైన జటాయువునకు ముక్తి నొసగినవాడు నగు శ్రీరామ భద్రునకు మంగళము కలుగుగాక.

**సాదరం శబరీదత్త ఫల మూలాభిలాషిణే।**
**సౌలభ్య పరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్ ॥ 8**

ఆదరముతో శబరి ఇచ్చిన ఫలమూలములను అభిలషించిన వాడు, సులభముగ లభించువాడు, సత్త్వగుణాధికుడు అయిన శ్రీరామ భద్రునకు మంగళము అగుగాక.

**హనుమత్సమ వేతాయ హరీశా భీష్ట దాయినే।**
**వాలి ప్రమథ నాయాస్తు మహాధీరాయ మంగళమ్ ॥ 9**

హనుమానునితో సంయుక్తుడు, సుగ్రీవుని అభీష్టము తీర్చిన వాడు, వాలిని సంహరించిన వాడు, మహాధీరుడునగు శ్రీరామ భద్రునకు మంగళము కలుగుగాక.

**శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘిత సిన్ధవే ।**
**జితరాక్షస రాజాయ రణధీరాయ మంగళమ్ ॥ 10**

సముద్రముపై సేతు నిర్మాణము గావించి దాటిన వాడు, రాక్షసరాజు రావణునిపై విజయము పొందినవాడు, రణధీరుడునగు శ్రీ రఘువీరునకు మంగళము అగుగాక.

**విభీషణ కృతే ప్రీత్యా లంకా భీష్ట ప్రదాయినే ।**
**సర్వలోక శరణ్యాయ రాఘవాయాస్తు మంగళమ్ ॥ 11**

విభీషణుని కోరిక తీర్చి లంకారాజ్యము నొసగిన వాడు, సమస్తలోక శరణమయిన వాడు అయిన శ్రీ రాఘవ రామ భద్రునకు మంగళము కలుగు గాక.

**ఆసాద్య నగరీం దివ్యామభి షిక్తాయ సీతయా ।**
**రాజాధి రాజ రాజాయ రామ భద్రాయ మంగళమ్ ॥ 12**

వనవాసము నుండి దివ్యమగు అయోధ్యా నగరమును చేరి సీతా సహితుడై రాజ్యాభిషిక్తుడైన వాడు రాజాధి రాజునగు శ్రీరామ భద్రునకు మంగళము అగుగాక.

**బ్రహ్మాది దేవ సేవ్యాయ బ్రహ్మణ్యాయ మహాత్మనే ।**
**జానకీ ప్రాణ నాథాయ రఘునాథాయ మంగళమ్ ॥ 13**

బ్రహ్మాది దేవతలతో సేవింపబడినవాడు, బ్రాహ్మణులను, వేదములను రక్షించినవాడు, శ్రీ జానకీ ప్రాణనాథుడు, రఘుకుల నాథుడునగు శ్రీరామ భద్రునకు మంగళము కలుగు గాక.

**శ్రీ సౌమ్యజా మాతృమునేః కృపయాస్మాను పేయుషే ।**
**మహాతే మమ నాథాయ రఘునాథాయ మంగళమ్ ॥ 14**

లక్ష్మీసంపన్నుడు, సుందరుడు, సౌమ్యజామాతృముని కృపతో మాకు లభించిన వాడు, నా స్వామి అగు రఘునాథునకు మంగళము అగుగాక.

మంగళాశాసన పరైర్మదాచార్య పురోగమైః ।
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ ॥ 15

నా ఆచార్యులు, అర్వాచీన ఆచార్యులు సమస్త ప్రాచీన ఆచార్యులు మంగళాశాసనములతో ఎవరిని సత్కరించిరో ఆ రామ భద్రునకు మంగళము కలుగు గాక.

రమ్యజామాతృ మునినా మంగళా శాసనం కృతమ్ ।
త్రై లోక్యాధి పతిః శ్రీమాన్ కరోతు మంగళం సదా ॥ 16

జామాతృముని ఈ సుందరమైన మంగళా శాసనమును రచించెను. దీనితో ప్రసన్నుడగు త్రిలోకాధిపతి శ్రీరామ భద్రుడు సదా శుభము చేకూర్చును గాక.

శ్రీరామ మంగళ శాసన సవివరణ సంపూర్ణము.



# శ్రీ సీతా౽ష్టోత్తర శతనామ స్తోత్రమ్

## ధ్యానమ్

వామాంగే రఘునాయకస్య రుచిరే యా సంస్థితా శోభనా
యావిప్రాధి పయానరమ్య నయనా యావిప్ర పాలాననా ।
విద్యుత్పుంజ విరాజ మానవ సనా భక్తార్తి సంఖండనా
శ్రీ మద్రాఘవ పాద పద్మయుగల న్యస్తే క్షణాసా౽వతు ॥ 1

శ్రీ సీతా జానకీ దేవీ వైదేహీ రాఘవ ప్రియా ।
రమా౽వ నిసుతారామా రాక్షసాంత ప్రకారిణీ ॥ 2

రత్నగుప్తా మాతులుంగీ మైథిలీ భక్త తోషదా ।
పద్మాక్షజా కంజనేత్రా స్మితా స్యానూపుర స్వనా ॥ 3

వైకుంఠ నిలయా మా శ్రీర్ముక్తిదా కామ పూరణీ ।
నృపాత్మజా హేమ వర్ణా మృదు లాంగీ సుభాషిణీ ॥ 4

కుశాంబికా దివ్యదా చ లవమాతా మనోహరా ।
హనుమద్వందిత పదా ముగ్ధా కేయూర ధారిణీ ॥ 5

అశోకవన మధ్యస్థా రావణాదిక మోహినీ ।
విమాన సంస్థితా సుభ్రూః సుకేశీ రశనాన్వితా ॥ 6

రజోరూపా సత్త్వరూపా తామసీ వహ్నివాసినీ ।
హేమ మృగా సక్త చిత్తా వాల్మీక్యాశ్రమ వాసినీ ॥ 7

పతివ్రతా మహామాయా పీత కౌశేయ వాసినీ ।
మృగనేత్రా చ బింబోష్ఠీ ధనుర్విద్యా విశారదా ॥ 8

సౌమ్యరూపా దశరథ స్నుషా చామర వీజితా ।
సుమేధా దుహితా దివ్యరూపా త్రైలోక్య పాలినీ ॥ 9

అన్నపూర్ణా మహాలక్ష్మీర్ధీర్ల జ్జా చ సరస్వతీ ।
శాంతిః పుష్టిః క్షమా గౌరీప్రభా౽యోధ్యానివాసినీ ॥ 10

వసంత శీతలా గౌరీ స్నాన సంతుష్ట మానసా ।
రమానామ భద్ర సంస్థా హేమ కంకణ మండితా ॥ 11

సురార్చితా ధృతిః కాంతిః స్మృతిర్మేధా విభావరీ ।
లఘూదరా వరారోహా హేమ కంకణ మండితా ॥ 12

ద్విజపత్న్యర్పిత నిజభూషా రాఘవ తోషిణీ ।
శ్రీరామ సేవనరతా రత్న తాటంక ధారిణీ ॥ 13

రామవామాంగ సంస్థా చ రామ చంద్రైక రంజనీ ।
సరయూజల సంక్రీడా కారిణీ రామ మోహినీ ॥ 14

సువర్ణతులయా పుణ్యా పుణ్య కీర్తిః కలావతీ ।
కలంకంఠా కంబుకంఠా రంభోరుర్గ జగామినీ ॥ 15

రామార్పితమనా రామ వందితా రామ వల్లభా ।
శ్రీరామ పద చిహ్నాంకా రామరామేతి భాషిణీ ॥ 16

రామ పర్యంక శయనా రామాంఘ్రిక్షాలినీ వరా ।
కామధేన్వన్న సన్తుష్టా మాతులుంగ కరే ధృతా॥ 17

దివ్యచన్దన సంస్థా శ్రీర్మూలకాసుర మర్దినీ ।
ఏవ మష్టోత్తర శతం సీతానామ్నాం సుపుణ్యదమ్ ॥ 18

యే పఠంతి నరా భూమ్యాం తే ధన్యాః స్వర్గగామినః ।
అష్టోత్తర శతం నమ్నాం సీతాయాః స్తోత్ర ముత్తమమ్ ॥ 19

జపనీయం ప్రయత్నేన సర్వదా భక్తి పూర్వకమ్ ।
సంతి స్తోత్రా ణ్యనేకాని పుణ్యదాని మహాంతిచ ॥ 20

నానేన సదృశానీహ తాని సర్వాణి భూసుర ।
స్తోత్రాణా ముత్తమం చేదం భక్తి ముక్తి ప్రదం నృణామ్ ॥ 21

ఏవం సుతీక్ష్ణ తే ప్రోక్త మష్టోత్తర శతం శుభమ్ ।
సీతానామ్నాం పుణ్యదం చ శ్రవణాన్మంగల ప్రదమ్ ॥ 22

నరైః ప్రాతః సముత్థాయ పఠితవ్యం ప్రయత్నతః ।
సీతా పూజన కాలేఽపి సర్వవాంఛిత దాయకమ్ ॥ 23

ఇతి శ్రీ సీతాఽష్టోత్తర శతనామ స్తోత్రం సంపూర్ణమ్

# శ్రీ సీతాష్టోత్తర శత నామావళిః

1. ఓం శ్రీ సీతాయై నమః
2. ఓం జానక్యై నమః
3. ఓం దేవ్యై నమః
4. ఓం వైదేహ్యై నమః
5. ఓం రాఘవ ప్రియాయై నమః
6. ఓం రమాయై నమః
7. ఓం అవనీ సుతాయై నమః
8. ఓం రామాయై నమః
9. ఓం రాక్షసాంత ప్రకారిణ్యై నమః
10. ఓం రత్నగుప్తాయై నమః
11. ఓం మాతులుంగ్యై నమః
12. ఓం మైథిల్యై నమః
13. ఓం భక్తతోషదాయై నమః
14. ఓం పద్మాక్షజాయై నమః
15. ఓం కంజనేత్రాయై నమః
16. ఓం స్మితా స్యాయై నమః
17. ఓం నూపుర స్వనాయై నమః
18. ఓం వైకుంఠ నిలయాయై నమః
19. ఓం మాయై నమః
20. ఓం శ్రియై నమః
21. ఓం ముక్తిదాయై నమః
22. ఓం కామ పూరణ్యై నమః
23. ఓం నృపాత్మజాయై నమః
24. ఓం హేమ వర్ణాయై నమః
25. ఓం మృదులాంగ్యై నమః
26. ఓం సుభాషిణ్యై నమః
27. ఓం కుశాంబికాయై నమః
28. ఓం దివ్యదాయై నమః
29. ఓం లవమాత్రే నమః
30. ఓం మనోహరాయై నమః
31. ఓం హనుమద్వందిత పదాయై నమః
32. ఓం ముగ్ధాయై నమః
33. ఓం కేయూర ధారిణ్యై నమః
34. ఓం అశోక వనమధ్య స్థాయై నమః
35. ఓం రావణాదిక మోహిన్యై నమః
36. ఓం విమాన సంస్థితాయై నమః
37. ఓం సుభ్రువే నమః
38. ఓం సుకేశ్యై నమః
39. ఓం రశనాన్వితాయై నమః
40. ఓం రజోరూపాయై నమః
41. ఓం సత్యరూపాయై నమః

42. ఓం తామస్యై నమః
43. ఓం వహ్ని వాసిన్యై నమః
44. ఓం హేమ మృగా సక్త చిత్తాయై నమః
45. ఓం వాల్మీక్యాశ్రమ వాసిన్యై నమః
46. ఓం పతివ్రతాయై నమః
47. ఓం మహామాయాయై నమః
48. ఓం పీతకౌశేయ వాసిన్యై నమః
49. ఓం మృగనేత్రాయై నమః
50. ఓం బింబోష్ఠ్యై నమః
51. ఓం ధనుర్విద్యా విశారదాయై నమః
52. ఓం సౌమ్యరూపాయై నమః
53. ఓం దశరథ స్నుషాయై నమః
54. ఓం చామరవీజితాయై నమః
55. ఓం సుమేధాదుహిత్రే నమః
56. ఓం దివ్యరూపాయై నమః
57. ఓం త్రైలోక్యపాలిన్యై నమః
58. ఓం అన్నపూర్ణాయై నమః
59. ఓం మహాలక్ష్మై నమః
60. ఓం ధియై నమః
61. ఓం లజ్జాయై నమః
62. ఓం సరస్వత్యై నమః
63. ఓం శాంత్యై నమః
64. ఓం పుష్ట్యై నమః
65. ఓం క్షమాయై నమః
66. ఓం గౌర్యై నమః
67. ఓం ప్రభాయై నమః
68. ఓం అయోధ్యాయవాసిన్యై నమః
69. ఓం వసంత శీతలాయై నమః
70. ఓం గౌర్యై నమః
71. ఓం స్నాన సంతుష్ట మానసాయై నమః
72. ఓం రామనామ భద్ర సంస్థాయై నమః
73. ఓం హేమకుంభపయో ధరాయై నమః
74. ఓం సురార్చితాయై నమః
75. ఓం ధృత్యై నమః
76. ఓం కాంత్యై నమః
77. ఓం స్మృత్యై నమః
78. ఓం మేధాయై నమః
79. ఓం విభావర్యై నమః
80. ఓం లఘూదరాయై నమః
81. ఓం వరారోహాయై నమః
82. ఓం హేమకంకణ మండితాయై నమః
83. ఓం ద్విజ పత్న్యర్పితనిజ భూషాయై నమః

84.. ఓం రాఘవతోషిణ్యై నమః

85. ఓం శ్రీరామ సేవానిరతాయై నమః

86. ఓం రత్నతాటంకధారిణ్యై నమః

87. ఓం రామవామాంక సంస్థాయై నమః

88. ఓం రామ చంద్రైకరంజిన్యై నమః

89. ఓం సరయూజల సంక్రీడా కారిణ్యై నమః

90. ఓం రామమోహిన్యై నమః

91. ఓం సువర్ణ తులితాయై నమః

92. ఓం పుణ్యాయై నమః

93. ఓం పుణ్యకీర్త్యై నమః

94. ఓం కలావత్యై నమః

95. ఓం కలకంఠాయై నమః

96. ఓం కంబు కంఠాయై నమః

97. ఓం రంభోరవే నమః

98. ఓం గజగామిన్యై నమః

99. ఓం రామార్పితమనసే నమః

100. ఓం రామ వందితాయై నమః

101. ఓం రామ వల్లభాయై నమః

102. ఓం శ్రీరామ పదచిహ్నాంకాయై నమః

103. ఓం రామరామేతి భాషిణ్యై నమః

104. ఓం రామ పర్యంక శయనాయై నమః

105. ఓం రామాంఘ్రిక్షాలిన్యై నమః

106. ఓం వరాయై నమః

107. ఓం కామధేన్వన్న సంతుష్టాయై నమః

108. ఓం మాతులుంగ కరేధృతాయై నమః

109. ఓం దివ్య చందన సంస్థాయై నమః

110. ఓం శ్రియై నమః

111. ఓం మూలకాసుర మర్దిన్యై నమః

**ఇతి శ్రీ సీతాష్టోత్తర శత నామావళిః సంపూర్ణా**

# శ్రీ సీతాష్టోత్తర శత నామ వివరణ

1. శ్రీసీతా - బంగారు నాగలితో జనకుడు యజ్ఞమునకు భూమిని దున్నుచుండగా ప్రకటమైనది.
2. జానకీ - జనకుని పుత్రిక .
3. దేవీ - (పరమాత్మలో) క్రీడించునది.
4. వైదేహీ - విదేహజనకుని పుత్రిక.
5. రాఘవప్రియా - రాఘవుని ప్రియురాలు.
6. రమా - రమింపజేయునది.
7. అవనీసుతా - భూదేవి పుత్రిక యైనది.
8. రామా - గీత కళాదులను నేర్చి రమించునది.
9. రాక్షసాంతప్రకారిణీ - రాక్షసులనాశనమును బాగుగ చేయునది.
10. రత్నగుప్తా - రత్నము వలె దాచబడినది.
11. మాతులుంగీ - నిమ్మపండు ఇష్టమైనది.
12. మైథిలీ - మిథిలా నరేశుని పుత్రిక.
13. భక్తతోషదా - భక్తులకు సంతోష మిచ్చునది.
14. పద్మాక్షజా - పద్మాక్షరాజునకు పుత్రికగా జన్మించునది.
15. కంజనేత్రా - కమల సమాన నేత్రములు గలిగినది.
16. స్మితాస్యా - నగుమోము గలిగినది.
17. నూపుర స్వనా - కాలి అందెల ధ్వనులు గలది.
18. వైకుంఠ నిలయా - వైకుంఠలోకమందు నివసించునది.
19. మా - జగన్మాత.
20. శ్రీః - మహాలక్ష్మి.
21. ముక్తిదా - ముక్తిని ప్రసాదించునది.

22. కామపూరణీ - తన భక్తుల కోరికలను తీర్చునది.
23. నృపాత్మజా - రాజపుత్రిక.
24. హేమ వర్ణా - బంగారు చాయ గలిగినది.
25. మృదులాంగీ - కోమలాంగములు గలిగినది.
26. సుభాషిణీ - అందముగ మాటాడునది.
27. కుశాంబికా - కుశని తల్లియైనది.
28. దివ్యదా - (లోకోత్తరగుణములు గలది) లంకనుండి తిరిగి వచ్చిన తరువాత రాముని కటు వాక్యములువిని శపథము చేసినట్టిది.
29. లవమాతా - లవుని తల్లి.
30. మనోహరా - మనస్సు హరించునది.
31. హనుమద్వందితపదా - హనుమంతునిచే పాద పూజలందు కొనునది.
32. ముగ్ధా - అమాయకురాలు.
33. కేయూరధారిణీ - బాహుపురులు దాల్చినది.
34. అశోకవనమధ్యస్థా - అశోక వనమందు నివసించినది.
35. రావణాదిక మోహినీ - రావణుడు మున్నగువారిని మోహ పెట్టినది.
36. విమాన సంస్థితా - పుష్పక విమానమునందు కూర్చున్నది.
37. సుభ్రూః - చక్కనికనుబొమలుగలది.
38. సుకేశీ - అందమైన కేశములు గలిగినది.
39. రశనాన్వితా - (మొలనూలు) వడ్డాణముతో గూడినది.
40. రజోరూపా - రజోరూపిణి.
41. సత్యరూపా - సత్యరూపిణి.
42. తామసీ - తామసరూపిణి.

43. వహ్నివాసినీ - అగ్నియందు నివసించినది.

44. హేమమృగా సక్తచిత్తా - బంగారు లేడిపై ఆసక్తమైన మనస్సుగలది.

45. వాల్మీక్యాశ్రమ వాసినీ - వాల్మీకి మహర్షి ఆశ్రమమున నివసించినది.

46. పతివ్రతా - పతిసేవయే వ్రతముగా గలది.

47. మహామాయా - ప్రకృతి స్వరూపిణి.

48. పీత కౌశేయవాసినీ - పట్టు పీతాంబరము ధరించునది.

49. మృగనేత్రా - లేడి కన్నులవంటి కన్నులు గలది.

50. బింబోష్ఠీ - దొండ పండు వంటి పెదవి కలది.

51. ధనుర్విద్యా విశారదా - ధనుర్విద్యలో నిపుణురాలు.

52. సౌమ్యరూపా - సౌమ్యమైన రూపము గలిగినది.

53. దశరథ స్నుషా - దశరథుని కోడలైనది.

54. చామర వీజితా - వింజామరలతో సేవింపబడునది.

55. సుమేధాదుహితా - సుమేధుని పుత్రిక.

56. దివ్య రూపా - దివ్యమైన రూపము గలిగినది.

57. త్రైలోక్య పాలినీ - ముల్లోకములను పాలించునది.

58. అన్నపూర్ణా - అన్నపూర్ణా స్వరూపిణి.

59. మహాలక్ష్మీః - సంపదలొసగు మహాలక్ష్మీ స్వరూపిణి.

60. ధీః - బుద్ధియైనది.

61. లజ్జా - లజ్జా స్వరూపిణి.

62. సరస్వతీ - విద్యా ప్రదాయిని సరస్వతీ దేవి.

63. శాన్తిః - శాంతిరూపిణి.

64. పుష్టిః - బలము చేకూర్చునది.

65. క్షమా - క్షమా స్వరూపిణి.

66. గౌరీ - మాహేశ్వరి.

67. ప్రభా - ప్రకాశించునది, కాంతి స్వరూపిణి.

68. అయోధ్యావాసినీ - అయోధ్యా నగర మందు నివసించునది.

69. వసంత శీతలా - వసంతఋతువు నందు శీతలా గౌరీ వ్రతము చేయబడునది.

70. గౌరీ - గౌర వర్ణముగలది.

71. స్నాన సంతుష్ట మానసా - వసంత ఋతువు నందు శీతాలా గౌరీవ్రతము జరుపునపుడు చేయబడు స్నానవముతో (అభిషేకవముతో) సంతుష్టురాలగునది.

72. రామనామ భద్ర సంస్థా - రామనామమునందు క్షేమముగ నున్నది.

73. హేమకుంభ పయోధరా - బంగరు కుండలవంటి కుచములు గలది.

74. సురార్చితా - దేవతలచే పూజింపబడునది.

75. ధృతిః - ధైర్య స్వరూపిణియైనది.

76. కాంతిః - ప్రకాశించునది.

77. స్మృతిః - స్మృతిరూపిణి.

78. మేధా - ధారణాశక్తిరూపిణి.

79. విభావరీ - రాత్రి స్వరూపిణి.

80. లఘూదరా - సన్ననగు ఉదరము గలది.

81. వరారోహా - శ్రేష్ఠమైన పృష్ఠ భాగము గలది.

82. హేమకంకణమండితా - బంగారు కంకణములచే అలంకరింపబడినది.

83. ద్విజపత్న్యర్పితనిజ-భూషా - తన నగలను బ్రాహ్మణ స్త్రీలకు ఇచ్చినది.

84. రాఘవతోషిణీ - శ్రీరాముని సంతోషపెట్టునది.

85. శ్రీరామ సేవానిరతా - శ్రీరాముని సేవ యందు ఆసక్తురాలు.

86. రత్నతాటంక ధారిణీ - రత్నములతో నిర్మించబడిన (కర్ణ పుష్పము) కమ్మలను ధరించినది.

87. రామవామాంకసంస్థా - రాముని వామాంకమున నుండునది.

88. రామ చంద్రైక రంజనీ - రామచంద్రుని మాత్రమే రంజింప జేయునది.

89. సరయూజల సంక్రీడాకారిణీ - సరయూ జలమందు విహరించునది.

90. రామమోహినీ - శ్రీరాముని మోహింపజేయునది.

91. సువర్ణతులితా - బంగారుతో సమానమైనది.

92. పుణ్యా - పవిత్రురాలు.

93. పుణ్యకీర్తిః - పవిత్రమైన కీర్తిగలది.

94. కలావతీ - అరువది నాలుగు కళలుగలది.

95. కలకంఠా - ఇంపైన కంఠధ్వని గలది.

96. కంబుకంఠా - శంఖము వంటి కంఠము గలది.

97. రంభోరుః - అరటిబోదెల వంటి ఊరువులు గలది.

98. గజగామినీ - మత్తగజము నడక వంటి నడక గలది.

99. రామార్పితమనాః - రామునకు మనస్సు అర్పించనది.

100. రామవందితా - రాముని పూజించునది.

101. రామవల్లభా - రామునికి ప్రియతమమైనది.

102. శ్రీరామపద చిహ్నాంకా - తన హృదయమందు శ్రీరాముని చరణములను ప్రతిష్ఠించు కొనినది.

| | | |
|---|---|---|
| 103. | రామరామేతిభాషిణీ | - సదా రామ- రామయని భాషించునది. |
| 104. | రామపర్యంక శయనా | - శ్రీరాముని మంచమే ప్రక్కగా గలది. |
| 105. | రామాంఘ్రిక్షాలినీ | - రాముని చరణములను కడుగునది. |
| 106. | వరా | - శ్రేష్ఠురాలైనది. |
| 107. | కామధేన్వన్న సంతుష్టా | - కామధేనువు యొక్క అన్నముతో సంతృప్తురాలైనది. |
| 108. | మాతులుంగ కరేధృతా | - నిమ్మపండును చేతియందు ధరించినది. |
| 109. | దివ్యచందన సంస్థా | - దివ్యమైన చందనము ధరించునది. |
| 110. | శ్రీః | - లక్ష్మీ స్వరూపిణి. |
| 111. | మూలకాసుర మర్దినీ | - మూలకాసురుని సంహరించునది. |

శ్రీ సీతాష్టోత్తర శతనామ వివరణ సంపూర్ణము.



# శ్రీ హనుమత్కవచమ్

ఏకదా సుఖమాసీనం శంకరం లోకశంకరమ్ ।
పప్రచ్ఛ గిరిజాకాంతం కర్పూర ధవలంశివమ్ ॥ 1

పార్వత్యువాచ :

భగవన్ దేవ దేవేశ లోకనాథ జగత్ప్రభో ।
శోగాకులానాం లోకానాం కేన రక్షా భవేద్ ధ్రువమ్ ॥ 2
సంగ్రామే సంకటే ఘోరే భూత ప్రేతాదికే భయే ।
దుఃఖ దావాగ్ని సంతప్త చేతసాం దుఃఖ భాగినామ్ ॥ 3

శివ ఉవాచ :

శృణుదేవి ప్రవక్ష్యామి లోకానాం హితకామ్యయా ।
విభీషణాయ రామేణ ప్రేమ్ణా దత్తం చయ త్పురా ॥ 4
కవచం కపినాథ స్య వాయు పుత్రస్య ధీమతః ।
గుహ్యం తత్తే ప్రవక్ష్యామి విశేషాచ్ఛృణు సున్దరి ॥ 5
ఉద్యదాదిత్య సంకాశముదార భుజ విక్రమమ్ ।
కందర్ప కోటి లావణ్యం సర్వ విద్యా విశారదమ్ ॥ 6
శ్రీరామ హృదయా నన్దం భక్త కల్ప మహీరుహమ్ ।
అభయం వరదం దోర్భ్యాంకలయే మారుతాత్మజమ్ ॥ 7
హనుమానం జనీసూనుర్వాయు పుత్రో మహాబలః ।
రామేష్టః ఫాల్గున సఖః పింగాక్షోఽ మిత విక్రమః ॥ 8
ఉదధి క్రమణ శ్చైవ సీతాశోక వినాశనః ।
లక్ష్మణ ప్రాణ దాతా చ దశగ్రీవస్య దర్పహా ॥ 9
ఏవం ద్వాదశ నామాని కపీంద్ర స్య మహాత్మనః ।
స్వాపకాలే ప్రబోధే చ యాత్రాకాలేచయః పఠేత్ ॥ 10

తస్య సర్వ భయం నాస్తి రణే చ విజయీ భవేత్ ।
రాజద్వారే గృహద్వారే భయం నాస్తి కదాచన ॥ 11

ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలం
యః శోక వహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామితం ప్రాజ లిరాంజనేయమ్ ॥ 12

ఓం నమో హనుమతే సర్వగ్రహాన్ భూత భవిష్య ద్వర్తమానాన్ సమీపస్థాన్ సర్వకాలదుష్టబుద్ధీను చ్చాటయ పరబలాన్ క్షోభయ మమసర్వ-కార్యాణి సాధయ సాధయ .

ఓంహ్రాం హ్రీం హ్రూంఫట్ । ఘేఘేఘే ఓం - శివసిద్ధం ఓం హ్రాం ఓంహ్రీం ఓంహ్రూం ఓంహ్రైం ఓంహ్రౌం ఓంహ్రః స్వాహా। పరకృత యంత్ర మన్త్ర పరాహకార భూతప్రేత పిశాచ దృష్టిసర్వ -విఘ్న దుర్జన చేష్టా కు విద్యా సర్వోగ్ర భయాని నివారయ నివారయ - బన్ధ బన్ధ లుంఠలుంఠ విలుంచ విలుంచ కిలికిలికిలి స్వర కుయం -త్రాణి దుష్టవాచం ఓం ఫట్ స్వాహా ।

ఓం అస్య శ్రీహనుమత్కవచస్తోత్ర మన్త్ర స్య శ్రీరామ చన్ద్ర ఋషిః శ్రీహనుమాన్ పరమాత్మా దేవతా । అనుష్టుప్ఛన్దః । మారుతాత్మజ ఇతి బీజమ్ । అంజనీసూను-రితి శక్తిః । లక్ష్మణ ప్రాణ దాతేతి కీలకమ్ । రామదూతాయే త్యస్త్రమ్ । -హనుమాన్ దేవతా ఇతి కవచమ్ । పింగాక్షో౽ మిత విక్రమ ఇతి -మన్త్రః । శ్రీరామచన్ద్ర ప్రేరణయారామచన్ద్ర ప్రీత్యర్థం మమసకల కామ -నాసిద్ధ్యర్థంజపే వినియోగః । అథాంగులిన్యాసః . ఓం హ్రాం అంజనీ -సుతాయ అంగు ష్ఠాభ్యాం నమః । ఓం హ్రీం రుద్ర మూర్తయే తర్జనీ భ్యాం - నమః । ఓం హ్రూంరామదూతాయ మధ్యమాభ్యాం

నమః । ఓం హైం -వాయుపుత్రాయ అనామికా భ్యాం నమః ।ఓం ప్రహాం అగ్ని గర్భాయ - కనిష్ఠ కాభ్యాం నమః । ఓం ప్రాః బ్రహ్మాస్త్ర నివారణాయ కరతల -కరపృష్ఠాభ్యాం నమః । ఏవం హృదయాద్యంగ న్యాసంకృత్వా ।

అథధ్యానమ్

ధ్యాయేద్బాల దివాకర ద్యుతినిభం దేవారి దర్పాపహం
దేవేన్ద్ర ప్రముఖం ప్రశస్తయశ సం దేదీప్య మానం రుచా ।
సుగ్రీవాది సమస్త వానరయుతం సువ్యక్త తత్వప్రియం
సంరక్తారుణ లోచనం పవనజం పీతాంబరాలం కృతమ్ ॥ 13
ఉద్యన్మార్తండ కోటి ప్రకట రుచియుతం చారువీరాసనస్థం
మౌంజీయజ్ఞోపవీతా భరణ రుచి శిఖం శోభితం కుండలాంకమ్।
భక్తానామి ష్టదం తంప్రణత మునిజనం వేదనాద ప్రమోదం
ధ్యాయే దేవం విధేయం ప్లవగ కులపతిం గోష్పదీ భూత వార్ధిమ్ ॥ 14
వజ్రాంగ పింగకేశాఢ్యం స్వర్ణ కుండల మండితమ్ ।
నిగూఢ ముప సంగమ్య పారావార పరాక్రమమ్ ॥ 15
స్ఫటికాభం స్వర్ణ కాంతిం ద్విభుజంచ కృతాంజలిమ్ ।
కుండల ద్వయ సంశోభి ముఖాంభోజం హరింభజే ॥ 16
సవ్యహస్తే గదాయుక్తం వామహస్తే కమండలుమ్ ।
ఉద్యద్ద క్షిణదోర్దండం హనుమతంవిచింతయేత్ ॥ 17

ఓం నమో హనుమతే శోభితానాయ యశోఽ లంకృతాయ అంజీనీ గర్భ - సంభూతాయ రామలక్ష్మణా నన్దాయ కపిసైన్య ప్రకాశన పర్వతో -త్పాటనాయ సుగ్రీవ సాహ్యాకరణ పరోచ్చాటన కుమార బ్రహ్మ చర్య -గంభీర శబ్దోదయ హ్లీం సర్వదుష్ట గ్రహ నివారణాయ స్వాహా ।

ఓం - నమోహనుమతే ఏహి ఏహి ఏహి సర్వగ్రహ భూతానాం శాకినీ -డాకినీనాం విషమ దుష్టానాం సర్వేషామాకర్ష యాకర్షయ మర్దయ మర్దయ ఛేదయ ఛేదయ మర్త్యాన్మారయ మారయ శోషయ శోషయ ప్రజ్వల ప్రజ్వల భూత మండల పిశాచ మండల నిరసనాయ- భూత జ్వర ప్రేత జ్వర చాతుర్థిక జ్వర బ్రహ్మ రాక్షస పిశాచ- భేదన క్రియా విష్ణు జ్వర మహేశ జ్వరాన్ ఛింధి ఛింధి ఛింధి- అక్షిశూలే శిరోఽభ్యన్తరే హ్యాక్షిశూలే గుల్మశూలే పిత్త శూలే- బ్రహ్మరాక్షసకుల ప్రబల నాగకుల విషనిర్విష ఝుటితి ఝుటితి- ఓం హ్రీం ఫట్ ఘే ఘే స్వాహా ।

ఓం నమో హనుమతే పవన పుత్ర వైశ్వా -నరముఖ పాపదృష్టి హనుమతే కో ఆజ్ఞాపురేస్వాహా । స్వగృహేద్వారే- పట్టకే తిష్ఠ తిష్ఠేతి తత్ర రోగభయం రాజకుల భయం నాస్తి తస్యో-చ్చారణ మాత్రేణ సర్వేజ్వరా నశ్యన్తి ఓం హ్రీం హ్రాం హ్రూం ఫట్ ఘే- ఘే స్వాహా ।

**శ్రీరామ ఉవాచ :**

హనుమాన్ పూర్వతః పాతు దక్షిణే పవనాత్మజః ।
పాతుప్రతీచ్యాం రక్షోఘ్నః పాతు సాగర పారగః ॥ 18

ఉదీచ్యా మూర్ధ్వతః పాతు కేసరీ ప్రియనన్దనః ।
అధస్తు విష్ణుభక్త స్తుపాతు మధ్యంచ పావనిః ॥ 19

లంకావిదాహకః పాతు సర్వా పద్భ్యో నిరంతరమ్ ।
సుగ్రీవ సచివః పాతు మస్తకం వాయునన్దనః ॥ 20

భాలం పాతు మహా వీరోభ్రువోర్మధ్యే నిరన్తరమ్ ।
నేత్రే ఛాయాపహారీ చ పాతు నః ప్లవగేశ్వరః ॥ 21

కపోలే కర్ణమూలే చ పాతు శ్రీరామ కింకరః ।
నాసాగ్ర మంజనీ సూనుః పాతు వక్త్రం హరీశ్వరః
వాచం రుద్రప్రియః పాతు జిహ్వాం పింగల లోచనః ॥ 22
పాతుదేవః ఫాల్గునేష్ట శ్చి బుకం దైత్యదర్పహా ।
పాతు కంఠం చ దైత్యారిః స్కన్దౌ పాతు సురార్చితః ॥ 23

భుజౌపాతు మహాతేజాః కరౌచ చరణాయుధః ।
నఖాన్న ఖాయుధః పాతు కుక్షౌపాతు కపీశ్వరః ॥ 24

వక్షోముద్రాపహారీచ పాతు పార్శ్వే భుజాయుధః ।
లంకావి భంజనః పాతుపృష్ఠ దేశే నిరతరమ్ ॥ 25

నాభించ రామదూతస్తు కటింపాత్వని లాత్మజః ।
గుహ్యంపాతు మహాప్రాజ్ఞో లింగం పాతు శివ ప్రియః ॥ 26

ఊరూచ జానునీ పాతు లంకా ప్రసాధ భంజనః ।
జంఘే పాతు కపిశ్రేష్ఠో గుల్ఫౌ పాతు మహాబలః
అచలో ద్ధారకః పాతు పాదౌ భాస్కర సన్నిభః ॥ 27

అంగాన్యమిత సత్వా ఢ్యః పాతు పాదాం గులీం స్తథా ।
సర్వాంగాని మహాశూరః పాతురోమాణి చాత్మవిత్ ॥ 28

హనుమత్కవచం యస్తు పఠే ద్విద్వాన్విచక్షణః ।
సఏవ పురుష శ్రేష్ఠో భుక్తిం ముక్తిం చ విందతి ॥ 29

త్రికాల మేక కాలం వా పఠే న్మా సత్రయం నరః ।
సర్వాన్ రిపూన్ క్షణాజ్జిత్వాస పుమాన్ శ్రియ మాప్నుయాత్ ॥ 30

మధ్య రాత్రే జలేస్థిత్వా సప్తవారం పఠేద్యది ।
క్షయాపస్మార కుష్ఠాది తాపత్రయ నివారణమ్ ॥ 31

అశ్వత్థ మూలే ఽర్కవారే స్థిత్వా పఠతియః పుమాన్ ।
అచలాం శ్రియమాప్నోతి సంగ్రామే విజయం తథా ॥ 32

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతామ్ ।
సుదార్ఢ్యం వాక్స్ఫురత్వం చ హనుమత్స్మరణాద్భవేత్ ॥33

మారణం వైరిణాం సద్యః శరణం సర్వ సంపదామ్ ।
శోకస్య హరణే దక్షం వందే తం రణదారుణమ్ ॥ 34

లిఖిత్వా పూజయేద్యస్తు సర్వత్ర విజయీభవేత్ ।
యఃకరే ధారయేన్నిత్యం సఃపుమాన్ శ్రియమాప్నుయాత్॥35

స్థిత్వాతు బన్ధనే యస్తుజపం కారయతి ద్విజైః ।
తత్క్షణా న్ముక్తి మాప్నోతి నిగడాత్తు తథైవచ॥ 36

ఈశ్వర ఉవాచ

భాన్విం దోశ్చరణార విందయుగలం కౌపీన మౌంజీధరం
కాంచి శ్రేణిధరం దుకూలవసనం యజ్ఞోపవీతాజినమ్ ।
హస్తాభ్యాం ధృత పుస్తకం చ విలస ద్ధారావలింకుండలం
యశ్చాలం విశిఖం ప్రసన్న వదనం శ్రీవాయు పుత్రం భజే ॥ 37

యోవారాంనిధి మల్ప పల్వల మివోల్లంఘ్య ప్రతాపాన్వితో
వైదేహీఘనశోక తాపహరణో వైకుంఠ భక్త ప్రియః ।
అక్షాద్యూర్జిత రాక్షసేశ్వర మహాదర్పాప హారీరణే
సోఽయం వానర పుంగవోఽవతు సదాయోఽస్మాన్సమీ రాత్మజః ॥ 38

వజ్రాంగం పింగ నేత్రం కనకమయల సత్కుండలాక్రాంత గండం
దంభోవిస్తంభసారం ప్రహరణ సువశీ భూతరక్షోధి నాథమ్ ।
ఉద్యల్లాంగూల సప్త ప్రచల చలధరం భీమ మూర్తిం కపీంద్రం
ధ్యాయేత్తం రామ చంద్రం భ్రమర దృఢకరం సత్వసారం ప్రసన్నమ్ ॥39

వజ్రాంగం పింగనేత్రం కనకమయల సత్కుండలైః శోభనీయం
సర్వాపీ డ్యాది నాథ కరతల విధృతం పూర్ణకుంభం ధృఢంవా ।
భక్తానామిష్టకారం విదధతి చసదా సుప్రసన్నం హరీశం
త్రైలోక్యత్రాతు కామం సకల భువిగతం రామదూతం నమామి ॥ 40

వామే కరేవైరిభిదం వహంతం శైలం పరం శృంఖల హార కంఠమ్ ।
దధానమాచ్ఛాద్య సుపర్ణ వర్ణం భజే జ్వల త్కుండల మాంజనేయమ్ ॥ 41

పద్మరాగమణి కుండల త్విషాపాటలీకృత కపోల మండలమ్
దివ్యదేహ కద లీవనాంతరే భావయామి పవమాన నందనమ్ ॥ 42

యత్రయత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజ లిమ్ ।
బాష్పవారి పరి పూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్॥ 43

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమాతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానర యూథ ముఖ్యం
శ్రీరామ దూతం శిరసానమామి ॥ 44

వివాదే దివ్యకాలే చద్యూతే రాజకులే రణే ।
దశవారం పఠేద్రాత్రౌ మితాహారో జితేంద్రియః ॥ 45

విజయం లభతే లోకే మానవేషు నరేషుచ ।
భూతే ప్రేతే మహాదుర్గేఽరణ్యే సాగర సంప్లవే ॥ 46

సింహ వ్యాఘ్రభయే చోగ్రే శరశ స్త్రాస్త్ర పాతనే ।
శృంఖలాబంధనే చైవ కారాగృహ నియంత్రణే ॥ 47

కోపస్తంభే వహ్ని చక్రే క్షేత్రే ఘోరే సుదారుణే ।
శోకే మహారణే చైవ బ్రహ్మగ్రహ నివారణమ్ ॥ 48

సర్వదాతు పఠేన్నిత్యం జయమాప్నోతి నిశ్చితమ్ ।
భూర్జేవా వసనేరక్తే క్షౌమే వా తాల పత్రకే ॥ 49

త్రిగంధినా వా మ ష్యావా విలిఖ్య ధారయేన్నరః ।
పంచసప్త త్రిలో హైర్వా గోపితః సర్వతః శుభమ్ ॥ 50

కరేకట్యాం బాహుమూలే కంఠే శిరసిధారితమ్ ।
సర్వాన్కా మానవాప్నోతి సత్యం శ్రీరామ భాషితమ్ ॥ 51

అపరాజిత నమస్తేఽస్తు నమస్తే రామపూజిత ।
ప్రస్థానం చ కరిష్యామి సిద్ధిర్భ వతు మే సదా ॥ 52

ఇత్యుక్త్వామోప్రజేద్ గ్రామం దేశం తీర్థాతరంరణమ్ ।
ఆగమిష్యతి శీఘ్రం సక్షేమ రూపో గృహం పునః ॥ 53

ఇతి వదతి విశేషా ద్రాఘవే రాక్షసేంద్రః-
ప్రముదిత వరచిత్తో రావణస్యాను జోహి ।
రఘువర పద పద్మం వందయామాస భూయః-
కులసహిత కృతార్థః శర్మదం మన్యమానః ॥ 54

తం వేదశాస్త్ర పరినిష్ఠిత శుద్ధ బుద్ధిం-
శర్మప్రదం సుర మునీంద్ర నుతం కపీంద్రమ్ ।
కృష్ణత్వచం కనక పింగ జటాకలాపం -
వ్యాసం నమామి శిరసాతిలకం మునీనామ్ ॥ 55

య ఇదం ప్రాత రుత్థాయ పఠే త కవచం సదా ।
ఆయురారోగ్య సంతానైస్త స్యస్తవ్యః స్తవోభవేత్ ॥ 56

ఏవం గిరీంద్రం జే శ్రీమద్ధనుమత్కవచం శుభమ్ ।
త్వయా పృష్టం మయాప్రీత్యా విస్తరాద్వి నివేదితమ్ ॥ 57

## శ్రీరామ దాస ఉవాచ

ఏవం శివ ముఖాచ్ఛ్రుత్వా పార్వతీ కవచం శుభమ్ ।
హనూామతః సదా భక్త్యా పపాఠ తన్మనాః సదా ॥ 58

ఏవం శిష్య త్వయాఽ ప్యత్ర య ధాపృష్టం తథామయా ।
హనుమత్క వచం చే దంత వాగ్రే విని వేదితమ్ ॥ 59

ఇదం పూర్వ పఠిత్వాతు రామస్య కవచం తతః ।
పఠనీయం నరైర్భక్త్యానైక మేవ పఠేత్కదా ॥ 60

హనుమత్కవచం చాత్ర శ్రీరామ కవచం వినా ।
యేపఠంతి నరాశ్చాత్ర పఠనం తద్ వృథా భవేత్ ॥ 61

తస్మాత్సర్వై ః పఠనీయం సర్వదా కవచద్వయమ్ ।
రామస్య వాయు పుత్రస్య సద్భక్తైశ్చ విశేషతః ॥ 62

ఇతి శ్రీ హనుమత్కవచం సంపూర్ణమ్

# శ్రీ హనుమత్కవచ వివరణ

విష్ణుదాసు ''గురుదేవా ! హనుమత్కవచమును, రామ కవచమును నాపై దయ ఉంచి చెప్పు'' డని కోరెను.

రామదాసు '' వత్సా ! నీవు చాల మంచి ప్రశ్న అడిగితివి. నేను హనుమత్కవచమును, రామ కవచమును రెండింటిని చెప్పుచున్నాను. సావదానుడవై వినుము.

ఒక సమయమున జగత్ శుభకారియగు శివునితో పార్వతి '' దేవ దేవేశా ! జగత్ప్రభో! శోకపీడితులగు జనులు రక్షింప బడుటెట్లు ? ఘోర సంగ్రామములతోను, మహాసంకటముల తోను, భూతప్రేతాది బాధలతోను, దుఃఖ దావానలముతోను దహింపబడు వారి నుద్ధరించు ఉపాయమేదైన ఉన్న చెప్పు'' దని కోరగా .

శ్రీమహేశ్వరుడు '' దేవీ ! జగత్ శుభకారియగు హనుమత్కవచమును చెప్పుచున్నాను. దీనిని రాముడు విభీషణునికి ఉపదేశించెను. ఇది గుప్తమైనది. అయినను నీకు చెప్పుచున్నాను. సుందరీ ! వినుము. ఉదయించు సూర్యుని వలె ప్రకాశించు వాడు, దీర్ఘభుజములు గలిగియున్న అనుపమ పరాక్రమవంతుడు, కోటి మన్మథ సమాన సుందరుడు, సర్వవిద్యా విశారదుడు , శ్రీరాముని హృదయమును ఆనంద పరచువాడు, భక్తులకు కల్పవృక్షమైనవాడు, భయరహితుడు, వరదాత అయిన హనుమానునకు చేతులు జోడించి వందనము చేయుచున్నాను.

హనుమానుడు, అంజనీపుత్రుడు, వాయుసుతుడు, మహా బలవంతుడు, రామునకుప్రియుడు, అర్జునునకు మిత్రుడు,

పసుపురంగుగల నేత్రములు గలవాడు, అనంత బలశాలి, సముద్రమును దాటినవాడు, సీతాశోక వినాశకుడు, లక్ష్మణ ప్రాణదాత, రావణుని అభిమానమును తొలగించినవాడు ఈ ద్వాదశ నామముల సర్వావస్థల యందు పఠించు వారికి ఎక్కడను ఎట్టి భయమునుండదు. వీరు సంగ్రామములందు విజయు లగుదురు. రాజద్వార కందరాది ఎట్టి స్థానములందైనను ఏవిధమైన భయమునుండదు.

సముద్ర జలరాశిని ఆటలాడుచుదాటి సీతాశోక రూపాగ్నిని గైకొని దానితో సమస్తలంకను దహనముగావించి భస్మము చేసినట్టి హనుమానునకు చేతులు జోడించి ప్రణామము చేయుచున్నాను'' అని ఈ విధముగ ప్రణామముగావించిన అనంతరము '' ఓం నమో హనుమతే సర్వ గ్రహాన్ '' అని మొదలుకొని ''హృదయాద్యం గన్యానం కృత్వా'' వరకు మంత్రముల నుచ్చరించుచు వినియోగము, అంగన్యాసాదులను గావించవలెను.

ప్రాతః కాలసూర్యుని వలె తేజ స్వరూపముగలవానిని, రాక్షసుల అభిమానమును తొలగించుటలో సమర్థుడైన వానిని, దేవతలలో ఒక ప్రముఖ దేవతగా నున్న వానిని, యశస్సును త్రిలోకములందు వ్యాపింప జేసిన వానిని, తన అసాధారణ శోభతో దేదీప్యమానుడై యున్న వానిని, సుగ్రీవాది గొప్ప గొప్ప వానరులు వెంటనున్న వానిని, సువ్యక్త తత్త్వమును ప్రేమించువారును, ఎఱ్ఱనికనులు పసుపు వస్త్రముతో అలంకృతుడైన హనుమానుని ధ్యానించుచున్నాను.

ఉదయించిన వెనువెంటనే కోట్ల సూర్యుల వలె ప్రకాశించువానిని, అందమైన వీరాసనముతో కూర్చున్న వానిని,

శరీరముపై యజ్ఞోపవీతాదుల ప్రకాశముతో శోభాయమానముగ కనిపించువానిని, మనోహరముగ శోభించు కర్ణకుండలములు గలవానిని , భక్తుల కోరికలు తీర్చువానిని, మునిజన వందితుని, వేద మంత్రములు వినినంతనే ప్రసన్నుడగువానిని, వానరకులాగ్ర గణ్యుని, సముద్రమును ఆవుగిట్టలచే నేర్పకగుంటను వలె చేసిన హనుమానుని ధ్యానించవలెను.

వజ్రమువలె కఠోరమైన శరీరముగల వానిని, శిరస్సుపై పచ్చని కేశములు శోభించు వానిని, సువర్ణ కర్ణకుండలములు ధరించినట్టి హనుమానుని ధ్యానించుచున్నాను.

స్ఫటిక మణి వలెను, సువర్ణకాంతితోను, ద్విభుజముల తోను, చేతులు జోడించి నిలబడి యున్న వానిని, రెండు చెవులయందు సువర్ణ కుండలములు శోభించువానిని, కమలసమాన సుందర ముఖము గల హనుమానుని ధ్యానించు చున్నాను.

కుడి భుజము నందు గద, ఎడమ చేతియందు కమండలము, కుడిభుజము కొంచెము పైకి ఎత్తిలేచువానిని ఇట్టి హనుమానుస ధ్యానించ వలెను.

అథమంత్రః- ''ఓం నమో హనుమతే'' ఇచటినుండి తీసికొని హ్లాం,హ్లీం,హ్లూం, ఫట్ ఘేఘే స్వాహా'' వరకు హనుమత్కవచ మంత్రముగ చెప్పబడినది.

**హనుమత్కవచము :**

శ్రీరామ చంద్రుడిట్లనెను. ''హనుమానుడు తూర్పు దిశను రక్షించుగాక. పవనాత్మజుడు దక్షిణ దిశను రక్షించుగాక, రాక్షసులను వధించు హనుమానుడు పశ్చిమ దిశను రక్షించుగాక, సముద్రము అవతలి గట్టుకు చేరిన హనుమానుడు ఉత్తర దిశను

రక్షించుగాక. కేసరి ప్రియపుత్రుడు అంతరిక్షమును రక్షించుగాక. భూతలమును విష్ణుభక్తుడు రక్షించుగాక. మధ్య భాగమును పవన పుత్రుడు రక్షించుగాక. సర్వాపదల నుండి లంకను జ్వాలింపజేసిన వాడు రక్షించుగాక. సుగ్రీవుని మంత్రి మస్తకమును రక్షించుగాక. వాయు నందనుడు లలాటమును రక్షించుగాక. కనుబొమల మధ్య భాగమును మహావీరుడు రక్షించుగాక. ఛాయను అపహరించిన హనుమానుడు నా నేత్రములను రక్షించుగాక. శ్రీరామ చంద్రుని సేనకుడు కర్ణమూల భాగమును రక్షించుగాక. నాసికాగ్ర భాగమును అంజనీ పుత్రుడు రక్షించుగాక. హరీశ్వరుడు ముఖమును రక్షించుగాక. రుద్ర ప్రియుడు వాక్కును రక్షించుగాక. పచ్చని నేత్రములు గల హనుమానుడు జిహ్వను రక్షించుగాక. అర్జున మిత్ర శ్రీ హనుమానుడు చిబుక భాగమును రక్షించుగాక. దైత్యుల దర్పమణచినవాడు కంఠమును రక్షించుగాక. చరణములతో ఆయుధములు చేయు పనిని గావించిన వాడు హస్తములను రక్షించుగాక. గోళ్ళనే ఆయుధములుగ చేసికొనిన హనుమానుడు గోళ్ళను రక్షించుగాక. కపీశ్వరుడు కుక్షిని రక్షించుగాక. ముద్రాపహరణము చేసినవాడు వక్షః స్థలమును రక్షించుగాక. భుజములతోనే శస్త్రాస్త్ర కార్యమును గావించిన వాడు పార్శ్వ భాగమును రక్షించుగాక. లంకను వినాశనము గావించిన వాడు నా పృష్ఠభాగమును రక్షించుగాక. రామదూత నాభి భాగమును రక్షించు గాక. వాయు పుత్రుడు కటిభాగమును రక్షించు గాక. మహా ప్రజ్ఞాశాలి గుహ్య భాగమును రక్షించుగాక. శివ ప్రియుడు లింగమును రక్షించుగాక. లంకా ద్వారములను నాశనము చేసినవాడు మోకాళ్ళను రక్షించుగాక. కపిశ్రేష్ఠుడు తొడలను రక్షించుగాక. మహా బలవంతుడు గుల్ఫభాగమును రక్షించుగాక. పర్వతములను

పెకలించిన వాడు నా రెండు కాళ్ళను రక్షించుగాక. సూర్యుని వలె ప్రకాశించు హనుమానుడు నామస్తకాంగములను రక్షించుగాక. అమిత బలశాలి హనుమానుడు నా కాళ్ళ వ్రేళ్ళను రక్షించుగాక. మహా శూరుడు నా సర్వాంగములను రక్షించుగాక. ఆత్మను గ్రహించు హనుమానుడు నా శరీరమును సమస్త రోగముల నుండి రక్షించుగాక. విద్వాంసులై ఈ హనుమత్కవచమును పఠించువారు సమస్త పురుషుల యందు శ్రేష్ఠులు. సమస్త భక్తి ముక్తులు వారికి లభించును. ఒక నెలవరకు త్రికాలము లందును లేక ఒక్క కాలమందును ఈ హనుమత్కవచమును పఠించువారు సమస్త శత్రువులను జయించి అతులనీయమైన లక్ష్మీనిధిని పొందెదరు. అర్ధరాత్రి సమయమున జలమందు నిలువబడి ఏడు మారులు ఈ కవచమును పఠించువారికి క్షయ, అపస్మారకము, కుష్ఠ, దైహిక, దైవిక, భౌతిక ఈ తాపములన్నియు తొలగిపోవును. ఆదివారము రోజున రావి చెట్టు క్రింద కూర్చొని ఈ స్తోత్రమును పఠించిన వారికి చలనము లేని లక్ష్మి ప్రాప్తించును, విజయము లభించును. బుద్ధి, బలము, యశస్సు, ధైర్యము, నిర్భయత్త్వము, ఆరోగ్యము, దృఢత్త్వము, మాటనేర్పు ఇవి అన్నియు హనుమానుని ధ్యానించిన వారికి లభించును.

వైరులను సంహరించువాడు, సర్వసంపత్తులకు నిధి అయినవాడు, శోకమును తొలగించుటలో అతికుశలుడు, రణధీరుడైన హనుమానునకు ప్రణామము చేయుచున్నాను. ఈ కవచమును వ్రాసి పూజించువారికి సర్వత్ర విజయము లభించును. దీనిని తమ భుజములకు ఎల్లప్పుడు కట్టుకొని యుండు వారికి లక్ష్మీప్రాప్తి గలుగును. బన్ధనమందు పడిన వారు బ్రాహ్మణుల ద్వార ఈ కవచమును జపింపజేసిన ఆ క్షణముననే బన్ధన ముక్తులగుదురు.

ఈశ్వరుడిట్లనెను : సూర్యచంద్రుల వలె ప్రకాశించు చరణ కమలములు గలవాడు, కాపీనమును మౌంజిని వస్త్రము ధరించి యజ్ఞోపవీత మృగ చర్మములతో శోభించువాడు, హస్తమందు పుస్తకము, మెరయు హారము వక్ష స్థలముపై ప్రశాశించువాడు, ప్రసన్న ముఖుడగు వాయు పుత్రునకు ప్రణామము చేయుచున్నాను.

సముద్రమును ఒక సాధారణమైన చిన్న చెరువుగా భావించి దాటిన వాడు, సీతాశోక తాపములను తొలగించిన వాడు, విష్ణు బక్తుడు, సంగ్రామమందు అక్షయ కుమారాది ఉద్దండ రాక్షసుల దర్పమణచిన వానర పుంగవుడు, వాయు పుత్ర హనుమానుడు మమ్ము రక్షించుగాక.

వజ్ర సమాన శరీరుడు, పచ్చని నేత్రములు గలవాడు, సువర్ణమయ కుండలముల కాంతిలో నిండిన కపోల భాగము కలవాడు, వజ్ర స్తంభమువలె బలమైన శరీరము గలవాడు, ఒక దెబ్బతో రావణుని వశము చేసికొన్నవాడు, తోకను పైకెత్తి సప్త పర్వతములు మోసిన భయంకర హనుమానుని ధ్యానించ వలెను. సర్వ సత్త్వ సారుడగు శ్రీరామ చంద్రుని గూడ ఇటు ధ్యానింప వలెను. వజ్ర సమాన కఠిన శరీరుడు, సువర్ణ కర్ణ కుండలములు గలవాడు, సర్వాభూషణుడు, హస్తమందు పూర్ణ కుంభమును ధరించి యుండువాడు, భక్తుల కోరికలు తీర్చు వాడు, సర్వదా ప్రసన్నుడు, త్రిలోకములను రక్షించు కోరికగలవాడు, సమస్త భువనములందు విరాజమానుడై యున్నట్టి రామదూత హనుమానునకు ప్రణామము చేయుచున్నాను.

ఎడమ చేతియందు శత్రువులను వధించుటకు పర్వతము నిలిపి యుండువాడు, కంఠమందు శృంఖలాహారము, దేదీప్యమానమైన కర్ణ సువర్ణ కుండలములు గల హనుమానునకు

ప్రణామము చేయు చున్నాను. కుండలములందు పొదిగిన పద్మరాగమణి కాంతితో కపోలములు గులాబి వర్ణము గలిగియున్నవాడు, అరటి తోటయందు నిలువబడి దివ్యరూపము ధరించిన హనుమానుని ధ్యానించు చున్నాను. ఎక్కడెక్కడ రామకథ కీర్తింపబడునో అక్కడ తలవంచి అంజలి ఘటించి నిలువబడియుండు వాడు, ఆనంద బాష్పములు నిండిన నేత్రములు గలవాడు, రాక్షసాంతకుడగు హనుమానునకు ప్రణామము.

మనో వేగముతో సమాన వేగము గలవాడు, వాయు వేగము వంటి వేగము గలవాడు, ఇంద్రియములను జయించిన వాడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, వాయు పుత్రుడు, వానర యూథముఖ్యుడు అయినట్టి శ్రీరామదూతకు శిరస్సువంచి ప్రణామము చేయుచున్నాను. వివాద సమయమున, జూదమాడు సమయమున, రాజవశమందు, సంగ్రామమందు, రాత్రియందు ఇంద్రియ నిగ్రహముతో మితాహారులై పదిమారులు ఈ కవచమును పఠించువారు సమస్త మానవులపై, శత్రువులపై విజయము పొందెదరు. భూతప్రేత, మహాదుర్గ, అరణ్య, సాగర, సింహవ్యాఘ్రాది భయములు సంభవించినప్పుడు, బాణాస్త్ర శస్త్రములు క్రిందపడినప్పుడు, శృంఖలాబంధనములతో కారాగృహమందు బందీలైనప్పుడు, కోపము వచ్చినప్పుడు, అగ్నిభయము గలిగినప్పుడు, దారుణమైన క్షేత్రమందు శోకసమయమందు, మహాసంగ్రామమందు, బ్రహ్మరాక్షసులను నివారించు సమయమున ఈ కవచమును పఠించ వలెను. ఇట్లు చేసిన వారికి విజయము లభించును. ఈ కవచమును భూర్జప త్రముపైనగాని, ఎరుపు వస్త్రముపైగాని, పట్టువస్త్రముపైగాని,

తాలపత్రముపైన గాని, త్రిగంధము లేక సిరాతో వ్రాసి పంచ లేక సప్త లేక త్రిలోహములతో తయారు చేయబడిన తాయెత్తులో నుంచి చేతికి గాని, నడుముకు గాని, భుజమునకు గాని, కంఠమందు గాని, లేక శిరస్సునందు గాని కట్టుకొనిన వారికి కోరికలు అన్నియు తీరును. ఇవి రాముడు చెప్పిన వచనములు, ఎప్పటికి నసత్యములు గావు. పరాజయమెరుగని రామునితో పూజింపబడిన హనుమాన్! నీకు ప్రణామములు.

నేను ఏపని మీద బయటికి వెళ్ళుచున్నానో ఆ పని పూర్తిగావలెను అనుచు ఇతర ప్రదేశమునకు వెళ్ళువారు క్షేమముగా ఆ పనిని నెరవేర్చుకొని శీఘ్రముగ తిరిగి వచ్చెదరు అని ఈ విధముగ శ్రీరామ చంద్రుడు చెప్పినప్పుడు రావణ సోదరుడైన విభీషణుడు పరమ ప్రసన్నుడయ్యెను. అతడు రాముని చరణములకు వందనములు గావించి ధన్యుడయ్యెను. సమస్త వేద శాస్త్రము లందు ప్రవిష్టమయిన పవిత్ర మనస్సు గలవాడు, దేవతల చేతను, మునిగణముల చేతను పూజింపబడువాడు హనుమంతుని శుభ ప్రదాత, కృష్ణ వర్ణ శరీరుడు, సువర్ణమువలె పచ్చని జడలు గలవాడు మునులలో అగ్రగణ్యుడైన శ్రీవ్యాసుల వారికి శిరస్సు వంచి ప్రణామములు చేయుచున్నాను.

ఉదయముననే లేచి ఈ కవచమును పఠించువారికి ఆయురారోగ్య సంతానాది సమస్తము లభించును. గిరీంద్రజా! నీ ప్రశ్నాను సారము హనుమత్కవచమును చెప్పితిని.

శ్రీరామదాసు ఇట్లనెను శిష్యా! ఈ విధముగ మహేశ్వరుడు పార్వతికి హనుమత్కవచమును వినిపించెను. పార్వతి వినిన రోజునే ఈ కవచమును పఠించుట ప్రారంభించెను.

దీనిని మొదట పఠించి తరువాత భక్తిపూర్వకముగ శ్రీరామ కవచమును పఠించ వలెను. హనుమత్కవచమువదలి రామ కవచమును పఠించిన వ్యర్థమగును. అందువలన రెండు కవచములను పఠించవలెను. రామభక్తులు దీనిని విశేషముగ ధ్యానించ వలెను.

**శ్రీ హనుమత్కవచ వివరణ సంపూర్ణము.**



# శ్రీ శత్రుఘ్న కవచమ్

అథ శత్రుఘ్న కవచం సుతీక్ష్ణ శృణుసాదరమ్ ।
సర్వకామ ప్రదం రమ్యం రామ సద్భక్తి వర్ధనమ్ ॥ 1

శత్రుఘ్నం ధృతకార్ముకం ధృత మహాతూణీర బాణోత్తమం-
పార్శ్వే శ్రీరఘు నన్దనస్య వినయా ద్వామే స్థితం సున్దరమ్ ।
రామం స్వీయ కరేణ తాలదల జం ధృత్వాఽతి చిత్రం వరం-
సూర్యాభం వ్యజనం సభాస్థిత మహాంతం వీజ యంతం భజే ॥ 2

ఓం అస్య శ్రీ శత్రుఘ్న కవచ మంత్రస్య అగస్తి ఋషిః । శ్రీ శత్రుఘ్నో దేవతా ! అనుష్టుప్ఛందః ! సుదర్శన- ఇతి బీజమ్! కైకేయీ నన్దన ఇతి శక్తిః । శ్రీ- భరతానుజ ఇతి కీలకమ్ । భరత మంత్రీత్య- స్త్రమ్ । శ్రీరామదాస ఇతి కవచమ్ । లక్ష్మణా- నుజ ఇతి మంత్రః । శ్రీ శత్రుఘ్న ప్రీత్యర్థ సకల- మనః కామ నాసిద్ధ్యర్థ జపేవినియోగః ।

అథాంగులిన్యాసః । ఓం శత్రుఘ్నాయ- అంగుష్ఠాభ్యాం నమః। ఓంసుదర్శనాయ- తర్జనీభ్యాం నమః । ఓం కైకేయీ నందన నాయ- మధ్య మాభ్యాం నమః । ఓం భరతానుజాయ- అనామికా భ్యాం నమః । ఓం భరత మంత్రిణే- కనిష్ఠికాభ్యాం నమః । ఓం శ్రీరామ దాసాయ కరతల- కరపృష్ఠా భ్యాం నమః । ఏవం హృదయాదిన్యాసః । లక్ష్మణాంశజేతి దిగ్బంధః ।

అథధ్యానమ్

రామస్య సంస్థితం వామే పార్శ్వే వినయ పూర్వకమ్ ।
కైకేయీ నన్దనం సౌమ్యం ముకుటే నాతిరంజితమ్ ॥ 3

రత్న కంకణ కేయూర వనమాలా విరాజితమ్ ।
రశనా కుండల ధరం రత్న హార సునూపురమ్ ॥ 4

వ్యజనేన వీజయంతం జానకీ కాంత మాదరాత్ ।
రామన్యస్తే క్షణం వీరం కైకేయీతోష వర్ధనమ్ ॥ 5

ద్విభుజం కంజనయనం దివ్య పీతాంబరా న్వితమ్ ।
సుభుజం సుందరం మేఘ శ్యామలం సున్దరాననమ్ ॥ 6

రామ వాక్యే దత్త కర్ణం రక్షోఘ్నం ఖడ్గ ధారిణమ్ ।
ధనుర్బాణధరం శ్రేష్ఠం ధృత తూణీరముత్తమమ్ ॥ 7

సభాయాం సంస్థితం రమ్యం కస్తూరీ తిలకాంకితమ్ ।
ముకుట స్థావతం సేన శోభితం చ స్మితాననమ్ ॥ 8

రవి వంశోద్భవం దివ్య రూపం దశరథాత్మజమ్ ।
మధురా వాసినం దేవం లవణాసుర మర్దనమ్ ॥ 9

ఏవం ధ్యాత్వాతు శత్రుఘ్నం రామ పాదేక్షణం హృది ।
పఠనీయం వరం చేదం కవచం తస్య పావనమ్ ॥ 10

పూర్వేత్వవతు శత్రుఘ్నః పాతు యామ్యే సుదర్శనః ।
కైకేయీ నన్దనః పాతు ప్రతీచ్యాం సర్వదామమ॥ 11

పాతూదీచ్యాం రామ బన్ధుః పాత్వధో భరతానుజః ।
రవివంశోద్భవ శ్చోర్ధ్వం మధ్యే దశరథాత్మజః ॥ 12

సర్వతః పాతు మామత్ర కైకేయీ తోష వర్ధనః ।
శ్యామలాంగః శిరః పాతు భాలం శ్రీ లక్ష్మణాంశజః ॥ 13

భ్రువోర్మధ్యే సదా పాతు సుముఖోఽత్రావనీతలే ।
శ్రుతకీర్తి పతిర్నేత్రే కపోలే పాతు రాఘవః ॥ 14

కర్ణే కుండల కర్ణోఽవ్యాన్నాసాగ్రం నృపవంశజః ।
ముఖం మమ యువా పాతు వాణీం పాతు స్ఫుటాక్షరః ॥ 15

జిహ్వాం సుబాహుతాతోఽవ్యాద్యూపకేతు పితాద్విజాన్ ।
చిబుకం రమ్య చిబుకః కంఠం పాతు సుభాషణః ॥ 16

స్కంధౌ పాతు మహాతేజా భుజౌ రాఘవ వాక్యకృత్ ।
కరౌమే కంకణ ధరః పాతు ఖడ్గీ నఖా న్మమ ॥ 17

కుక్షిం రామ ప్రియః పాతు పాతు వక్షః రఘూత్తమః ।
పార్శ్వే సురార్చితః పాతు పాతు పృష్ఠం వరాననః ॥ 18

జఠరం పాతు రక్షోఘ్నః పాతు నాభిం సులోచనః ।
కటిం భరతమంత్రీ మే గుహ్యం శ్రీరామ సేవకః ॥ 19

రామార్పిత మనాః పాతు లింగ మూరూస్మితాననః ।
కోదండ పాణిః పాత్వత్ర జానునీమమ సర్వదా ॥ 20

రామ మిత్రః పాతు జంఘే గుల్ఫౌ పాతు సూనూపురః ।
పాదౌనృపతి పూజ్యోఽవ్యాచ్ఛీ మాన్పాదాంగులీర్మమ ॥ 21

పాత్వంగాని సమస్తాని హృద్యాదారాంగః సదామమ ।
రోమాణి రమణీ యోఽవ్యాద్రాత్రౌ పాతు సుధార్మికః ॥22

దివసే సత్యసంధోఽవ్యాద్భోజనే శరసత్కరః ।
గమనే కలకంఠో ఽవ్యాత్సర్వదాలవణాంతకః ॥ 23

ఏవం శత్రుఘ్న కవచం మయాతే సముదీరితమ్ ।
యే పఠంతి నరాస్త్వే త త్తే నరాః సౌఖ్య భాగినః ॥ 24

శత్రుఘ్న స్య వరం చేదం కవచం మంగల ప్రదమ్ ।
పఠనీయం నరై ర్భక్త్యా పుత్ర పౌత్ర ప్రవర్ధనమ్ ॥ 25

అస్యస్తోత్రస్య పాఠేనయం యం కామం నరోఽర్థయేత్,
తంతం లభేన్నిశ్చయేన సత్యమే తద్వచో మమ ॥ 26

పుత్రార్థీ ప్రాప్నుయా త్పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్,
ఇచ్ఛాకామం తు కామార్థీ ప్రాప్నుయా త్పఠనాదినా ॥ 27

కవచ స్యాస్య భూమ్న్యాం హి శత్రుఘ్నస్య వినిశ్చయాత్,
తస్మాదేతత్సదా భక్త్యా పఠనీయం నరైః శుభమ్ ॥ 28

ఆ దౌనరైర్మారు తేశ్చ పఠిత్వా కవచం శుభమ్ ।
తతః శత్రుఘ్న కవచం పఠనీయ మిదం శుభమ్ ॥ 29

పఠనీయం భరతస్య కవచం పరమం తతః ।
తతః సౌమిత్రి కవచం పఠనీయం సదానరైః ॥ 30

పఠనీయం తతః సీతాకవచం భాగ్య వర్ధనమ్ ।
తతః శ్రీరామ చన్ద్రస్య కవచం సర్వథోత్తమమ్ ॥ 31

పఠనీయం నరైర్భ క్త్యా సర్వవాంఛిత దాయకమ్ ।
ఏవం షట్ కవచాన్యత్ర పఠనీయాని సర్వదా ॥ 32

పఠనం షట్ కవచానాం శ్రేష్ఠం మోక్షైక సాధనమ్ ।
జ్ఞాత్వాఽత్ర మానవైర్భక్త్యా కార్యంయః పఠనం సదా ॥ 33

అశక్తేనాత్ర చత్వారి పఠనీయాని సాదరమ్ ।
హనుమతశ్చ సౌమిత్రేః సీతాయారాఘవస్యచ ॥ 34

ఇమాని పఠనీయాని చత్వారి కవచాని హి ।
చతుర్ణాంక వచనాం చ పఠనే మానవస్య చ॥ 35

న యద్య త్రావ కాశశ్చేత్త దా త్రీణి పఠేన్నరః ।
మారుతేశ్చాథ సీతాయాస్త థా శ్రీరాఘవస్యచ ॥ 36

త్రయాణాం కవచానాం చన పాఠావ సరోయదా ।
పఠనార్థే మానవస్య తదాద్యే కవచేస్మృతే ॥ 37

మారుతేశ్చాథ రామస్య సీతాయా రాఘవస్యవా ।
నైకమేవ పఠేచ్చాత్ర శ్రీరామ కవచం శుభమ్ ॥ 38

అవకాశే కవచానాం షట్కమేవ సదానరైః ।
పఠనీయం క్రమేణైవ కర్తవ్యోనాలసః కదా ॥ 39

యదాఽవకారో నాస్త్యేవ తదా తేషాం సుఖాప్తయే ।
మయా విశేషః ప్రోక్తోఽ యం న సర్వేషాం మయేరితః ॥40

ఇతి శ్రీ శత్రుఘ్న కవచం సంపూర్ణమ్.

# శ్రీ శత్రుఘ్న కవచ వివరణ

''సుతీక్ష్ణా ! శత్రుఘ్న కవచమును చెప్పెదను ఆదరణతో వినుము. ఈ శత్రుఘ్న కవచము కూడ ఎల్ల కోరికలను తీర్చును. ఇది రామ భక్తిని పెంచును.

ధనుర్బాణములు ధరించి శ్రీరాముని దగ్గర వామ భాగమందు నిలువబడి తన చేతితో తాటిఆకు విసన కఱ్ఱను పట్టుకొని విసరువాడు, సూర్య కిరణ కాంతి వంటి కాంతి గలవాడు అయిన శత్రుఘ్నునకు ప్రణామము చేయుచున్నాను.

''అస్య శ్రీ'' నుండి ''లక్ష్మణాంశ జేతి దిగ్బన్ధః'' వరకు అంగన్యాసాది విధులు చెప్పబడినవి. దీని తరువాత ధ్యానము. రాముని చెంత ఎడమ భాగమందు వినయముగ నిలువ బడినవాడు, కైకను ఆనంద పరచు వాడు, సౌమ్య స్వరూపుడు, ముకుటముతో అందముగ కనిపించువాడు, రత్న కంకణములు గల వాడు, కేయూర వనమాలాలంకృతుడు, మెడయందు హారములు, కుండలములు గలవాడు, రత్నహారములు, నూపురములు ధరించినవాడు, ఆదరముతో రామ చంద్రునికి వింజామరతో విసరుచు రాముని వంక చూచుచు నుండు వాడు, కైకకు ఆనందము గలిగించువాడు, కమల సమాన నేత్రుడు, దివ్య పీతాంబరము ధరించిన వాడు, సుందరమైన భుజములు గలవాడు, మేఘము వలె శ్యామ వర్ణ శరీరుడు, రాముని వాక్కులను కర్ణములందు నిలుపువాడు, రాక్షసులను సంహరించువాడు, ఖడ్గము ధరించువాడు, ధనుర్బాణ సుసజ్జితుడు, పెద్ద అమ్ముల పొదిని ధరించిన వాడు, సభలో నుండు

వాడు, రమ్యమైన వాడు, కస్తూరీ తిలకము ధరించువాడు, ముకుట ముతోను, కుండలములతోను శోభించువాడు, నగుమోము గలవాడు, సూర్యవంశజుడు, దివ్య రూపధరుడు, దశరథుని పుత్రుడు, మధురానివాసి అయిన లవణాసురుని వధించిన వాడు, శ్రీరాముని చరణముల యందు, నేత్రముల యందు చూపు నిలిపి యుంచు శత్రుఘ్నుని ధ్యానించి ఈ ఉత్తమ శత్రుఘ్న కవచమును పఠించవలెను.

తూర్పువైపు శత్రుఘ్నుడు, దక్షణము వైపు సుదర్శనుడు, పశ్చిమమువైపు కైకేయీ నందనుడు మమ్ము రక్షించు గాక: ఉత్తరమున రామబంధువు, అధోభాగమున భరతుని తమ్ముడు, ఉపరి భాగమును సూర్యవంశజుడు, మధ్య భాగమును దశరథాత్మజుడు రక్షించు గాక. కైకకు ఆనందము గలిగించువాడు నాలుగు వైపుల రక్షించు గాక. శ్యామాంగము గల శత్రుఘ్నుడు మస్తకమును, లక్ష్మణాంశజుడు నా లలాటమును, అందమైన ముఖము గలవాడు కనుబొమల మధ్య భాగమును, శ్రుత కీర్తి పతి నేత్రములను, రాఘవుడు రెండు కపోలములను, కర్ణకుండలధారి నా కర్ణములను, నృప వంశజుడు నాసికాగ్ర భాగమును, యువ రూపధారి శత్రుఘ్నుడు నా ముఖమును, స్ఫుటముగ మాటాడు వాడు నా వాక్కును, సుబాహుని తండ్రి భుజములను, యూపకేతుని తండ్రి దంతములను, సుందరమైన గడ్డము గలవాడు నా గడ్డమును, అందముగ మాట్లాడువాడు నా కంఠమును, మహాతేజస్వి భుజములను, రామాజ్ఞను పాలించువాడు బాహువులను, కంకణధారి నా చేతులను, ఖడ్గ ధారి శత్రుఘ్నుడు గోళ్ళను, రామునికి ప్రియమైన వాడు నా ఉదరమును, రఘూత్త ముడు వక్షఃస్థలమును, సురార్చితుడు పార్శ్వ భాగమును,

వరాననుడు పృష్ఠ భాగమును, రక్షోఘ్నుడు జఠరమును, సులోచనుడు నాభిని, భరతుని మంత్రి నడుమును, శ్రీరామ సేవకుడు గుహ్య ప్రదేశమును, తనమనస్సును రామునికి అర్పించిన శత్రుఘ్నుడు లింగమును, నగుమోము గలవాడు ఊరువులను, ధనుస్సు ధరించిన వాడు సర్వదా నా తొడలను, రామమిత్రుడు మోకాళ్ళను, సుందర నూపురములు ధరించినవాడు చీలమండల ములను, నృపతి పూజ్యుడు కాళ్ళను, శ్రీమంతుడు వ్రేళ్ళను, ఉదారాంగుడు నా సమస్తాంగములను రక్షించుగాక. రమణీయమైన ఆకృతిగలవాడు రోమములను, సమాధి యందుండు వాడు రాత్రిపూట, సత్యసంధుడు పగటిపూట, సుందరమైన బాణమును ధరించి యుండు వాడు, భోజన సమయమున మంచిగ మాటాడువాడు ప్రయాణ సమయమునందు లవణాసురుని వధించిన శత్రుఘ్నుడు అన్ని వేళల నన్ను రక్షించుగాక. ఈ విధముగ శత్రుఘ్న కవచమును వినిపించితిని.

భక్తితో దీనిని పఠించువారు సుఖములను పొందెదరు. ఇది అందమైనది, మంగళ ప్రదమైనది, పుత్రపౌత్రులను వృద్ధి చేయునట్టిది. ఈ స్తోత్రమును పఠించువారికి కోరినది సఫలమగును. ఈ మాటలు సత్యము. ఇందెట్టి సంశయము లేదు. పుత్రులను కోరు వారికి పుత్రులు, ధనము కోరు వారికి ధనమును లభించును. ఈ భూమండలమున శత్రుఘ్న కవచము ఉత్తమమైనది. అందువలన అవశ్యము దీనిని పఠించవలెను.

మొదట హనుమానుని కవచము, తరువాత శత్రుఘ్న కవచమును పఠించ వలెను. దీని తరువాత భరతుని కవచము, ఆ తరువాత సౌమిత్రి కవచమును పఠించి, దీని తరువాత భాగ్యమును పెంచు సీతా కవచమును పఠించి, శ్రీరామ కవచమును పఠించ

వలెను. ఈ విధముగ సర్వ వాంఛిత ఫలముల నిచ్చు షట్ కవచము లను ప్రతిదినము పఠించ వలెను. ఈ ఆరు కవచములను పఠించుట శ్రేష్ఠము, మోక్షసాధనము అని తెలిసికొని సర్వదా వీనిని పఠించు చుండలెను.

ఈ విధముగ పఠించలేని వారు హనుమ, లక్ష్మణ, సీతారామ కవచములను పఠించ వలెను. ఈ నాలుగు కవచములను పఠించలేని వారు హనుమత్, సీతారామ కవచములను పఠించ వలెను. ఇవి మూడును పఠించుటకు సమయము లేనివారు హనుమత్, రాముల రెండు కవచములనైనను పఠించవలెను.

**శ్రీ శత్రుఘ్న కవచ వివరణ సంపూర్ణము.**



# శ్రీ భరత కవచమ్

అతః పరం భరతస్య కవచం తే వదామ్యహమ్ ।
సర్వ పాపహరం పుణ్యం సదా శ్రీరామ భక్తిదమ్ ॥ 1

కైకేయీ తనయం సదా రఘువరన్యస్తే క్షణం శ్యామలం-
సప్తద్వీప పతేర్వి దేహ తనయా కాంతస్య వాక్యేరతమ్ ।
శ్రీ సీతా ధవ సవ్య పార్శ్వ నికటే స్థిత్వావరం చామరం-
ధృత్వా దక్షిణతః కరేణ భరతం తం వీజయంతం భజే ॥ 2

ఓం అస్య శ్రీ భరత కవచ మంత్రస్య అగస్త్య ఋషిః ।
శ్రీ భరతో దేవతా అనుష్టుప్ఛందః । శంఖ ఇతి బీజమ్ ।
కైకేయీ నందన ఇతి శక్తిః । భరతఖండే శ్వర ఇతి ।
కీలకమ్ । రామానుజ ఇత్యస్త్రమ్ । సప్తద్వీపేశ్వర-
దాస ఇతి కవచమ్ । రామాంశజ ఇతి మన్త్రః । శ్రీ-
భరత ప్రీత్యర్థం సకల మనోరథ సిద్ధ్యర్థ జపే వినియో-
గః । అథాంగు లిన్యాసః । ఓం భరతాయ అంగుష్ఠా భ్యాం-
నమః । ఓం కైకేయీ నందనాయ మధ్య మాభ్యాం నమః ।

ఓం భరత ఖండేశ్వరాయ అనామికాభ్యాం నమః । ఓం రామాను- జాయ కనిష్ఠకా భ్యాం నమః । ఓం శంఖాయ- శిరసేస్వాహా। ఓం కైకేయీ నంద నాయ శిఖాయై- వషట్। ఓం భరత ఖండేశ్వరాయ కవచాయ- హుమ్ । ఓం రామానుజాయ నేత్రత్రయాయ- వౌషట్। ఓం సప్తదీపేశ్వరదాసాయ అస్త్రాయఫట్। రాంమాంశ జాయ చేతి దిగ్బంధః ।

అథ సధ్యానం భరత కవచమ్

రామచంద్ర సవ్య పార్శ్వే స్థితం కైకేయ జాసుతమ్ ।
రామాయ చామరేణైవ వీజయన్తం మనోరమమ్ ॥ 3

రత్నకుండల కేయూర కంకణాది విభూషితమ్
పీతాంబర పరీధానం వనమాలా విరాజితమ్ ॥ 4

మాండవీ ధౌత చరణం రశనానూ పురాన్వితమ్ ।
నీలోత్పల దలశ్యామం ద్విజరాజ సమాననమ్ ॥ 5

ఆజాను బాహుం భరత ఖండ స్య ప్రతిపాలకమ్ ।
రామానుజం స్మితాస్యం చ శత్రుఘ్న పరి వందితమ్ ॥ 6

రామన్యస్తే క్షణం సౌమ్యం విద్యుత్పుంజ సమప్రభమ్ ।
రామభక్తం మహావీరం వందే తం భరతం శుభమ్ ॥ 7

ఏవం ధ్యాత్వాతు భరతం రామ పాదేక్షణం హృది ।
కవచ పఠనీయం హి భరత స్యేదముత్త మమ్ ॥ 8

ఓం పూర్వతో భరతః పాతు దక్షిణే కైకయీా సుతః ।
నృపాత్మజః ప్రతీచ్యాం హి పాతూదీ చ్యాం రఘూత్తమః ॥ 9

అధః పాతు శ్యామలాంగ శ్చోర్ధ్వం దశరథాత్మజః ।
మధ్యే భారత వర్షేశః సర్వతః సూర్యవంశజః ॥ 10

శిరస్తక్ష పితాపాతు భాలం పాతు హరిప్రియః ।
భ్రువోర్మధ్యం జనక జా వాక్యైక తత్పరోఽవతు ॥ 11

పాతు జనక జామాతా మమ నేత్రే సదాఽత్రహి ।
కపోలే మాండవీ కాంతః కర్ణమూలే స్మితాననః ॥ 12

నాసాగ్రం మే సదా పాతు కైకేయీతోష వర్ధనః ।
ఉదారాంగో ముఖే పాతు పాతు వాణీం జటాధరః ॥ 13
పాతు పుష్కరతాతో మే జిహ్వాం దంతాన్ ప్రభామయః ।
చిబుకం వల్కల ధరః కంఠంపాతు వరాననః ॥ 14
స్కంధౌ పాతు జితారాతిర్భుజౌ శత్రుఘ్న వందితః ।
కరౌ కవచ ధారీ చ నఖాన్ ఖడ్గ ధరోఽవతు ॥ 15
కుక్షిం రామానుజః పాతుః వక్షః శ్రీరామ వల్లభః ।
పార్శ్వే రాఘవ పార్శ్వస్థః పాతు పృష్ఠం సుభాషణః ॥ 16
జఠరం చ ధనుర్ధారీ నాభిం శరకరోఽవతు ।
కటిం పద్మేక్షణః పాతు గుహ్యం రామైక మానసః ॥ 17
రామ మిత్రః పాతు లింగమూరూ శ్రీరామ సేవకః ।
నందిగ్రామ స్థితః పాతు జానునీ మమ సర్వదా ॥ 18
శ్రీరామ పాదుకాధారీ పాతు జంఘే సదామమ ।
గుల్ఫౌ శ్రీరామ బన్ధుశ్చ పాదౌ పాతు సురార్చితః ॥ 19
రామాజ్ఞా పాలకః పాతు మమాంగాన్యత్ర సర్వదా ।
మమ పాదాంగులీః పాతు రఘువంశ విభూషణః ॥ 20
రోమాణి పాతు మే రమ్యః పాతు రాత్రౌ సుధీర్మమ ।
తూణీర ధారీ దివసే దిక్పాతు మమ సర్వదా ॥ 21
సర్వకాలేషు మాం పాతుపాంచజన్యః సదా భువి ।
ఏవం శ్రీభరత స్యేదం సుతీక్ష్ణ కవచం శుభమ్ ॥ 22
మయా ప్రోక్తం తవాగ్రేహి మహామంగల కారకమ్ ।
స్తోత్రాణాముత్తమం స్తోత్ర మిదం జ్ఞేయం సుపుణ్యదమ్ ॥ 23

పఠనీయం సదా భక్త్యా రామ చన్ద్రస్య హర్షదమ్ ।
పఠిత్వా భరత స్యేదం కవచం రఘునందనః ॥ 24

యథా యాతి పరం తోషం తథాస్యకవచేన న।
తస్మాదేతత్సదా జప్యం కవచానామ నుత్తమమ్ ॥ 25

అస్యాత్ర పఠనాన్మర్త్యః సర్వాన్కామానవాప్ను యాత్ ।
విద్యాకామో లభేద్విద్యాం పుత్రకామో లభేత్సు తమ్ ॥ 26

పత్నీ కామోలభే త్పత్నీం ధనార్థీ ధన మాప్నుయాత్ ।
యద్యన్మనోఽభిలషితం తత్తత్కవచ పాఠతః ॥ 27

లభ్యతే మానవైరత్ర సత్యం సత్యం వదామ్యహమ్ ।
తస్మాత్సదా జపనీయం రామో పాసక మానవైః ॥ 28

ఇతి శ్రీ భరత కవచం సంపూర్ణం.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీ భరత కవచ వివరణ

''సుతీక్ష్ణా ! భరతుని కవచము చెప్పెదను వినుము. పాపములను హరించు శ్రీరామ భక్తిని చేకూర్చు భరతునకు వందనము.

శ్రీరామ చంద్రుని వైపు తదేక ధ్యానముగ చూచువాడు, శ్యామ వర్ణుడు, రామ చంద్రుని ఆజ్ఞతో సప్త ద్వీపములకు అధిపతి అయిన్నవాడు, రామునికి కుడివైపు నుండి కుడి చేతితో సుందర వింజామరము వీచువాడు అగు భరతుని ధ్యానించుచున్నాను. ''అస్య శ్రీ'' మొదలు ''రామాంశజాయ చేతి దిగ్బంధ'' అను వరకు అంగన్యాసాది విధులు చెప్పబడినవి. దీని తరువాత ధ్యానము

శ్రీరామ చంద్రునికి కుడివైపున కూర్చుండి రామునికి వింజామరలు వీచువాడు, సుందర రత్నకుండలములు, కేయూర కంకణాది విభూషణములు గల వాడు, పీతాంబరధరుడు, వనమాలాలంకృతుడు, మాండవిచే చరణములు కడిగించు కొనువాడు, నూపుర విరాజితుడు, నీల కమల శ్యామ స్వరూపుడు, చంద్ర బింబము వంటి ముఖము గలవాడు, ఆజాను బాహువులు గల వాడు, భరత ఖండమును పాలించిన వాడు, రాముని తమ్ముడు, శత్రుఘ్నునిచే పూజింపబడువాడు, నగుమోము గలవాడు, రామునివైపు దృష్టి సారించు వాడు, సౌభాగ్య స్వరూపుడు, మెరుపు వలె ప్రకాశించు వాడు, రామభక్తుడు, మహా పరాక్రమవంతుడైన భరతుని ధ్యానించి కొద్దిసేపు రామచంద్రుని చరణములను స్మరించ వలెను. తరువాత భరతుని కవచము పఠించ వలెను.

తూర్పువైపు భరతుడు, దక్షణము వైపు కైకేయి సుతుడు, పశ్చిమమున నృపాత్మజుడు, ఉత్తరమున రఘూత్తముడు నన్ను రక్షించుగాక. నేలను శ్యామలాంగుడు, ఊర్ధ్వ భాగమును

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ

దశరథాత్మజుడు, భరత ఖండ మధ్య భాగమును ప్రభువు, సూర్య వంశమందు త్పున్నుడైన భరతుడు నాలుగు దిక్కులను రక్షించు గాక. తక్షకుని తండ్రి నా మస్తకమును, హరి ప్రియుడు నా లలాట మును, జానకీ ఆజ్ఞా తత్పరుడు అయిన భరతుడు కనుబొమల మధ్య భాగమును రక్షించు గాక. సీతమ్మను తల్లి వలె భావించు భరతుడు నా నేత్రములను, మాండవీ ప్రియతముడు నా కపోలము లను, మందహాస ముఖమండలుడగు భరతుడు నా కర్ణమూల ములను, కైక ఆనందమును పెంపొందించు వాడు నా నాసాగ్రమును, ఉగ్రాంగములు గలవాడు ముఖమును, జటాధారి భరతుడు నా వాక్కును, పుష్కరుని తండ్రి జిహ్వను, ప్రభామ యుడు దంతము లను, వల్కల ధరుడు గడ్డమును, సుందరా కారుడగు భరతుడు నా కంఠమును, శత్రువులను జయించువాడు నా మూపులను, శత్రుఘ్న వందితుడు భుజములను, కవచధారి హస్తములను, ఖడ్గధారి గోళ్ళను, రాముని తమ్ముడు ఉదరమును, శ్రీరామ వల్లభుడు వక్షః స్థలమును, రాముని ప్రక్కనున్నవాడగు భరతుడు నా ప్రక్క భాగములను, అందముగ మాటాడు వాడు పృష్ఠ భాగమును, ధనుర్ధరుడు జఠరమును, శరకరుడు నాభిని, కమల నేత్రుడు నడుమును, ఒకే రామ నామము స్మరించు వాడు నా గుహ్య భాగమును, రాముని మిత్రుడు లింగమును, శ్రీరామ సేవకుడు ఊరువులను, నంది గ్రామమందుండు భరతుడు మోకాళ్ళను, శ్రీరాముని పాదుకలను శిరస్సుపై ధరించిన వాడు నా పిక్కలను, శ్రీరామ బంధువు మడమలను, సురార్చిత భరతుడు నా కాళ్ళను, రాముని ఆజ్ఞా పాలకుడు సర్వదా సర్వాంగములను, రఘువంశ ఉత్తమ భూషణుడు నా కాలి వేళ్ళను, రమ్యవపుర్ధారి భరతుడు నా రోమములను, రాత్రి సమయమును మంచి బుద్ధిగల భరతుడు, తూణీరధారి భరతుడు పగటి సమయమున సమస్త దిక్కులందు రక్షించుగాక. పాంచజన్యము అన్ని వేళల నన్ను రక్షించుగాక.

సుతీక్ష్ణా ! ఈ విధముగ శ్రీ భరతుని కవచము వినిపించితిని. ఇది శుభములు చేకూర్చును. ఉత్తమమైన స్తోత్రము, పుణ్యదాయకమైన స్తోత్రము, శ్రీరామునికి ఆనందము గలుగజేయవలెనని కోరుకొను వారు ముందు ఈ భరతుని కవచము పఠించి, తరువాత శ్రీరాముని కవచమును పఠించ వలెను. ఈ కవచమును పఠించిన శ్రీరామ చంద్రుడు తన కవచమును వినినప్పటి కంటె ఎక్కువగా ప్రసన్నుడగును అందువలన ఈ కవచమును అవశ్యము పఠించ వలెను. ఇది చదివిన వారికి ఎల్ల కోరికలు తీరును. విద్యను కోరు వారికి విద్య, పుత్రులను కోరు వారికి పుత్రులు, పత్నిని పొందగోరు వారికి పత్నిని, ధనము కోరువారికి ధనమును ప్రాప్తించును. ఈ విధముగ ఏది కోరిన అది లభించును. ఇది సత్యము. రామోపాసకులు దీనిని పఠించ వలెను.

**శ్రీ భరత కవచ వివరణ సంపూర్ణము.**



# శ్రీ లక్ష్మణ కవచమ్

సౌమిత్రం రఘునాయక కస్య చరణ ద్వం ద్వేక్షణం శ్యామలం
బిభ్రాణం స్వకరేణ రామశిరసి ఛత్రం విచిత్రం వరమ్ ।
బిభ్రంతం రఘునాయకస్య సుమహాత్కో దండ బాణాసనే-
తం వందే కమ లేక్షణం జనక జా వాక్యే సదా తత్పరమ్ ॥ 1

ఓం అస్య శ్రీ లక్ష్మణ కవచ మంత్రస్య । ఆగస్త్య ఋషిః । అను ష్టు ప్ఛందః । శ్రీ లక్ష్మణో దేవతా । శేషేతి బీజమ్ । సుమిత్రా నందన ఇతి శక్తిః । రామానుజ ఇతి కీలకమ్ । రామదాస ఇత్యస్త్రమ్। రఘువంశజ ఇతి కవచమ్ । సౌమిత్రి రితిమంత్రః । శ్రీ లక్షణ ప్రీత్యర్థం సకల మనో‌‌ఽ- భిలషిత సిద్ధ్యర్థే జపే వినియోగః । అథాంగు లిన్యాసః । ఓం లక్షణాయ అంగుష్ఠా భ్యాం నమః । ఓం శేషాయ తర్జ- నీభ్యాం నమః । ఓం సుమిత్రానందనాయ మధ్య మాభ్యాం- నమః । ఓం రామానుజాయ అనామికాభ్యాం నమః । ఓం- రామదాసాయ కనిష్ఠికాభ్యాం నమః । ఓం రఘువంశజాయ- కరతల కర పృష్ఠాభ్యాం నమః । ఏవం హృదయాద్యంగ- న్యాసః। ఓం లక్ష్మణాయ హృదయాయ నమః । ఓం శేషాయ- శిరసే స్వాహా । ఓం సౌమిత్రాయ శిఖాయై వషట్ । రామా- నుజాయ కవచాయ హుమ్ । రామదాసాయ నేత్రత్రయా- య వౌషట్ । రఘువంశజాయ అస్త్రాయ ఫట్ । ఓం సౌమిత్రయే ఇతి దిగ్బంధః ॥

## ధ్యానమ్

రామ పృష్ఠస్థితం రమ్యం రత్నకుండల ధారిణమ్ ।
నీలోత్పల దలశ్యామం రత్నకంకణ మండితమ్ ॥ 2

రామస్య మస్తకే దివ్యం బిభ్రంతం ఛత్రముత్తమమ్ ।
వీరం పీతాంబర ధరం ముకుటే నాతి శోభితమ్ ॥ 3

తూణీరే కార్ముకే చాపి బిభ్రస్తం చ స్మితాననమ్ ।
రత్నమాలాధరం దివ్యం పుష్పమాలా విరాజితమ్ ॥ 4

ఏవం ధ్యాత్వా లక్ష్మణం చ రాఘవ న్యస్తలోచనమ్ ।
కవచం జపనీయం హి తతో భక్త్యాఽ త్రమానవైః ॥ 5

లక్ష్మణః పాతుమే పూర్వే దక్షిణే రాఘవానుజః ।
ప్రతీచ్యాం పాతు సౌమిత్రిః పాతూదీ చ్యాంరఘూత్తమః ॥ 6

అధః పాతు మహావీరశ్చోర్ధ్వంపాతు నృపాత్మజః ।
మధ్యేపాతు రామదాసః సర్వతః సత్యపాలకః ॥ 7

స్మితాననః శిరః పాతు భాలం పాతూర్మిలాధవః ।
భ్రువోర్మధ్యే ధనుర్ధారీ సుమిత్రానంద నోఽ క్షిణీ ॥ 8

కపోలే రామమంత్రీ చ సర్వదాపాతువై మమ ।
కర్ణమూలే సదాపాతు కబంధ భుజ ఖండనః ॥ 9

నాసాగ్రం మే సదాపాతు సుమిత్రానంద వర్ధనః ।
రామన్యస్తేక్షణః పాతు సదామేఽ త్రముఖంభువి ॥ 10

సీతావాక్య కరః పాతు మమ వాణీం సదాఽ త్రహి ।
సౌమ్యరూపః పాతు జిహ్వామనన్తః పాతుమే ద్విజాన్ ॥ 11

చిబుకం పాతురక్షోఘ్నః కంఠంపాత్వ సురార్దనః ।
స్కంధౌ పాతు జితారాతిర్భుజౌ పంకజలోచనః ॥ 12

కరౌ కంకణధారీ చ నఖాన్ రక్తనఖోఽవతు ।
కుక్షింపాతు వినిద్రో మే వక్షః పాతు జితేన్ద్రియః ॥ 13

పార్శ్వే రాఘవ పృష్ఠస్థః పృష్ఠ దేశం మనోరమః ।
నాభిం గంభీర నాభిస్తు కటించ రుక్మమేఖలః ॥ 14

గుహ్యం పాతు సహస్రాస్యః పాతు లింగం హరిప్రియః ।
ఊరూపాతు విష్ణుతల్పః సుముఖోఽవతు జానునీ ॥ 15
నాగేంద్రః పాతు మే జంఘే గుల్ఫౌ నూపురవాన్మమ ।
పాదా వంగదతాతోఽవ్యాత్ పాత్వంగాని సులోచనః ॥ 16
చిత్రకేతు పితా పాతు మమ పదాంగులీః సదా ।
రోమాణి మే సదా పాతు రవివంశ సముద్భవః ॥ 17
దశరథసుతః పాతు నిశాయాం మమ సాదరమ్ ।
భూగోలధారీమాం పాతుదివసే దివసే సదా ॥ 18
సర్వకాలేషు మాం మింద్రజి ద్ధం తాఽవతు సర్వదా ।
ఏవం సౌమిత్రి కవచం సుతీక్ష్ణ కథితంమయా ॥ 19
ఇదం ప్రాతః సముత్థాయయే పఠంత్యత్ర మానవాః ।
తేధన్యా మానవా లోకే తేషాం చ సఫలోభవః ॥ 20
సౌమిత్రేః కవచస్యాస్య పఠనా న్నిశ్చయేనహి ।
పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనార్థీ ధనమా ప్నుయాత్ ॥ 21
పత్నీకామో లభేత్పత్నీం గోధనార్థీతు గోధనమ్ ।
ధాన్యార్థీ ప్రాప్నుయాద్ధాన్యం రాజ్యార్థీ రాజ్య మాప్నుయాత్ ॥ 22
పఠితం రామకవచం సౌమిత్రి కవచం వినా ।
ఘృతేన హీనో నైవేద్య స్తేన దత్తో న సంశయః ॥ 23
కేవలం రామ కవచం పఠితం మానవైర్యది ।
తత్పాఠేన సుసంతుష్టో న భవేద్ర ఘునందనః ॥ 24
అతః ప్రయత్నత శ్చేదం సౌమిత్రి కవచం నరైః ।
పఠనీయం సర్వదైవ సర్వవాంఛిత దాయకమ్ ॥ 25

ఇతి శ్రీ లక్ష్మణ కవచం సంపూర్ణమ్

# శ్రీ లక్ష్మణ కవచ వివరణ

సుతీక్ష్ణునితో అగస్త్యులవారు లక్ష్మణ కవచమును చెప్పుట.

సదా రఘునాథుని చరణములను దర్శించు లక్ష్మణునికి వందనములు చేయుచున్నాను. తన హస్తముతో రామ చంద్రుని శిరస్సుపై ఛత్రము పట్టువాడు, భుజముపై రామచంద్రుని ధనస్సును ధరించి యుండువాడు, సర్వదా జానకీ ఆజ్ఞా పాలన తత్పరుడు, కమల నేత్రుడగు లక్ష్మణునకు వందనములు.

''అస్య శ్రీ'' మొదలు ''ఓం సౌమిత్రయే ఇతి దిగ్బంధః'' అనునంత వరకు వినియోగ అంగన్యాసవిధి చెప్పబడినది. దాని తరువాత లక్ష్మణుని ధ్యానము. రామ చంద్రునికి వెనుక కూర్చుండువాడు, మనోహర స్వరూపుడు, కర్ణములకు రత్న కుండలములు గలవాడు, నీల కమల సమాన ముఖ కాంతి గలవాడు, చేతులకు రత్న కంకణములు గలవాడు, రామునిపై దివ్య ఛత్రమును పట్టువాడు, సుందర పీతాంబర ధరుడు, ముకుటముతో శోభాయమానముగ కనిపించువాడు, అమ్ముల పొదిని ధనస్సును ధరించువాడు, మందహాసము ఖార విందము గలవాడు, కంఠము నందు రత్నమాలను ధరించిన దివ్య వేషుడు, పుష్పహారములతో అందముగ కనిపించువాడు, రామ చంద్రునిపై దృష్టి నిలిపియుంచువాడు అయిన లక్ష్మణుని ధ్యానించి భక్తితో లక్ష్మణ కవచమును పఠించ వలెను.

లక్ష్మణుల వారు తూర్పుభాగమును, దక్షిణ భాగమును రాఘవానుజుడు, పశ్చిమమును సౌమిత్రి; ఉత్తర భాగమును రఘూత్తముడు రక్షించుగాక. క్రింది భాగమును రఘువీరుడు, పై భాగమును నృపాత్మజుడు, మధ్య భాగమును రామదాసు, నాలుగు

వైపుల సత్య పాలకుడు రక్షించుగాక. శిరస్సును స్మితాననుడు, లలాటమును ఊర్మిలాధవుడు, కనుబొమల మధ్యను ధనుర్ధారి, నేత్రములను సుమిత్రానందనుడు రక్షించుగాక. కపోలములను రామమంత్రి సదా రక్షించుగాక. చెవులను కబంధ భుజములు ఖండించిన లక్ష్మణుడు రక్షించుగాక. సుమిత్రకు ఆనందమును పెంపొందించిన వాడు నాసికాగ్ర భాగమును రక్షించుగాక. సదా రాముని వైపు చూచు లక్ష్మణుడు నా ముఖమును రక్షించుగాక. సీత ఆజ్ఞను పాలించు లక్ష్మణుడు సర్వదా నా వాక్కును రక్షించుగాక.

సౌమ్య రూపధరుడు జిహ్వను, ఆనంద రూపుడు లక్ష్మణుడు దంతములను రక్షించుగాక. రాక్షసులను వధించినవాడు చిబుకమును, అసురులను ఓడించిన వాడు కంఠమును, శత్రువులను జయించినవాడు భుజములను, కమల నేత్రములు గల లక్ష్మణుడు భుజములను, కంకణ ధారి చేతులను, ఎఱ్ఱని గోళ్ళు గలవాడు నా గోళ్ళను, నిద్రారహితుడగు లక్ష్మణుడు నా ఉదరమును, జితేంద్రియుడు నా వక్షః స్థలమును రక్షించుగాక. రామ చంద్రునికి వెనుక కూర్చుండు లక్ష్మణుడు నా పృష్ఠ భాగమును, గంభీరమైన నాభిగల లక్ష్మణుడు నాభిని, సువర్ణ వడ్డాణము గల వాడు నడుమును, శేషావతారుడు మలద్వారమును, హరి ప్రియుడగు లక్ష్మణుడు లింగమును, విష్ణువు వలె నుండు లక్ష్మణుడు మోకాళ్ళను, సుందర రూపధరుడు పిక్కలను, సర్పముల రాజు తొడలను, నూపురధారి చీల మండలమును, రాజ పూజ్యుడు కాళ్ళను, అందమైన నేత్రములు గల లక్ష్మణుడు నా సర్వాంగములను రక్షించు గాక. చిత్రకేతుని తండ్రి కాలి వేళ్ళను, సూర్య వంశమం దుత్పన్నమయిన లక్ష్మణుడు రోమములను రక్షించుగాక.

రాత్రి సమయమును దశరథ పుత్రుడు, పగటి సమయమును భూగోళధారి లక్ష్మణుడు రక్షించుగాక. ఇంద్రజిత్తును వధించిన వాడు సర్వదా నన్ను రక్షించుగాక.

సుతీక్ష్ణా ! ఈ విధముగ లక్ష్మణ కవచమును వినిపించితిని. ఉదయముననే లేచి ఈ కవచమును పఠించువారు ధన్యులు, వారి జన్మ సఫలము. లక్ష్మణుని ఈ కవచమును పఠించిన పుత్రులను కోరు వారికి పుత్రులు, ధనము కోరు వారికి ధనమును ప్రాప్తించును. పత్నిని పొందగోరువారు పత్నిని, గోధనమును పొందగోరు వారు గోధనమును, ధాన్యము పొందగోరు వారు ధాన్యమును, రాజ్యమును పొందగోరు వారు రాజ్యమును పొందుదురు. లక్ష్మణ కవచమును చదువక రామ కవచము పఠించిన వ్యర్థమగును. నెయ్యిలేకుండ నైవేద్యము పెట్టినట్లగును.

కేవలము రామకవచము చదివిన రామచంద్రుడు విశేషముగ ప్రసన్నుడు కాడు. అందువలన ఎల్ల కోరికలు తీరవలెనని కోరువారు ఈ లక్ష్మణ కవచమును అవశ్యము పఠించవలెను.

శ్రీ లక్ష్మణ కవచ వివరణ సంపూర్ణము.



# శ్రీ సీతా కవచమ్

శ్రీరామదాస ఉవాచ

శృణు శిష్య ప్రవక్ష్యామి సీతాయాః కవచం శుభమ్ ।
పురాప్రోక్తం సుతీక్ష్ణాయ పృచ్ఛతే కుంభజన్మనా ॥ 1

ఏకదాకుంభ జన్మానం సుతీక్ష్ణః ప్రాహవై మునిః ।
రహః స్థితం గురుం దృష్ట్వా ప్రణమ్య భక్తి పూర్వకమ్ ॥ 2

సుతీక్ష్ణ ఉవాచ

గురోఽహం శ్రోతు మిచ్ఛామి సీతాయాః ప్రీతిదాని హి ।
యాని స్తోత్రాణి కర్మాణి తానిత్వం వక్తు మర్హసి ॥ 3

అగస్తి రువాచ

సమ్యక్ పృష్టం త్వయావత్స సావధానమనాః శృణు ।
ఆదౌ వక్ష్యా మ్యహం రమ్యం సీతాయాః కవచం శుభమ్ ॥ 4

యా సీతాఽవనిం సభవాఽథ మిథిలా పాలేన సంవర్ధితా-
పద్మాక్ష నృపతేః సుతా నలగతా యామాతులుంగోద్భవా ।
యారత్నే లయ మాగతా జలనిధౌయా వేదపారంగతా
సీతాసా మృగలోచనా శశిముఖీ మాం పాతురామ ప్రియా ॥ 5

అస్య శ్రీ సీతా కవచ స్తోత్ర మంత్రస్య అగస్తి ఋషిః । శ్రీ సీతా దేవతా । అనుష్టుప్ఛన్దః । రామేతి బీజమ్ । జనక జేతి శక్తిః । అవని జేతి కీలకమ్ । పద్మాక్షసుతేత్య- స్త్రమ్ । మాతులుంగీతి కవచమ్ । మూలకా- సురఘాతి నీతి మన్త్రః । శ్రీ సీతారామ చన్ద్ర ప్రీత్య- ర్థం సకల కామనాసిద్ధ్యర్థే జపే వినియోగః ।

అథాంగు లిన్యాసః ఓం హ్లాం సీతాయై అంగుష్ఠా భ్యాం-
నమః । ఓం హ్లీం రామాయై తర్జనీ భ్యాం నమః । ఓం- హ్లూం
జనక జాయై మధ్య మా భ్యాం నమః । ఓం హ్లైం-. అవని జాయై
అనామి కాభ్యాం నమః । ఓం హ్లౌం పద్మాక్ష సుతాయై కనిష్ఠికా భ్యాం
నమః । ఓం హ్లః మాతులుంగా- యై కరతల కర పృష్ఠాభ్యాం నమః।
ఏవం హృద యా - ద్యన్యాసు కార్యః ।

అథధ్యానమ్

సీతాం కమల పత్రాక్షీం విద్యుత్పుంజ సమప్రభామ్ ।
ద్విభుజాం సుకుమారాంగీం పీత కౌశేయ వాసినీమ్ ॥ 6
సింహాసనే రామచన్ద్ర వామ భాగ స్థితాం వరామ్ ।
నానాలంకార సంయుక్తాం కుండల ద్వయ ధారిణీమ్ ॥ 7
చూడా కంకణ కేయూర రశనానూ పురాన్వితామ్ ।
సీమంతే రవి చంద్రా భ్యాం నిటలే తిలకేనచ ॥ 8
మయూరా భరణే నాపి ఘ్రాణేఽతి శోభితాం శుభమ్ ।
హరిద్రాం కజ్జలం దివ్య కుంకుమం కుసుమాని చ॥ 9
బిభ్రతీం సురభిద్రవ్యం సుగన్ధస్నేహ ముత్తమమ్ ।
స్మితాననాం గౌర వర్ణాం మందార కుసుమం కరే ॥ 10
బిభ్రన్తీ మపరే హస్తే మాతులుంగ మనుత్తమమ్ ।
రమ్యహా సాంచ బింబోష్ఠీం చన్ద్ర వాహన లోచనామ్ ॥ 11
కలానాథ సమానాస్యాం కలకంఠ మనోరమామ్ ।
మాతులుంగోద్భవాం దేవీం పద్మాక్ష దుహితాం శుభామ్ ॥ 12
మైథిలీం రామ దయితాం దాసీభిః పరివీజితామ్ ।
ఏవం ధ్యాత్వా జనక జాం హేమ కుంభ పయోధరామ్ ॥ 13
సీతాయాః కవచ దివ్యం పఠనీయం శుభావహమ్ ।
శ్రీ సీతా పూర్వతః పాతు దక్షిణేఽవతు జానకీ ॥ 14

ప్రతీచ్యాం పాతు వైదేహీ పాతూదీ చ్యాం చ మైధిలీ ॥ 15
అధః పాతు మాతులుంగీ ఊర్ధ్వం పద్మాక్ష జాఽవతు ।
మధ్యేఽవనిసుతా పాతు సర్వతః పాతు మాం ఠరమా ॥ 16
స్మితాననా శిరః పాతు పాతు భాలం నృపాత్మజా ।
పద్మాఽవతు భ్రువోర్మధ్యే మృగాక్షీ నయనేఽవతు ॥ 17
కపోలే కర్ణమూలే చ పాతు శ్రీరామ వల్లభా ।
నాసాగ్రం సాత్వికీ పాతు పాతు వక్త్రం తు రాజసీ ॥ 18
తామసీ పాతు మద్వాణీం పాతు జిహ్వాం పతివ్రతా ।
దంతాన్ పాతు మహా మాయా చిబుకం కనక ప్రభా ॥ 19
పాతు కంఠం సౌమ్యరూపా స్కంధౌ పాతు సురార్చితా ।
భుజౌ పాతు వరారోహా కరౌ కంకణ మండి తా ॥ 20
నఖాన్ రక్తనఖా పాతు కుక్షింపాతు లఘూదరా ।
వక్షః పాతు రామ పత్నీ పార్శ్వే రావణ మోహినీ ॥ 21
పృష్ఠదేశే వహ్ని గుప్తాఽవతు మాం సర్వదైవహి ।
దివ్యప్రదా పాతు నాభిం కటిం రాక్షస మోహినీ ॥ 22
గుహ్యం పాతు రత్న గుప్తా లింగం పాతు హరిప్రియా ।
ఊరూరక్షతు రంభో రూ ర్జానునీ ప్రియ భాషిణీ ॥ 23
జంఘే పాతు సదా సుభ్రూర్గు ల్ఫౌ చామర వీజితా ।
పాదౌలవ సుతా పాతు పాత్వంగాని కుశాంబికా ॥ 24
పాదాంగులీ సదా పాతు మమ నూపురనిః స్వనా ।
రోమాణ్య వతు మేనిత్యం పీత కౌశేయ వాసినీ ॥ 25
రాత్రౌ పాతు కాలరూపా దినే దానైక తత్పరా ।
సర్వ కాలేషు మాం పాతు మూల కాసుర ఘాతినీ ॥ 26

ఏవం సుతీక్ష్ణ ! సీతాయాః కవచం తే మయేరితమ్ ।
ఇదం ప్రాతః సముత్థాయ స్నాత్వా నిత్యం పఠేత్తుయః ॥ 27

జానకీం పూజయిత్వాచ సర్వా న్కా- మానవా ప్నుయాత్ ।
ధనార్థీ ప్రాప్ను యాద్ ద్రవ్యం పుత్రార్థీ పుత్ర మాప్నుయాత్ ॥28

స్త్రీ కామార్థీ శుభాం నారీం సుఖార్థీ సౌఖ్య మాప్నుయాత్ ।
అష్టవారం జపనీయం సీతాయాః కవచసదా ॥ 29

అష్టభ్యో విప్రవర్యే భ్యో నరః ప్రీత్యాఽర్పయేత్సదా ।
ఫలపుష్పాది కాదీని యాని తాని పృథక్పృథక్ ॥ 30

సీతాయాః కవచం చేదం పుణ్యం పాతక నాశనమ్ ।
యే పఠంతి నరా భక్త్యాతే ధన్యా మానవా భువి ॥ 31

పఠంతి రామ కవచం సీతాయాః కవచం వినా ।
తథావినా లక్ష్మణ స్య కవచేన వృథా స్మృతమ్ ॥ 32

తస్మాత్సదా నరైర్జా ప్యం క వచానాం చతుష్టయమ్ ।
ఆదౌతు వాయు పుత్రస్య లక్ష్మణ స్యతతః పరమ్ ॥ 33

తతః పఠేచ్చ సీతాయాః శ్రీరామస్యతతః పరమ్ ।
ఏవం సదా జపనీయం కవచానాం చతుష్టయమ్ ॥ 34

ఏవం సుతీక్ష్ణ సీతాయాః కవచం తే మయేరితమ్ ।
అతః పరం శృణు స్వాన్యత్సీ యాః స్తోత్ర ముత్తమమ్ ॥ 35

యస్మిన్నష్టోత్తర శతం సీతా నామాని సంతిహి ।
అష్టోత్తర శతం సీతానామ్నాం స్తోత్ర మనుత్తమమ్ ॥ 36

యే పఠంతి నరాస్త్వత్ర తే షాంచ సఫలో భవః ।
తేధన్యా మానవాలోకే తే వైకుంఠం వ్రజంతి హి ॥ 37

ఇతి శ్రీ సీతా కవచం సంపూర్ణమ్.

# శ్రీ సీతా కవచ వివరణ

శ్రీరామదాసు ''శిష్యా! సీతాకవచమును చెప్పుచున్నాను.

ఒక సమయమున అగస్త్యుని చెంతకు సుతీక్ష్ణుడు వెళ్ళి భక్తితో నమస్కరించి 'గురూత్తమా! సీతాదేవి ప్రసన్నురాలగు స్తోత్రమును, కవచమును వినగోరు చున్నాను దయతో చెప్పు' డని కోరెను.

అగస్త్యులవారు ''వత్సా! ఉత్తమ ప్రశ్న నడిగితివి. సావధానుడవై వినుము. ప్రథమముగా సీతా కవచమును వినిపించెదను. పృథ్వి నుండి ఉత్పన్నయైనది, మిధిలా నరేశునిచే లాలన పాలన గావింపబడినది, మాతులుంగముతో ఉత్పన్నయై పద్మాక్షుడను రాజునకు పుత్రిక అని పిలువబడినది, సముద్రరత్నముల యందు లీనమై యుండునది, నాలుగుమారులు లంకకు వెళ్ళినట్టిది, చంద్రవదన, మృగనయన, రాముని ప్రియపత్నియైన సీత నన్ను రక్షించుగాక.

''అస్యశ్రీ'' మొదలు ''ఏవం హృదయా ద్యంగ న్యాసః'' అనువరకు అంగన్యాస విధానము చెప్పబడియున్నది. దీని తరువాత ధ్యానము. దీని అర్థము ఈ విధముగ తెలిసికొనవలెను. పద్మ పత్రమును బోలు నేత్రములు మెరుపుల సమూహము వలె ప్రకాశము గలిగి యున్నది, ద్విభుజములపై పీతాంబరము ధరించునది, సింహాసనముపై శ్రీరాముని వామ భాగమందు కూర్చుండునది, కర్ణకుండలములు, శిరస్సున చూడామణి, భుజములకు కేయూరములు, నడుమునకు వడ్డాణము, పాపటయందు సూర్య చంద్రాభరణములు, నుదుట తిలము, ముక్కునకు మయూరాకార సుందరాభూషణము, పసుపు, కుంకుమ, కాటుక, వివిధ రంగుల పుష్పములు, పలు రకములైన సుగంధ ద్రవ్యములు దాల్చినది, నగుమోముతో నొప్పునది, గౌరవర్ణము గలది, ఒక చేతియందు మందార పుష్పము, రెండవ

చేతియందు ఉత్తమ మాతులుంగ ఫలముతో విరాజిల్లునది, మృదువైన మందహాసము, బింబ సమాన అధరము, మృగ నేత్రములు, చంద్రుని వంటి ముఖబింబము, మధురమైన కోకిల కంఠము, మాతులుంగ (నిమ్మ చెట్టు)ము నుండి ఉత్పన్నమైన పద్మాక్ష నృపతి పుత్రిక, రామ భామిని, దాసీలచే పంకా విసరించు కొనునట్టిది, స్తనములు సువర్ణకలశము వలెనుండునది, అగుసీతను ధ్యానించి ఈ దివ్య సీతా కవచమును పఠించ వలెను.

తూర్పు దిక్కున సీత నన్ను రక్షించుగాక, దక్షిణమువైపు జానకి రక్షించుగాక. పశ్చిమ దిక్కున వైదేహి రక్షించుగాక. ఉత్తరమున మైథిలి రక్షించుగాక. భూభాగమున మాతులుంగియు, ఉపరి భాగమున పద్మాక్షజయు, మధ్య భాగమున అవని సుతయు, నాలుగు వైపుల రమ రక్షించుగాక.

స్మితానన శిరస్సును, నృపాత్మజ నుదుటిని, పద్మ కను బొమలను, నేత్రములను మృగాక్షి రక్షించుగాక. శ్రీరామ చంద్రుని ప్రియతమ కపోలములను, కర్ణ మూలములను రక్షించ వలెను. సాత్వికి నాసికాగ్ర భాగమును, రాజసి ముఖమును, తామసి వాక్కును, పతివ్రత జిహ్వను, మహామాయ దంతములను, కనక ప్రభ చిబుకమును, సౌమ్య రూపిణి కంఠమును, సురార్చిత భుజము లను, వరారోహ బాహువులను, కంకణ మండిత హస్తములను రక్షించుగాక. రక్తనఖములను, లఘూదర కుక్షిని, రామపత్ని వక్షః స్థలమును, రావణ మోహిని పార్శ్వ భాగములను, వహ్నిగుప్త నాపృష్ఠ భాగమును రక్షించుగాక. దివ్య ప్రద నాభిని, రాక్షసమోహిని నడు మును, రత్న గుప్త గుహ్యమును, హరిప్రియ లింగమును రక్షించు గాక. రంభోరు రెండు మోకాళ్ళను, ప్రియ భాషిణి జానుభాగ మును రక్షించుగాక. చక్కని కనుబొమలు గలది పిక్కలను, చామర వీజిత చీల మండలమును, కుశాంబిక శరీర సర్వాంగములను రక్షించుగాక. నూపురనిః స్వన కాలి వ్రేళ్ళను, పీతాంబర ధారిణి

రోమములను రక్షించుగాక. రాత్రి సమయమును కాలరూపిణి, దినమును దానైక తత్పరయు, అన్ని సమయములను మూలకాసుర ఘాతిని రక్షించుగాక.

సుతీక్ష్ణా ! ఈ విధముగ సీతా కవచమును వినిపించితిని. ఉదయమునే లేచి స్నానముచేసి నిత్యము దీనిని పఠించి జానకీ దేవిని పూజించ వలెను. అప్పుడు మన కోరికలన్ని తీరును. ధనము కోరు వారికి ధనమును, పుత్రులను కోరు వారికి పుత్రులనొసగును. స్త్రీలు కోరికలు తీరి సౌఖ్యమును పొందెదరు. ఉపాసకులు 8 మారులు సీతా కవచమును జపించి 8 మంది బ్రాహ్మణులకు ఫల పుష్పాది వస్తువులను వేరువేరుగ దాన మీయ వలెను. ఈ సీతా కవచము పవిత్రమైనది, పాపములను నశింపజేయునది. భక్తితో దీనిని పఠించినవారు జగత్తునందు ధన్యులు.

మొదట హనుమానుని కవచము, తరువాత లక్ష్మణ కవచము, తరువాత సీతా కవచము తరువాత శ్రీరామ కవచము పఠించ వలెను.

**శ్రీ సీతా కవచ వివరణ సంపూర్ణము.**



# శ్రీరామ కవచమ్

ఇదానీం రామ కవచం శ్రుణు శిష్య వదామితే ।
పరం గుహ్యాం పవిత్రం చ సర్వవాంఛిత పూరకమ్ ॥ 1

సుతీక్ష్ణస్త్వే కదాఽగస్తిం ప్రోవాచ రహసి స్థితమ్ ।
భగవన్ పరమానంద తత్త్వజ్ఞ కరుణానిధే ।
గురోత్వం మాం వద స్వాద్య స్తోత్రం రామస్య పావనమ్ ॥ 2

ఆజాను బాహు మరవింద దలాయ తాక్ష-
మాజన్మ శుద్ధ దరసహాసముఖ ప్రసాదమ్ ।
శ్యామం గృహీత శర చాప ముదార రూపం-
రామం సరామ మభిరామ మనుస్మరామి ॥ 3

శ్రుణు వక్ష్యామ్యహం సర్వం సుతీక్ష్ణముని సత్తమ ।
శ్రీరామ కవచం పుణ్యం సర్వకామ ప్రదాయ కమ్ ॥ 4

అద్వైతానన్ద చైతన్య శుద్ధ సత్త్వైక లక్షణః ।
బహిరంతః సుతీక్ష్ణాత్ర రామచన్ద్రః ప్రకాశతే ॥ 5

తత్త్వ విద్యార్థినో నిత్యం రమంతే చిత్సు ఖాత్మని ।
ఇతి రామ పదే నాసౌ పరబ్రహ్మో భి దీయతే ॥ 6

జయరామేతి యన్నామ కీర్తయన్నభి వర్ణయేత్ ।
సర్వపాపై ర్వినిర్ముక్తో యాతి విష్ణోః పరం పదమ్ ॥ 7

శ్రీరామేతి పరం మంత్రం తదేవ పరమం పదమ్ ।
తదేవ తారకం విద్ధి జన్మ మృత్యు భయాపహమ్ ॥ 8

అస్య శ్రీరామ కవచస్య అగస్త్య ఋషిః అనుష్టుప్ ఛన్దః-
సీతా లక్ష్మణోపేతః శ్రీరామ చంద్రో దేవతా-
శ్రీరామ చన్ద్ర ప్రసాద సిద్ధ్యర్థజపే వినియోగః ।
అథధ్యానం ప్రవక్ష్యామి సర్వాభీష్ట ఫలప్రదమ్ ।
నీల జీమూత సంకాశం విద్యుద్వర్ణాంబరావృతమ్ ॥ 9

కోమలాంగ విశాలక్షం యువాన మతి సుందరమ్ ।
సీతా సౌమిత్రి సహితం జటాముకుట ధారిణమ్ ॥ 10

సాసితూణ ధనుర్బాణ పాణిం దానవ మర్దనమ్ ।
సదా చోరభయే రాజభయే శత్రుభయే తథా ॥ 11

ధ్యాత్వా రఘుపతిం యుద్ధే కాలానల సమప్రభమ్ ।
చీర కృష్ణా జిన ధరం భస్మోద్ధూలిత విగ్రహమ్ ॥ 12

ఆ కర్ణా కృష్ట సశర కోదండ భుజ మండితమ్ ।
రణేరిపూన్ రావణాదీం స్తీక్ష్ణ మార్గణ వృష్టిభిః ॥ 13

సంరంతం మహావీర ముగ్రమైంద్ర రథస్థితమ్ ।
లక్ష్మణా ద్యైర్మహా వీరై ర్వృతం హనుమదాది భిః ॥ 14

సుగ్రీవా ద్యైర్మహా వీరైః శైలవృక్ష కరోద్యతైః ।
వేగాత్కరాల హుం కారై ర్భుభుక్కార మహారవైః ॥ 15

నదద్భిః పరివాదద్భిః సమరే రావణం ప్రతి ।
శ్రీరామ శత్రు సంఘాన్మే హన మర్దయ ఖాదయ ॥ 16

భూత ప్రేత పిశాచాదీన్ శ్రీరామాశు వినాశయ ।
ఏవం ధ్యాత్వా జపేద్రామ కవచం సిద్ధిదాయకమ్ ॥ 17

సుతీక్ష్ణ వజ్రకవచం శృణు వక్ష్యామ్యనుత్తమమ్ ।
శ్రీరామః పాతు మే మూర్ధ్ని పూర్వే చ రఘు వంశజః ॥ 18

దక్షిణే మే రఘువరః పశ్చిమే పాతుపావనః ।
ఉత్తరే మే రఘుపతి ర్భాలం దశరథాత్మజః ॥ 19

భ్రువోర్దూర్వాదల శ్యామస్తయోర్మ ధ్యేజనార్దనః ।
శ్రోత్రం మేపాతు రాజేంద్రో దృశౌ రాజీవలోచనః ॥ 20

ఘ్రాణం మే పాతు రాజర్షిర్గండం మే జానకీ పతిః ।
కర్ణమూలే ఖరధ్వంసీ భాలం మే రఘువల్లభః ॥ 21

జిహ్వాం మే వాక్పతిః పాతు దంత పజ్క్త్యోరఘూత్తమః ।
ఓష్ఠౌ శ్రీ రామ చంద్రో మే ముఖం పాతు పరాత్పరః ॥ 22

కంఠంపాతు జగద్వం ద్యః స్కంధౌమే రావణాంతకః ।
భుజామే పాతు వాలిఘ్నః ధనుర్బాణ ధరః సదా ॥ 23

సర్వాణ్యం గులిపర్వాణి హస్తౌ మే రాక్షసాంతకః ।
వక్షోమే పాతు కాకుత్స్థః పాతుమే హృదయం హరిః ॥ 24

స్తనౌ సీతాపతిః పాతు పార్శ్వౌమే జగదీశ్వరః ।
మధ్యం మే పాతు లక్ష్మీశో నాభిం మే రఘునాయకః ॥ 25

కౌసల్యేయః కటింపాతు పృష్ఠం దుర్గతి నాశనః ।
గుహ్యం పాతు హృషీకేశః సక్థినీ సత్య విక్రమః ॥ 26

ఊరూశార్ఙ్గ ధరః పాతు జానునీ హనుమత్ప్రియః ।
జంఘేపాతు జగద్వ్యం ద్యః పాదౌ మే తాట కాంతకః ॥ 27

సర్వాగం పాతుమే విష్ణుః సర్వసంధీననామయః ।

జ్ఞానేన్ద్రియాణి ప్రాణా దీన్పాతుమే మధుసూదనః ॥ 28

పాతు శ్రీరామ భద్రో మే శబ్దా దీన్విష యానపి ।
ద్విపదాదీని భూతాని మత్సం బంధీని యానిచ ॥ 29

జామదగ్న్య మహాదర్ప దలనః పాతుతానిమే ।
సౌమిత్రి పూర్వజః పాతు వాగాదీ నీంద్రి యాణిచ॥ 30

రోమాంకు రాణ్య శేషాణి పాతు సుగ్రీవరాజ్యదః ।
వాఙ్మనోబుద్ధ్య హహం కారైర్జ్ఞానాజ్ఞాన కృతానిచ ॥ 31

జన్మాంన్తరే కృతానీహపాపాని వివిధానిచ ।
తాని సర్వాణి దగ్ధ్వాశు హర కోదండ ఖండనః ॥ 32

పాతుమాం సర్వతో రామః శార్ఙ్గ బాణధరః సదా ।
ఇతి శ్రీరామ చంద్రస్య కవచం వజ్రసం మితమ్ ॥ 33

గుహ్యాద్ గుహ్యతమం దివ్యం సుతీక్ష్ణముని సత్తమ ।
యః పఠే చ్ఛృణు యాద్వాపి శ్రావ యే ద్వా సమాహితః ॥ 34

సయాతి పరమం స్థానం రామ చంద్ర ప్రసాదతః ।
మహాపాతక యుక్తో వా గో ఘ్నో వా భ్రూణ హా తథా ॥ 35

శ్రీరామ చన్ద్ర కవచ పఠనా చ్ఛుద్ధి మాప్నుయాత్ ।
బహ్మహత్యాదిభిః పాపైర్ముచ్యతే నాత్ర సంశయః ॥ 36

భోః సుతీక్ష్ణ ! యథా పృష్టం త్వయా మమ పురా శుభమ్ ।
తథా శ్రీరామ కవచం మయాతే వినివేదితమ్ ॥ 37

శ్రీరామదాస ఉవాచ

ఏవం శిష్యత్వయా పృష్టం శ్రీరామ కవచం పరమ్ ।
హనుమత్కవచం చాపి తథాతే విని వేదితమ్ ॥ 38

వాయుపుత్రస్య రామస్య కవచేఽత్ర నరైర్భువి ।
వినాసీతా కవచేన పఠనీయం నవై కదా ॥ 39

ఆదౌ పఠిత్వా కవచం వాయు పుత్రస్య ధీ మతః ।
పఠనీయం తతః సీతా కవచం సౌఖ్య వర్ధనమ్ ॥ 40

తతః శ్రీరామ కవచం పఠనీయం మహత్తమమ్ ।
ఏవమే వహి మంత్రాశ్చ జపనీయాస్త్రయః క్రమాత్ ॥ 41

ఇతి శ్రీమదానన్ద రామాయణే వాల్మీకీయే
మనోహర కాండే కవచ ద్వయ వర్ణనం
నామత్రయోదశః సర్గః ॥

ఇతి శ్రీరామ కవచం సంపూర్ణమ్

# శ్రీరామ కవచ వివరణ

''శిష్యా ! ఇప్పుడు నీకు రామ కవచము చెప్పుచున్నాను. ఇది పరమ గోప్యమైనది, పరమ పవిత్రమైనది, కోరికలను తీర్చునది. ఒక సమయమున సుతీక్ష్ణుడు తన గురువైన అగస్త్యుని ఏకాంతమున

''భగవానుడా ! పరమానంద దాతా ! తత్త్వజ్ఞా ! కరుణానిధీ! నేడు నేను శ్రీరామ చంద్రుని పునీత స్తోత్రమును విన గోరు చున్నా''నని అడుగగా అగస్త్యుడు ''మోకాలు వరకు బాహువులు ఉన్నవాడు, కమల సమాన విశాల నేత్రుడు, జన్మతోనే ప్రసన్నమైన ముఖము గలవాడు, ధనుర్బాణములు ధరించి యుండు వాడు, ఉదార రూపుడు అయిన అభిరామ రాముని ధ్యానించు చున్నాను. ముని సత్తమా ! కోరికలు తీర్చు శ్రీరామ కవచమును చెప్పు చున్నాను. సుతీక్ష్ణా ! ఈ జగత్తు వెలుపల లోపల సమస్త స్థానము లందు అద్వయానంద స్వరూపుడు శుద్ధ సత్త్వగుణ మయుడగు శ్రీరామ చంద్రుడు ప్రకాశించు చున్నాడు. పరమాత్మ తత్త్వమును తెలిసిన వారు ఆచిత్సుఖానందమును దోచు కొందురు. ఆ పరబ్రహ్మయే ''రామ'' నామముతో పిలువ బడుచున్నాడు. ''జయరామ'' యను ఈ మంత్రమును కీర్తించు వారు సమస్త పాపవిముక్తులై విష్ణుభగవానుని పరమ పదము పొందెదరు. శ్రీరామ మంత్రము సర్వ శ్రేష్ఠమైనది. ఇది పరమ పదము నిచ్చును. మృత్యు భయాదులను తొలగించును. ''శ్రీరామ'' అని అనువారు పరబ్రహ్మ ప్రాప్తి నొందెదరు. ఇందులో సంశయము లేదు. వినియోగానంతరము సమస్త కోరికలను తీర్చువానిని ధ్యానించుట చెప్పుచున్నాను.

నీలమేఘ శరీరము గలవాడు, మెరుపువలె మెరయు పీతాంబరమును ధరించినవాడు, కోమలమైన అంగములు, విశాలమైన నేత్రములు గలవాడు, అతి సుందర యువకుడు, సీతాలక్ష్మణ సమేతుడు, జటామకుటమును ధరించిన వాడు, ఖడ్గము, అమ్ములపొది, ధనుర్బాణములు చేతియందుం డువాడు, దానవ సంహారి అయిన శ్రీరామ చంద్రుని రాజభయము, చోర భయము, సంగ్రామ భయములు సంభవించినప్పుడు ధ్యానించవలెను.

పీతాంబరము కృష్ణమృగ చర్మము ధరించినవాడు, భస్మము దాల్చినవాడు, చెవి వరకు ధనస్సు తాడు లాగియుంచు వాడు, సంగ్రామ భూమియందు రావణాది రాక్షసులపై తీవ్రమైన బాణ వృష్టి కురిపించిన వాడు, ఇంద్రుని రథముపై మహావీరునివలె కూర్చుండి శత్రుసంహారము గావించినవాడు, లక్ష్మణ హనుమదాదివీరులతో కలిసియున్న వాడు అగు శ్రీరాముని ధ్యానించవలెను.

భయంకర హుంకారములు చేయుచు చేతులతో శిలలను, పెద్దపెద్ద వృక్షములను తీసికొని రావణుని యుద్ధమునకు పిలచు సుగ్రీవాది యోధులతో గూడిన శ్రీరామా । నా శత్రువులను వధింపుము, భూతప్రేత పిశాచాదులను సంహరింపుము'' అని శ్రీరామ చంద్రుని ధ్యానింపుము. సిద్ధిదాయక శ్రీరామ కవచమును జపింపుము.

అగస్త్యుడు ''సుతీక్ష్ణా ! అత్యుత్తమైన రామకవచమును చెప్పుచున్నాను వినుము. శ్రీరాముడు నా శిరస్సును ఊర్ధ్వ దిశ

యందుండి రక్షించుగాక, నాకు తూర్పు దిశ యందుండి రక్షించుగాక, నాకు దక్షిణ దిశ యందుండి రఘువరుడు, పశ్చిమ దిశయందుండి పవిత్రుడగు రాముడు రక్షించుగాక. ఉత్తర దిశయందుండి రఘుపతి, లలాటమును దశరథాత్మజుడు రక్షించవలెను.

దూర్వాదల సమాన శ్యామ వర్ణుడగు జనార్ధనుడు కనుబొమల మధ్య భాగమును రక్షించుగాక. కర్ణములను రాజేంద్రుడు, కనులను రాజీవ లోచనుడు, నాసికమును రాజర్షి, గండ స్థలమును జానకీ పతి, కర్ణమూలములను ఖరధ్వంసి, లలాటమును రఘువల్లభుడు రక్షించుగాక. జిహ్వను వాక్పతి, దంతములను రఘూత్తముడు, రెండు పెదవులను ముఖమును పరాత్పర భగవానుడు రక్షించుగాక. కంఠమును జగద్వన్ద్యుడు, బాహువులను రావణాంతకుడు, భుజములను వాలిని వధించిన ధనుర్బాణధారి రాముడు రక్షించుగాక. వక్షః స్థలమును కాకుత్థ్సుడు, హరి భగవానుడు నా హృదయమును రక్షించుగాక. రెండు స్తనములను సీతాపతి, పార్శ్వభాగమును జగదీశ్వరుడు, మధ్య భాగమును లక్ష్మీపతి, నాభిని శ్రీ రఘునాథుడు రక్షించుగాక. నడుమును కౌసల్యా పుత్రుడు, వీపును దుర్గతి నాశనుడు, గుప్త భాగములను హృషీకేశుడు, ఎముకలను సత్యవిక్రముడు రక్షించుగాక. శార్ఙ్గధరుడు తొడలను, హనుమత్ప్రియుడు మోకాళ్ళను, జగద్ వ్యాపకుడు పిక్కలను, తాటకను జంపిన వాడు నా కాళ్ళను రక్షించుగాక. విష్ణు భగవానుడు సర్వాంగములను, అనామయుడు నా శరీరమును మధుసూదన భగవానుడు నా

ప్రాణమును, జ్ఞానేంద్రియములను రక్షించుగాక. శ్రీరామ భద్రుడు శబ్దాది విషయములను రక్షించుగాక. నాతో సంబంధమున్న ప్రాణులను (మనుష్యాదులను) పరశురాముని దర్పమణచిన వాడు రక్షించుగాక. సౌమిత్రి పూర్వజుడు (రాముడు) వాగాదులగు నింద్రియములను రక్షించుగాక. సుగ్రీవునికి రాజ్యమొసగిన శ్రీరామ చంద్రుడు నా సమస్త రోమకూపములను రక్షించుగాక.

వాక్కు, మనస్సు, బుద్ధి, అహంకారములతో తెలిసి తెలియక చేసిన ఈ జన్మ పాపములను జన్మాంతర పాపములను దహింపజేసి శివధనస్సును విరచిన శ్రీరాముడు నన్ను అన్నివైపుల రక్షించు గాక.

సుతీక్ష్ణా ! ఈ వజ్ర సదృశ రామకవచము గూఢాతి గూఢమైనది. దీనిని పఠించిన వారు, వినువారు, ఇతరులకు వినిపించువారు, శ్రీరామ చంద్రుని కృపతో పరమధామము పొందుదురు. ఎట్టి మహాపాతకములు చేసినను, గోహత్యలు చేసినను, భ్రూణ హత్యలు చేసినను ఈ శ్రీరామ కవచమును పఠించిన వారు శుద్ధులై బ్రహ్మహత్యాది పాతకములనుండి విముక్తులగుదురు. ఇందులో ఎట్టి సంశయము లేదు. హే సుతీక్ష్ణా! నీవు అడిగిన శ్రీరామ కవచమును వినిపించితిని''.

శ్రీరామదాసు ఇట్లనెను. ''శిష్యా! శ్రీరామ కవచమును, హనుమత్కవచమును అడిగితివి. నేను వినిపించితిని. రామకవచము, హనుమత్కవచము, సీతాకవచము చేయనిదే చేయకూడదు. మొదట హనుమత్కవచమును పఠించి తరువాత

సీతాకవచమును పఠించ వలెను. ఆ తరువాత సర్వశ్రేష్ఠమైన శ్రీరామ చంద్ర కవచమును పఠించ వలెను.

ఈ విధంగా ఈ మూడు కవచములను ఒకేసారి యే పఠించవలెను.

**శ్రీ రామ కవచ వివరణ సంపూర్ణము.**



# ప్రముఖులతో రచయిత్రి



అవధూత దత్త పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారితో రచయిత్రి



శృంగేరి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థ స్వామివారితో రచయిత్రి



శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారితో రచయిత్రి



శ్రీ శ్రీ శ్రీ చిన్మయానంద స్వామివారితో రచయిత్రి



శ్రీ శ్రీ శ్రీ దయానంద సరస్వతి స్వామివారితో రచయిత్రి

విశ్వమందిర పీఠాధిపతులు భగవాన్ శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్
స్వామివారితో రచయిత్రి



పుష్పగిరి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ విద్యానృసింహ భారతీతీర్థ స్వామివారితో రచయిత్రి



వైష్ణవ పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామి
వారి నుండి [illegible] బిరుదును స్వీకరిస్తున్న రచయిత్రి



శ్రీ రామనామక్షేత్ర సంస్థాపకులు "సమర్థ" శ్రీ రాగం ఆంజనేయులు గారి ద్వారా
ఆధ్యాత్మిక తత్త్వ వారధి బిరుదును స్వీకరిస్తున్న రచయిత్రి



నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ యన్.టి.రామారావు, లక్ష్మీపార్వతి దంపతులతో రచయిత్రి



నాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్, నేటి భారత ఉప రాష్ట్రపతి శ్రీ కృష్ణకాంత్ ద్వారా
పురస్కారాన్ని స్వీకరిస్తున్న రచయిత్రి



తన ఇష్టదైవమైన శ్రీ కృష్ణ భగవానునితో రచయిత్రి

## ఈ రచయిత్రి ఇతర రచనల గురించి .....

### శ్రీ గర్గ సంహిత (రెండవ భాగము)



శ్రీ గర్గసంహిత (రెండవ భాగము) గ్రంథాన్ని ది. 5-1-1996న
శ్రీ విల్లిపుత్తూరు ప్రాంగణం - రాజమండ్రిలో ఆవిష్కరిస్తున్న
వైష్ణవ పీఠాధిపతులు
**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామి వారు**
ఆధ్యాత్మిక రచయిత్రి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి

# శ్రీ గర్గ సంహిత (మొదటి భాగము)

శ్రీ గర్గసంహిత (మొదటి భాగము) గ్రంథాన్ని ది. 22-4-1994న
సికింద్రాబాద్ - జింఖానా గ్రౌండ్స్‌లో ఆవిష్కరిస్తున్న
వైష్ణవ పీఠాధిపతులు
**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామి వారు**
ఆధ్యాత్మిక రచయిత్రి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి

# శ్రీ కృష్ణ సహస్ర నామావళి వివరణ



శ్రీ కృష్ణ సహస్ర నామావళి వివరణ గ్రంథాన్ని ది. 21-7-1985న
రాజ్‌భవన్ (హైదరాబాద్) లో ఆవిష్కరిస్తున్న
**భారత రాష్ట్రపతి గౌ॥ శ్రీ [illegible]**
ఆధ్యాత్మిక రచయిత్రి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి

# శ్రీ శివ సహస్ర నామావళి వివరణ

శ్రీ శివ సహస్ర నామావళి వివరణ గ్రంథాన్ని ది. 15-6-1988న
ఉపరాష్ట్రపతి భవన్ (న్యూఢిల్లీ) లో ఆవిష్కరిస్తున్న
**భారత ఉపరాష్ట్రపతి డా॥ శంకర్‌దయాళ్ శర్మ**
ఆధ్యాత్మిక రచయిత్రి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి

# శ్రీ విష్ణు సహస్ర నామావళి వివరణ



శ్రీ విష్ణుసహస్ర నామావళి వివరణ గ్రంథాన్ని ది. 16-12-1983న
రాజ్‌భవన్ (హైదరాబాద్) లో ఆవిష్కరిస్తున్న
ఆంధ్రప్రదేశ్ గవర్నర్ గౌ॥ రామ్‌లాల్
ఆధ్యాత్మిక రచయిత్రి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి



# ముద్రణ కావలసిన గ్రంథాలు

1. ఈశ్వర గీత.
2. శ్రీ షిర్డి సాయిబాబా సహస్ర నామావళి వివరణ
3. నవదుర్గలు
4. శ్రీ గాయత్రీ సహస్ర నామావళి వివరణ.
5. శ్రీ సూర్యాష్టోత్తర శతనామావళి వివరణ.
6. శ్రీ గంగా సహస్ర నామావళి వివరణ
7. స్తోత్ర రత్నావళి
8. అష్టాదశ మహాపురాణ సంక్షిప్త చరిత్ర
9. పురాణాలలో గణేష్
10. దశావతారాలు.
11. కార్తీక మాస మహత్మ్యం
12. మార్గ శీర్ష మాస మహత్మ్యం
13. వైశాఖ మాస మహత్మ్యం
14. భగవద్గీతా మాహత్మ్యం
15. ఏకాదశి మహత్మ్యం

చాలామంది మన మూల గ్రంథాలను సులభమైన శైలిలో తెలుగులోనికి అందివ్వాలని అడుగుతున్నారు. వీటికి అను గుణంగానే ఈ రచయిత్రి రచనలు వచ్చాయి. పైన పేర్కొనబడిన గ్రంథాలే కాకుండా మరెన్నో గ్రంథాలు ముద్రణకు సిద్ధంగా ఉన్నాయి. పై గ్రంథాలే కాకుండా వేరే ఏ గ్రంథాన్నైననూ పూర్తిగా ఒక గ్రంథం ప్రచురించటానికి కావలసిన ఆర్థిక సహాయాన్ని అందజేసే అటువంటి దాతల ఫోటో. వారి సంగ్రహ జీవిత చరిత్ర వారు ముద్రించదలచుకున్న గ్రంథంలో ప్రచురించ బడుతుంది. ఇతర వివరాలకు రచయిత్రిని సంప్రదించగలరు.

